# అన్నపూర్ణమందిరము

Annapurna mandiramu

## నిరుపమాదేవి

Nirupama devi

విశ్వసాహితి
చెన్నపురి ఏజన్సీ
[illegible] ఎస్ప్లనేడ్ మద్రాసు



ప్రకాశకుడు:

కారుమూరి వైకుంఠరావు

నెం. ౩౩ తిరువత్తూరు హైరోడ్

మద్రాసు.

---

నవజీవన గ్రంథమాల—౧

విశ్వభారతి గ్రంథమాలకు

అ ను బం ధ ము

# అన్నపూర్ణ మందిరము

౧౯౩౧
1931

వెల రు ౧-౮-౦; కాలికో బైండు ౧-౧౨-౦

---

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

౨౯౨ ఎస్ప్లనేడ్ మద్రాసు.



# అన్నపూర్ణమ్మందిరము

## మొదటిపరిచ్ఛేదము.

.. ఊరిప్రక్కనే నది. అతినిర్మలమైన నీరు. అప్పు డెండ కాలమగుటచే నీరంతగా లేదు కాని వడిగా పాఱుచున్నది. ఒడ్డున జమీందారుగారి తోఁటలోని కొబ్బరిచెట్లు తలలెత్తు-కొని స్థిరముగా నిలిచియున్నవి, కాని సంధ్యవేళను వీచుచున్న మందమారుతస్పర్శవలన ఉండియుండి మెల్లమెల్లగ తల లాడించుచున్నవి. చెట్లనడుమ దాఁగియున్న శివాలయము బయటికి కనఁబడకున్నది, కాని యస్తగామి యగు సూర్యుని రక్తకిరణములు పడుటవలన నాలయశిఖరముననున్న యిత్తడి త్రిశూలము మాత్రము తళుకు తళుకు మనుచు కనఁబడు చున్నది.

ఇప్పటి కింక నెవ్వరును ఏటియొడ్డున కానరాలేదు, బాలిక యొకతెమాత్ర మప్పుడే వచ్చి, జమీందారుగారు చాల ఖర్చుపెట్టి కట్టించిన చక్కని మెట్ల వెంబడి దిగుచున్నది. ఆమె భుజముపై నొకచీరయును అంగవస్త్రమును యున్నవి, చంకను ఇత్తడి బిందె యొకటి యున్నది. బాలిక అడుగు

మెట్టు మఱికొ దిగి నాలుగువైపులను నొకమారు చూచి, యెవరికొఱకో కనిపెట్టుకొని యున్నదనునట్లు కొంచెమునే పక్కడ నిలచియుండెను.

కాని ఎవ్వరును వచ్చుజాడ యామెకు కనఁబడక యామె తనపొడిబట్టను మెట్లపైనుంచి నీటిలోనికి దిగినది. నీటిలో మునిఁగి పరధ్యానముగ, నీరు పుక్కిలించుచు నిలువఁబడినది. అట్టి సమయమున మఱియొక బాలిక యేటియొద్దునకు వచ్చి మీఁదిమెట్టుపైని నిలచినది. మొదటిబాలిక పరధ్యానముగ నుండుట చూచి రెండవబాలిక మెల్లమెల్లగ మెట్టుదిగి వచ్చి వెనుకను గొంచెము చప్పుడుచేసినది. చప్పుడు వినఁగానే మొదటిబాలిక యులికిపడి వెనుకకు తిరిగి చూచి కొంచెము నవ్వుచు "అబ్బా, భయపెట్టితివే!" అని యన్నది. "ఓస్, చంటిపిల్లవు, పాపము!" అని యెగతాళిచేసి రెండవబాలిక, "ఎంత పరధ్యానమే! నేను వచ్చితినని కొంచెమైనను తెలిసికొనలేకపోతివి! నీవు వచ్చి యెంతసేపైనదే?" అని పలికినది.

"ఇప్పుడే వచ్చితిని, నీవు నేఁడింత యాలస్యము చేసితివేల? ప్రతిదినమును నీవే ముందుగ వచ్చుచుందువే!"

"అది చెప్పెదను గాని, అంత పరధ్యానముగనుండి నీవేమి యాలోచించుచుంటివో అది ముందుగ చెప్పుము."

"నే నాలోచించునదేమి యుండఁగలదు?" అని సతి కళలేని నవ్వు నవ్వుచు ననెను.

"ఏమి యాలోచించుచుంటివి, అక్కైన?" అనుచు కమల సతిపై నీళ్లు విసరెను. ఐనను సతి జవాబుచెప్పక బట్ట నుతుక పోఁగెను. కమల సతిని బట్ట నుతుకనీయక, యా బట్ట నొక్కి పట్టుకొని, చెప్పకతీఱదు, చెప్పకున్న నీబట్ట వదలను" అనెను.

"అబ్బా! ఏమి నీవు చేయునది!" అని చీకాకుపడుచు సతి యనఁగానే కమల బట్టను వదలి పౌరుషము కొలఁది ముఖమటు త్రిప్పుకొనినది.

"నీకు కోపము చాల నలవాటే అక్కా," అని యను తప్పురాలై యనుచు సతి "పోనిమ్ము నాదే తప్పు; అక్కైన మఱల చెప్పుము ఏమి చెప్పుమనెదవో."

"విచారించుచుంటి వేల?"

"క్రొత్తసంగతి యేదియు లేదక్కా—మాయింటి సమాచారము నీవెఱుఁగని దేమున్నది? మాటి మాటికిని అడిగి యేమిలాభము, నాకు సిగ్గు తెప్పించుటయే కాని?"

"ఓహో! అవిచారమేనా? నే ననుకొన్నది—"

"ఔనౌను! అది నీ వనఁదగిన మాటయే—"

సతి వాక్యము పూర్తి చేయక మునుపే కమల ఇట్లన సాగెను—"నాయవస్థలో నీవున్నయెడల నీవేమి చేసియుందువో నేనెఱుఁగను—ఐనను చూడుము నీవలె నేను ముఖము-వాడఁబెట్టుకొని కూర్చుండలేదు!"

సతి కనులు విప్పి కమలవైపుచూచుచు నిలచియుండెను. ప్రకృతియొక్క శోభను రెండింతలుగఁజేయుటకై ప్రవీణుఁడగు చిత్రకారుఁ డెవఁడో చక్కని ప్రతిమ నొకదానిని జేసి నదీ వక్షమున స్థాపించెనా యనునట్లామె యుండెను. ముడినుండి తప్పించుకొని వచ్చిన ముంగురులు అప్పుడు వీచుచుండు మృదువాయువువలన నాడుచుండెను. నది తన నీలవక్ష-దర్పణమున ఆమూర్తిని ప్రతిబింబింపఁజేయుచుండెను. హీన తేజుఁడైన సూర్యుని రక్తకిరణము లచ్చటికి ప్రాకి వచ్చి యాదృశ్యమును మఱింత రమణీయముగఁ జేయుచుండెను. ప్రకృతి దయామయ, భాగ్యదేవత; కరుణావిహీన!

“నీకు విచారమేల కమలా? గొప్పయింటి ముద్దుబిడ్డవు నీవు, ఎటుచూచినను సుఖసంపదలు, ఐశ్వర్యము, చుట్టును నవ్వుముఖములతోనుండు అన్నదమ్ములు, అక్కసెల్లెండ్రు! వారు కష్టపడుచుండుట చూడవలసిన దురదృష్టము నీకెన్నఁడును కలుగదు. అట్టితఱి నీకేమి దుఃఖముండఁగలదు, ఏమి-కష్టము కలుగఁ గలదు?” అని మృదు స్వరముతో సతి ప్రశ్నించినది.

“ఏల యుండకూడదు సతీ? పేదయింటఁ బుట్టుటయే యన్నిటికంటె గొప్పదుఃఖమనుకొనుచున్నావా?”

“ఏమో! నాకేమి తెలియునక్కా!” అని కొంచెము దుఃఖముతో సతి జవాబు చెప్పెను.

'మేము నిరుపేదల'మని చెప్పుకొనుచు తిరుగుచుండుట సతి స్వభావమునకు విరుద్ధమగుటచే నామె యేమియు ననక యూరక నిలచియుండెను. కమల అప్పుడు, "కొంచె మాలోచించి చూడుము సతీ" యనుచు ప్రారంభించినది—"నీకష్టములవంటి కష్టములన్నియు నివారణ కాఁగలవు, కాని మనస్సుననుండు కష్టముల కెన్నటికిని నివారణలేదు."

"అట్లైన, నీకట్టి కష్టమేదియో కలిగినది కాఁబోలును?" అని యనుచు సతి కొంచెము నవ్వినది. సతి నవ్వవలెనని నవ్వలేదు, నవ్వు దానియంతట అదియే ఆమె ముఖమున కనఁబడినది.

"గొప్పయింటి పిల్లను నాకు కష్టముగాని దుఃఖముగాని యెట్లు రాఁగలదు సతీ?"

"క్షమింపుము కమలా, అపరాధము చేసితిని. సమాచారమేమియో చెప్పుము."

"నాకు పెండ్లియఁట! వింటివా?"

"పెండ్లియా? ఎప్పుడు?"

"నెల నెలపదునైదు దినములలో నగును—ఎవరికిచ్చి పెండ్లిచేయుదురని యడుగవేమి?"

"అది యెఱుఁగిన సంగతియే. *విశుదాదా కిచ్చి పెండ్లిచేయుదురు."

---

* విశు=విశ్వేశ్వరుఁడు
దాదా=అన్న

"కాఁదు కాఁదు, అట్లైనందులో మజా యేమున్నది? నేఁడెవరో పెండ్లిమాటలాడుటకు వచ్చిరి.

సతి విస్మితురాలై, "నీవు విశుదాదాను తప్ప మఱి యెవ్వరిని పెండ్లి యాడనంటివే, మీ యమ్మయు నాన్నయు నతనికిచ్చుట కిష్టపడలేదు కాఁబోలు?" అని యడిగినది.

"మా నాన్నతోఁగాని అమ్మతోఁగాని ఆయింటి వా-రెన్నఁడును నాప్రసంగము కదల్పలేదే—వీరిని నిందింప-వలసిన పనిలేదు."

"నీవుకూడ అట్లనుచున్నావు! ఎవరైన వినిన నవ్వఁ-గలరు!"

"ఓహో! సిగ్గు భరించలేకున్నాను కదూ! మనస్సులో-నున్నది చెప్పిన తప్పేమి?"

"పోనిమ్ము—ఇప్పుడైనను మీనాన్నకును అమ్మకును నీ యభిప్రాయము తెలియఁ జేసెదవా?"

"ఇతరులకు చెప్పుటకు ముందు ఎవరిసమ్మతి మవసరమో అతని మనస్సుననుండు ఉద్దేశ్యము తెలిసికొనుట యెట్లు?"

అది విని సతి యాశ్చర్యము చెందుచు అన్నది, "ఎవరి-మనస్సుననుండుమాట కమలా, విశుదాదా మనస్సుననుండు-మాటయా? ఛీ, ఛీ సిగ్గు సిగ్గు—నీది అంతి సాహసమే!"

"అది తప్ప వేఱు మార్గ మేమున్నది సతీ? నీవు పుస్త-కము లేవియు చదువుచుండవేమో!" అని కొంచెము విసుగుఁ జెందుచు కమల యన్నది.

"రామాయణము, భారతము, చదువుచుందును" అని నిరుత్సాహముతో పలికినది సతి.

కమల కొంచెమెగతాళిచేయుచు, "అట్లైన అన్నియు చదివినట్లే లెక్క," అని నవ్వి, "నేఁడు మాయింటికొకమాఱు రమ్ము, నీకు చదువవలెనని యున్నచో మంచి పుస్తకముల నీయఁగలను," అని యన్నది.

సతి యులికిపడి కమలవైపు చూచినది—తనయవస్థకును కమలయవస్థకునుగల భేదము హఠాత్తుగ నామెకు తట్టి, దృఢస్వరముతో, "వద్దమ్మా వద్దు, ఆపుస్తకములతో నాకేమి యవసరము!" అని యన్నది.

"పుస్తకము లవసరము లేక పోనిమ్ము, మాయింటికి-మాత్రము రావలెను!"

"చెప్పలేను, మాపెత్తల్లి కోపపడకపోయినయెడల వచ్చెదను."

"మీయమ్మ అంత మంచిది కదా, మీపెత్తల్లిది అట్టి-స్వభావమేమి సతీ?"

"నాకెట్లు తెలియును?—ఇఁక మనము పోదము రమ్ము, ఆలస్యము చేసినయెడల దారిలో నందఱు కనఁబడుదురు."

ఇద్దఱును నీటినుండి బయటికి వచ్చి మెట్లెక్కసాగిరి. నిండుబిందెను మోయుట సతికి కష్టముగనుండుట చూచి కమల "అంతపెద్ద బిందె తీసికొనిరాకున్న నేమి?" అని యనినది.

"తీసికొని రాకున్న ఎట్లు?"

"అది మీయమ్మ తీసికొని రావచ్చును!"

"మాయమ్మ తీసికొని రాఁగలిగినప్పుడు నేనేల తీసికొని రాలేను?"

"మీచెల్లెలు, సావిత్రి, తీసికొనిరావచ్చును!"

"ఏమి మాట! అది చిన్నపిల్ల పాపము!"

కమల పెదవులు విఱుచుకొనుచు ఆహా, ఎంతచిన్న-పిల్లకదా! మా అయితే నీకంటె రెండేండ్లేనాచిన్న?— "అంతకూడ లేదేమో!" అని యన్నది.

"అట్లనకు కమలా! నాకంటె అది మిక్కిలి యోరిమి-గలది. మీయింటివంటి గొప్పయింటిలో నట్టిపిల్ల లుండరు. ఆమాట మఱవకు. మాతమ్ముఁడెల్లప్పుడును 'ఇది కావలెను. అదికావలెను' అనుచు అల్లరిచేయుచుండును, మాసావిత్రి అదియంతయును ఓర్చియుండును, మాఅన్నయ్య అనేకవిధ-ముల నామెను కష్టపెట్టుచుండును, దొడ్డమ్మ దినమంతయు తిట్టుచుండును—ఇవి యన్నియును అది సహించుచుండును, నాన్న యెల్లప్పుడును నేదో పని చెప్పుచుండును—ఆపను-లన్నియును సావిత్రి విసుగులేక చేయుచుండును. అది భరించుదానిలో నాల్గవవంతు నేను భరించలేను, అది చేయుదానిలో సగము నేను చేయలేను. నిది పేదలయింటిపిల్ల గనుక, దానిలోనుండు గుణము మీకంటఁబడదు."

కమల కొంచెము తడఁబడుచు ఏమియు ననక ఊరక నిలచియుండెను. సతికిని కమలకును గలప్రేమ అద్భుతమైనది. కమల కోరి యెన్నడును సతికి నొప్పి కలిగింపదు. కాని యల-వాటు కొలఁదిని గొప్పయింటిమాట లామెనోటికి వాని-యంతట నవియే వచ్చుచుండును. సతికి వానిని సహించి యూరకుండునభ్యాసము లేదు—ఆమె గట్టిగా రెండు-మాటలు వినిపించియే వదలును. అయినను కమలకుఁగాని సతికిఁగాని కోపము చాలసేపుండదు.

కమల కంగారు పడినది, కోపగించినది—అయినను రెండు నిమిషములు కాకమునుపే, "నే నట్లంటినే సతీ? నీవు-మాత్రము ఒకమాటకు పదిమాటలు బదులు చెప్పుచుండ లేదా?" అని యన్నది.

సతి యామెవైపు చూచి నవ్వుచు, "నిన్ను చెప్పవద్దని నే ననలేదే," అన్నది.

"నా కది చేత కాదమ్మా. పోనిమ్ము, ఆమాట లటుండ నిమ్ము—నీవు మాయింటి కెప్పుడు వచ్చెదవో ఆమాట చెప్పు మిప్పుడు."

"వచ్చెద నెప్పుడో ఒకనాఁడు"

"అట్లు పనికిరాదు. నీసలహా నాకొక విషయమున కావలసియున్నది. నీవు లేనిదే నేనేమియు చేయలేకున్నాను, ఆలస్యముచేయక నీవొక మాఱు రావలెను—వచ్చెదవా?"

"ఆహా వచ్చెద"

మజాఫర్ పూర్ లో ప్రఖ్యాతిఁజెందిన జమీందారుగారి-యింటిపిల్ల కమల, సర్వసుఖములను అనుభవించుచు మిగుల ముద్దుగా పెరుఁగుచున్నది. రామశంకరభట్టాచార్యుని కొమార్తె యగుసతితో నామెకు మైత్రి యెట్లు కుదిరెనో చెప్పుట కష్టము. నిరుపేదలకు ధనికులతో స్నేహ ముండుట ఆశ్చర్యకరమగు విషయమే. కమల తన యింటివారిపోట్లు సహింప నక్కఱలేకుండ నీపని సాధింపఁగలిగెనని మన మను-కొనుట పొరపాటు. ధనికులమాట యనుకొనునప్పుడు పేద-వారి మనస్సులయం దొకవిధమగు నభిమానముపుట్టుచుండును. అది జ్ఞప్తికి వచ్చి సతియింటివారుఁగూడ సతిని జాగ్రత్తగ-నుండుమని పలువిధములఁ జెప్పుచుందురు. ఇది కొంచెము యోచనీయ మగువిషయమని రెండిండ్లవారికిని దోఁచుచుం-డెను. కాని సతీకమలలు మాత్ర మొకరి నొకరు విడువ-లేదు. రూపునందును, వయస్సునందును, బాల్యోచితమగు స్నేహాభిలాషయందును ఇద్దఱికిని పోలికయుండెను. ఈకార-ణముల వలననే యీస్నేహము సంఘటిల్లినదని చెప్పవచ్చును. పదుమూఁడేండ్లబాలిక కమల, పండ్రెండేండ్లు సతికి. కనుకనే వారియం దన్యోన్యముగ నుండు నీగాఢానురాగ మిప్పటికిని నిలిచియున్నది.

కమల యింటికివచ్చి మంచముపై పరుండియుండెను. పెండ్లిమాట వినినప్పటినుండి కమలకు నిజముగనే దుఃఖ మారంభమయ్యెను. ఆమె తన పెండ్లివిషయమై నిశ్చయము-

చేసికొని యిప్పటికి సుమారు మూఁడుసంవత్సరము లైనది. కమల యొకనాఁడేటిలో నీఁదఁబోయి ప్రవాహమున కొట్టుకొనిపోవుచుండ నొడ్డుననున్న విశ్వేశ్వరుఁ డదిచూచి ఆమెను నీటినుండి పైకిలీసి రక్షించెను. సతితప్ప మఱియెవ్వరు నీవృత్తాంత మెఱుఁగరు. అప్పటినుండి యీమూఁడుసంవత్సరములు కమల యనేకపుస్తకములు చదివినది. అట్టిఘటనదైన తరువాత జరుగునది యేపుస్తకముననైన నొక్కటియే!

విశ్వేశ్వరుఁడు కురూపికాఁడు, నవయౌవనమున నున్నవాఁడు, స్వశాఖవాఁడు, అతనికి పెండ్లి యింకను కాలేదు. కమలకూడ రూపవతి, గొప్పయింటిపిల్ల, ఇంకను పెండ్లి కాలేదు. ఇట్టి సందర్భములలో ప్రేమోదయమగుటయు, అది వివాహరూపమున పరిణమించుటయు తప్పక జరుగుసంగతులే. వారిప్రేమ యిప్పటివఱకు రూపమును ధరింపలేదు—నిజమే, కాని దానికి తగినకారణము లేకపోలేదు—విశ్వేశ్వరునియిల్లు దూరమున మఱియొకవీథిలోనున్నది. కమలయింటి కతఁడు వచ్చిపోవు నలవాటులేదు. ఆఘటన జరిగిననాఁటినుండి విశ్వేశ్వరుఁడు కమలకంట నొక్కనాఁడైన పడలేదనియే యనవచ్చును. కాని, పైనుదాహరించిన సూత్రముననుసరించి ప్రేమించుబాధ్యత కమలపై నుండెను—బాధ్యతగనే కాకుండకూడ కమల విశ్వేశ్వరుని ప్రేమించుచుండెను. కనుకనే విశ్వేశ్వరుఁడు మాత్ర మేల కమలను ప్రేమింపకుండును? కమలకుండునట్లు విశ్వేశ్వరునికికూడ పెండ్లి చేసికొనవలెనని

కోరికయున్నదని చెప్పుటకు తగిన ప్రమాణము లేకుండెను— కాని యిట్టివి పుస్తకములలోఁ దఱచుగా సంభవించు-చుండును;—చివరపుటలోమాత్రము పాణిగ్రహణము జరుగుచుండును. కమల చదువుపుస్తకములలో దేనిలోనైన నట్టిది తుదకు జరగనిచో నామె యాగ్రంథకర్తను శపించుచుండును. జీవననాటకమున అట్టి తుదియంకమును చూచుట-కెన్నఁడును కోరునది కాదు కమల.

కమల చాలసేపాలోచించుచు మంచముపై పరుండి-యుండెను. భోజనమునకు రమ్మని పిలువవచ్చిననౌకరును బయటికి తఱిమి కమల తలుపుమూసి గడియవేసి లోపునఁ-గూర్చుండెను. అప్పుడే వచ్చిన క్రొత్తపుస్తక మాగదిలో నుండెను. కమల దానిని చేతఁబుచ్చుకొని చివరపుట తీసినది. అందు నాయికానాయకులు హాయిగా సంసారయాత్ర సలుపు-చుండుట చూచి కమల మిగుల సంతసించుచు నిట్టూర్పువిడిచి-నది; మంచముపై పరుండి పుస్తకము చదువ నారంభించినది. అత్యుత్సాహముతోఁ జదువుచుఁ దనయవస్థను పూర్తిగా మఱచి యందుండునాయికానాయకుల దురవస్థనుగూర్చి యేడ్వ మొదలుపెట్టినది. ఏడ్చియేడ్చి నిద్రపోయినది. ఎంతోసేపైనతరువాత, మొదట నౌకరును పిమ్మట తల్లియు వచ్చి తలుపు కొట్టగా కమలకు మెలఁకువవచ్చినది గాని యేసంగతియు జ్ఞప్తికి రాలేదు.

# రెండవపరిచ్ఛేదము.

అప్పుడే తెల్లవారినది. ఎట్టిమరమ్మత్తును లేక కూలుటకు సిద్ధముగ నున్నట్లు కనఁబడుచుండు చిన్న గడ్డి యింటియరుగుపై కూర్చుండి అకాలవృద్ధుఁడగు రామశంకర భట్టాచార్యుఁడు గుడుగుడు పీల్చుచుండెను. దగ్గఱను చూరునుండి వ్రేలాడు పంజరమునందుండు రామచిలుక అప్పుడే నిద్రనుండి లేచి "దుర్గ-కృష్ణ కృష్ణ" మొదలగునామములు స్మరించి పిమ్మట భట్టాచా-ర్యుఁడు దగ్గినట్లు శబ్దముచేసినది, గుడుగుడుత్రాగినట్లు శబ్దము-చేసినది. పడిపోవుటకు సిద్ధముగనున్న వంటయింటి మెట్ల-ప్రక్కను పరుండియున్న కుక్క హాయిగా గుఱ్ఱుపెట్టుచున్నది. వాకిట పాతినకట్టకు కట్టియున్న ఆవు అత్యనురాగముతో దూడను నాకుచున్నది. ఎటువైపు చూచిన నెట్టి చలనమును లేదు, అంతయు శాంతముగ నున్నది.

అంగణమున మూలనుండు అరఁటిచెట్టుయొక్కయాకులు నాలుగును గాలికి కొంచెము కదలుచున్నవి, కాని గాలి అతి-మందోత్సాహముగ వీచుచుండుటచేత చెట్టునకు చలనమున్నట్లే కనఁబడకున్నది. అంతయును ఇంత నిశ్చింతగను, ఇంత స్థిర-చిత్తముగలదిగను నున్నప్పుడు మనుష్యుఁడొక్కఁడే యింత యాందోళనపడుచు, దిగులుచెందుచునేలయుండవలెనో కదా-యని కాఁబోలు రామశంకరుఁ డనుకొనుచున్నాఁడు! పక్షి-

యుల్లాసముగ మాటలాడుచున్నది, హాస్యమాడుచున్నది; ఆవు ప్రీతితో దూడకు ముద్దుచేయుచున్నది, కుక్క యెట్టి చింతయు లేక నిద్రించుచున్నది—వీనిలో దేనికిని నెట్టి విచారమును లేదు. వానికికూడ తిండి యవసరమే కాని తిండికై యవి యోచించి చావనక్కఱలేదు. మాకొఱకు మనుష్యులెవరో తగిన యేర్పాట్లు చేయుచుందురని బాగుగ మేమెఱుగుదు మనునట్లు అవి హాయిగా నున్నవి. మనుష్యులకొఱకాలోచించువారు లేకుండుటయేమి? ఎన్నియో ప్రయత్నములుచేసి, ఎన్నియో యెత్తులువేసి, ఎంతయో కష్టపడినగాని మనుష్యునిపొట్ట నిండకుండుటయే, మనుష్యుఁడు తన సంసారమును గడపలేకుండుటయే? భూదేవి కింత పక్షపాతమేల? ఎవరివలన నామె యింత గొప్పదగుచున్నదో వారియెడలనే యామెకు దయలేకుండుటయేల?

ఈరీతినాలోచించుచు భట్టాచార్యులవారు గుడుగుడు పాగతో నొకచిన్న మేఘమును నిర్మించిరి. ఎముకలుమాత్రము మిగిలియున్న దేహమువలె ఆపాతయింటిని మిగిలియున్నవి. ఇటికలు మాత్రమే. ఆయింటి తలుపు తెఱచి రమణియొకతె బయటికి వచ్చినది. సన్నని యొప్పారుచు చీరకట్టుకొనియున్న ఆమెచేతులకు రెండేసి శంఖపుగాజులున్నవి, నొసటను చిన్న కుంకుమబొట్టున్నది—ఆమె ఈసామాన్యవేషముతోనే ఆయరుగును దేదీప్యమానము చేయుచున్నది. నూతినుండి నీళ్లుతీసి ఆమె వాకిటఁ జల్లినది; తులసిచుట్టు స్థానాడ్చి

అలికినది; చేతులుకడుగుకొని ఒక చెంబుతో నీళ్లును, పండ్లు-దోముపుల్లయు భర్తయొద్ద నుంచినది. పిమ్మట పైటచెంగు మెడచుట్టు త్రిప్పి భర్తయెదుటకు వచ్చి తనతల నేలకుఁ దగి-లించుచు భర్తకు ప్రణామముచేసి మృదుస్వరముతో నిట్లన సాగినది—"ఇంత పెందలకడ లేచితిరేల? రాత్రి గుండెభార-మంత యధికముగ నుండెను కదా, చల్లగాలి తగలనీయుచున్నా రేమి?"

.. భట్టాచార్యుఁడు హుక్కా గొడకు చేర్చవైచి నోటి-నుండి పొగవదలి భార్యతో నిట్లనెను—"గుండెనొప్పి తగలఁ-బడ! చావు వచ్చిన బాగుండును, బాధయంతయు వదలి యుండును. చావుతప్ప మోక్షమార్గము వేఱేదియు కానరా-కున్నదే!"

ఆ సాధ్వీమణి దుఃఖితురాలై భర్తవైపు చూచుచు నిలచియుండెను. భట్టాచార్యుఁడుకూడ మాటలు చాలించి కనుబొమలు ముడుచుకొనుచు నాసమీపమున నున్న మామిడి చెట్టువైపు చూచుచుండెను. కొంత సేపైనతరువాత ఆరమణి "ముఖము కడుగు కొనుఁడు," అని భర్తతో అన్నది.

"ముఖము కడుగుకొందునులే, ముఖమునకు తొంద-రేమి? ఇంట పప్పు బియ్యము ఉన్నవికదా?"

భార్య నోటితో జబాబీయక లేదని తలయూచినది. భర్త "భూమియమ్మినరూపాయ లైపోయినవా?" అని బిగ్గరగా నడిగెను.

"దానివలన వచ్చిన రూపాయలు చాలతక్కువ. ఈ మూఁడుమాసములును వానితోనే గడపితిమి—ఇంక నెన్నాళ్లు రాఁగలవు?"

"నేను మాత్ర మెక్కడ తీసికొనిరాఁగలను, కన్నము వేయనా? ముష్టియెత్తనా?"

భార్య కన్నులు తుడుచుకొనుచు నిలచియుండెను. భర్త విసుగుఁజెంది "ఏడ్చుటయే మీ రెఱిఁగినపని, ఏడ్పువలన కోరిక ఫలించినయెడల నేను కూడ నేడ్చియుందును," అనెను. కాని గొంతు తగ్గించి తత్క్షణమే, "నేను మఱి నేఁడు తిరుగలేను, నేఁటి కెట్లైన గడపుకొనుము, రేపటిమాట చూచుకొందము," అని యనెను.

రామశంకరుఁడు లేచి ప్రాతఃక్రియలను ముగించుకొనవలెనని బయలుదేఱెను. భార్య పెద్దనిట్టూర్పు విడిచి చీపురు చేతఁ బుచ్చుకొని అరుగు, వాఁకిలి తుడుచుట మొదలుపెట్టి రెండు మూఁడు మాఱును 'సతీ' 'సతీ' అని పిలిచినది.

తలుపు తెఱచి కనులు నులుముకొనుచు మొగ్గవలె కాన్పించుచుండు బాలికయొకతె అరుగుపైకి వచ్చి నిలిచినది. తల్లి అంగణము తుడుచుచుండుట చూచి క్రిందికి దిగి తల్లియొద్దకు వచ్చి "ఏమమ్మా?" అని యన్నది.

"సతి యింకను లేవలేదమ్మా? అక్క వాకిలి తుడుచుచుండిన నేను నీళ్లుతోడియుందును."

"నేను నీళ్లుతోడెదను," అనుచు బాలిక నూతియొద్దకు పఱుగెత్తినది. "నీవు తోడలేవే, అమ్మా, నేను వచ్చుచున్నాను బిందె అక్కడ నుండనిమ్ము," అని తల్లి బిడ్డను నివారించినది.

బాలిక ఆమాట లక్ష్యపెట్టక నీళ్లుతోడుట మొదలు పెట్టినది. మిగులమాటలాడునది కాదు జాహ్నవి, మఱియొకటి రెండుమాఱులు వద్దని కొమార్తెతో చెప్పి తాను చేయుచున్న పని పూర్తిచేయుచుండెను.

ఆయింటనే వారితోఁగూడ సతి పెద్దనాన్నగారిభార్య, వితంతువొకయామె యుండెను; ఆమె అంగణములోనికి వచ్చి నిలువఁబడి, తోడికోడలు ఇంటిపని చేయుచుండుట చూచి, పెద్దకంఠస్వరముతో మాటలారంభించినది— "తల్లియును, కూఁతురును మిగుల సందడితో పనిచేయుచున్నారు, ఆవల బియ్యమునిండుకొన్నవని ఎంతమొఱపెట్టుచున్నను ఆమాటలు చెవినిపడవు కాఁబోలు? అబ్బాయి యెక్కడికి వెళ్లినాఁడు? బజారున కిప్పుడే వెళ్లుటమంచిది, కాళీపదుఁడు లేవఁగానే అన్నము పెట్టుమనును—గొల్లది నిన్నను పాలీయనేలేదు, జ్ఞప్తి యున్నదా? పాపమదిమాత్ర మెట్లీయఁగలదు, మీధోరణి చూచినచో ఏడుజన్మములవఱకు అప్పుతీర్చెదరని తోఁచదెవరి కైనను. అది, పాపము, డబ్బుగలది గనుకనా—ఎక్కడినుండి తేఁగలను?"

జాహ్నవి భయపడుచు ప్రత్యుత్తరమిచ్చినది—"ఆ మాటలన్నియు నిప్పుడేల అక్కయ్యా? దుఃఖించి దుఃఖించి

అన్న—2

ఇప్పుడే బయటికివెళ్ళినారు, వినినయెడలచాలకష్టముగనుండును. మనకిది ఎల్లప్పుడు నుండునవస్థయే కదా! గొల్లదానిమాటలు యేమంటివి? దానికి మన మంతగా సీయవలసినది లేదే, ఈ ఒక్కనెలదే మనము బాకీ యున్నదంతయు!"

పెత్తల్లి ఝూంకారముతో ప్రారంభించినది. "అదిమాత్ర-మేమి తక్కువ అయినదా? మీకు తిన్నగా మాటలాడుట-యైనను చేతకాదే—మీకు లేనప్పుడు నాకుమాత్ర మెందుకు? పిల్లవానికి పాలులేక పోయినయెడల కష్టమగును—చావ-నిమ్ము—" ఇట్లు గొణుగుచు ఆవుకు గడ్డి వేయుటకు సాలలోనికి-పోవ నక్కడ ఆమెదుఃఖము మఱల రేఁగినది; "దరిద్రగొట్టు-ఆవు, ఎప్పుడు చచ్చునోగాని! దూడపెద్దది కాఁగానే మఱి పాలయదు. తిండిమాత్రము తినుచు కూర్చుండును!" అని అన్నది. సావిత్రి సంకోచించుచు, తినుటకు దానికి బాగుగ మేత దొరకుటయేదీ, పాలిచ్చుటకు!" అన్నది.

పెత్తల్లి ఆమాటలు చెవినైనను పడనీయలేదు. పండు-కొనియున్న కుక్కదగ్గఱకు పోయి కఱ్ఱతో దానివీపుమీఁద ఒక్కపెట్టుపెట్టినది. పాపమది "కైఁ కైఁ" మనుచు పఱుగెత్తి-నది. ఈకథ చూచి పిట్ట గాబరాపడుచు ఊరకుండెను. ఎదుట మఱియెవ్వరిని కానక పెత్తల్లి పిట్టపైఁబడ్డది—"అభాగ్యపు ఇంటికి అభాగ్యపు పిట్ట! ప్రొద్దుట లేచి నోటివెంట 'రామ' 'కృష్ణ' వినను లేదుకదా!"

ఈగొడవవలన సతికి తెలివివచ్చినది! బయటికి వచ్చి అందఱును ఏదో పనిచేయుచుండుట చూచి సిగ్గుపడుచు 'ఎంతవేళైనది!' అని మెల్లగా అన్నది. ఆమాట పెత్తల్లి చెవినిపడ్డది; "దీపము వెలిఁగింపవలెను, పాపము, పిల్లకు చీకటిలో కండ్లు కనఁబడకున్నవి" అనుచు ఆమె వేళాకోళము చేసినది. సతి తప్పుచేసితినని గ్రహించి ఆమాట కుత్తరమీయక తల్లియొద్దకు పోయి, ఆమెను లేవమని తాను అంట్లుతోమ మొదలుపెట్టినది...

"అట్లైన నేను స్నానముచేయుటకు పోయెదను" అన్నది. జాహ్నవి.

"పొమ్ము."

భట్టాచార్యుఁడు ముఖము, కాళ్లు చేతులు కడుగుకొని వచ్చి అచ్చట నిలుచునసరికి అతని కొమారుఁడు, హరిశంకరుఁడను పదునాలేండ్ల అబ్బాయి యొకఁడు తండ్రియొద్దకు వచ్చి ఇట్లనసాగెను.—"బడికి వెళ్లనియెడల తిట్టుట యెఱుఁగుదురు, కాని మఱి యేసమయమునను జ్ఞానముండ నక్కఱలేదు కాఁబోలు. కాళ్లకు జోళ్లులేకుండ నలుగురు కుఱ్ఱవాండ్రనడుమకుపోవుట యెట్లు? నాకు చెప్పులు కావలెను, ఇప్పుడే కావలెను"

అది విని, జాహ్నవి వచ్చి పిల్లవాని చేయిపట్టుకొని, వేఁడుకొనసాగెను.

"హరీ, అట్లనకుము నాయనా, ఇప్పటికి ఎట్లైనను గడుపుకొనుము, తరువాత—"

"తరువాత నేమి? ఎన్నాళ్లీలాగున వెళ్లుట? నాన్నా; నాకు నేఁడే కావలెను జోళ్లు."

"పేదయింటఁ బుట్టినవానికి ఇంత బాబూగిరి ఏల? ఎవని స్థితిని అనుసరించి వాఁడు నడుచుకొనవలెను. మీ-కొఱకు నేనిఁక కన్నము వేయుటకు బయలు దేఱవలెనా?" అని కొంచెము తీవ్రముగా రామశంకరుఁడు జవాబిచ్చెను.

పెత్తల్లి అది విని ఝూంకారముతో పల్కుకనారంభించి-నది; "అదియంతయు వానికేమి తెలియును? ఆమాత్ర ·మీాయ-లేనప్పుడు తండ్రి వెట్లు కాఁగలిగితివి? బంగారుతండ్రి పిల్లవాఁడు ఎప్పుడును తలవాల్చుకొని తిరుగుచుండును, చూచుటకు సిగ్గువేయదేమో?" మూఁడేండ్ల అబ్బాయి కాళీశంకరుఁ డప్పుడు-వచ్చి తల్లి చీరచెంగు పట్టుకొని, "ఆకలివేయుచున్నదమ్మా, అన్నము పెట్టుము," అనెను. రామశంకరుఁడు వడివడిగా ఇంటి-లోనికిపోయి, బట్టలచిక్కనుండు కండువాతీసెను. జాహ్నవి కూడ వతని వెనుకనే ఇంటిలోనికి వచ్చి," కండువాతీయు-చున్నారు, ఎక్కడికి వెళ్లెదరు?" అని యడిగెను

రామశంకరుఁ డటువైపు చూడక గదిలోనుండి బయ-టికివచ్చెను. భార్య చిన్నకొడుకునెత్తుకొని అతనివెనుక నేఅంగ-ణములోనికి దిగి, "ఎక్కడికి పోవుచున్నారు?" అనియడిగెను.

"ఎట్టిడేూర్పాటైనను చేయఁగలిగినచో ఇంటికి తిరిగి వచ్చెదను, లేనియెడల ఇదే ఆఖరు జాహ్నవీ" అనుచు భట్టా-చార్యుఁ డిల్లువెడలెను.

జాహ్నవి దిగులుఁజెందుచు పెద్దకొడుకుతో అన్నది; "హరీ, వెళ్లకుము వెళ్లకుము. ఎక్కడికి వెళ్లుచున్నారో చూడుమమ్మా, బోధపఱచి యింటికి తీసికొనిరమ్ము నాయనా, వెళ్లకుము తండ్రీ."

"వెళ్లుట ఎక్కడికి! ఎక్కడికిని వెళ్లఁడు. తిరిగి తిరిగి తనయంతట తానే రావలసియుండును. నేను చాంద్‌పూర్ నరేన్‌బాబుగారి యింటికి వెళ్లిపోవుచున్నాను. నన్నక్కడ ఉండిపొమ్మని అతఁడెంతో బలవంత పెట్టుచున్నాఁడు. మీమాట యాలోచించి నేను దాని కొప్పుకొనకుంటిని. కాని ఇఁక మఱి ఇక్కడ నుండను—ఈ ఇంటి అన్నము ముట్టినవాఁడు చండాలుఁడు!"

జాహ్నవినోట మాటరాలేదు, చూచుచు నచ్చటనే నిలిచియుండెను. సతి అంట్లుతోముట మాని అన్నకడకు పఱుగెత్తి వచ్చి, "ఛీ ఛీ, అది ఏమి అన్నా! ఏమి నీవనునది. నీకేమి మతిపోయినదా పూర్తిగా? అట్లు పోఁగూడదు, రమ్ము-ఇంటికి. మమ్మిట్లు వదలి మీరు పోయినయెడల మాగతి ఏమికాను? ఇంటివైపు మరలుము, నాన్నను తీసికొనిరమ్ము!" అనియన్నది.

"మీ కిష్టమైనపని మీరు చేసికొనవచ్చును, నేను మాత్రము వెళ్లక మానను"

ఇట్లనుచు హరిశంకరుఁడు ఇల్లు విడిచెను. సావిత్రి పఱుగెత్తివచ్చి అన్న చేతులు పట్టుకొని వేఁడుకొనసాగెను—

"అన్నా, నీకాళ్లు పట్టుకొందును, కోపగింపకుము, నాన్నను పోనీయకుము, నీవు పోయి నాన్నను మఱలింపు మన్నా!"

బాలికను ప్రక్కకుఁ ద్రోసి అన్న వెళ్లిపోయెను.

చిన్నవానిని ఎత్తుకొనియున్న జాహ్నవి ఆయంగణములోనే చతికిలఁబడిపోయెను, తలపై నుండు ముసుఁగు సగము జాఱిపోయినది. బూడిదచేతులతో బొమ్మవలె నిలువఁబడిపోయినది సతి. సావిత్రి మఱల అలుకుట్లకు కూర్చున్నది కాని కన్నులు నీటితో నిండుచుండుటవలన సరిగా చూడలేకున్నది. ఈవల పెత్తల్లిగారు ఇంటఁ జరిగిన కథను తన యేడ్పుమూలమున వీథివారందఱికిని చాటించుటకు మొదలుపెట్టినది.

రామశంకరుఁడు మనోవేగముతో ఊరి బయటికి వచ్చి రోడ్డు విడిచి పొలముగట్లు పైఁబడెను. ఎదుటనే దారి కనఁబడిన ఆదారినే పోవ నిశ్చయించుకొనినవానివలె నతఁడు పోవుచుండెను. కాళ్లకు ముండ్లు గ్రుచ్చుకొనుచుండెను. పొలముగట్టు కాళ్లకు తగిలి యతడు త్రుళ్లుచుండెను. కాని దేనిని లక్ష్యపెట్టకుండెను. ప్రక్కపొలమున కూర్చుండి గొప్పుత్రవ్వుచున్న పరాణ్ మండల్, "ఇల్లిటు పోవుచున్నారు స్వామీ?" అని యడిగెను.

"యమలోకమునకు," అనుచు రామశంకరుఁ డటుముఖమైనను త్రిప్పక పోవుచుండెను.

"భట్టాచార్యులుగారూ! ఈదారిని ఎక్కడికి పోవుచున్నారు?"

భట్టాచార్యులు ముఖమెత్తి చూచుసరికి ఆపేటనే సవాసము చేయుచున్న విశ్వేశ్వరమైత్ర అతనికి కనఁబడెను. చేతితో బట్ట కొంచెము మీఁదికెత్తి పట్టుకొని దున్నినపొలము వెంబడి నడుచుచు విశ్వేశ్వరుఁడు రామశంకరునివైపునకు వచ్చుచుండెను. రామశంకరుఁ డులికిపడి నిలిచెను. ఎవరికంటను బడకూడదని పొలముదారి పట్టినను రామశంకరుఁడు చివర కితనికి దొరకిపోయెను. విశ్వేశ్వరుఁ డతనిని సమీపించి వినయముతో మఱల "ఈదారి నెచ్చటికి పోవుచున్నారు?" అని యడిగెను.

"కోరి యెటువైపునకును పోలేదు, ఏవైపునకు పోయినను నాకొకటే, బాబూ."

"ఇటువైపు దారిలేదు, ఎవ్వరును ఈవైపు వెళ్లరు, మీ రెక్కడికి పోఁగలరీలాగు?"

"నీవాదారినే వచ్చుచుండి ఎవ్వరును వెళ్లరనుచున్నావేమి బాబూ?"

"నామాట విడువుఁడు, మామూలుదారిని వెళ్లినట్లైన ఆలస్యమౌనని ఈదారిని వెళ్లుచున్నాను."

"నేనుకూడ నట్లే చేయుచున్నానని అనుకొనఁగూడదా?"

"నేను తారాపూర్ ఫ్యాక్టరీ వర్తకులయొద్దకు వెళ్లియుంటిని, వర్తకము విషయమై యేర్పాటు చేయవలెనని

ప్రయత్నించుచున్నాను. దగ్గఱగఁదా యని ఈ దారిని ఇంటికి వచ్చుచున్నాను."

"నేను కూడ కొంచెము పనిమీఁద వెళ్లుచున్నాను బాబూ, పనిలేనిచో ఎవరైన పొలములవెంట పడరుకదా!"

"మీరు నాదగ్గఱ దాఁచుచున్నారు భట్టాచార్యులు గారూ, చెప్ప కూడనిది కానిచో నాతో చెప్పరాదా? నేను మీ వాత్సల్యమున కర్హుఁడను, పుత్రతుల్యుఁడను, నాయెదుట సంకోచింపకుఁడు."

"సంకోచమేల నాయనా! సంకోచ మేల?"

"నేను మీ కెట్టిసాయము చేయఁగలిగినను కృతార్థుఁడ భావించెదను."

భట్టాచార్యుఁడు స్థిరనేత్రములతో ఆయువకునివైపొకమాఱు చూచెను. సరళత, ఉదారత, అనురాగము వాని ముఖమున కనఁబడుచుండెను—ఎట్టి నటనగాని, ఎగతాళిగాని దానిలో కనఁబడలేదు. భట్టాచార్యుఁడు మృదుస్వరముతో అప్పు డిట్లనెను—"నీవర్హుఁడవని నే నెఱుఁగుదును, కాని నేనొక్కమాట యడిగెదను చెప్పుము—ఇతరుల సాయమును పొందుటకు, ఇతరులకు నేనేమి సాయము చేసితిని?"

"ఉపకారరూపముగ కాదు—ప్రేమతో నిచ్చిన దానిని ప్రేమతో పొందుకొనుఁడు."

"ఉపాయ మేదైన చూడవలెనని బయలు దేఱితిని—ఉపాయమేదియు కానరానిచో నాదారి నేను చూచుకొందును."

విశ్వేశ్వరునిలో కొంచెము పులకరింపు పుట్టినది; భయపడుచు "దేనికొఱకై మీరు చూచుచున్నది! ఉద్యోగమేదైన చూచుకొనవలెనని బయలు దేఱితిరా?"

"మొదటి ప్రయత్నము ఉద్యోగముకొఱకే!"

"సరే, నేను చేయఁగలసాయ మందుకొనుటకు మీ కిష్టము లేనప్పుడు, తారాపూర్ ప్యాక్టరీకి పోవుదము రండు. పదిపండ్రెండు రూపాయల జీతముపై పనిచేయువాఁడొకఁడు కావలెనఁట వారికి, ఆపని మీరు చేయఁగలరా?"

"నేఁడే ప్రారంభించెదను. కాని జీతము మాత్రము ముందుగానే నాకు దొరకవలెను. నేఁడే జీతము నాచేతిలో పడవలెను."

"ఆహా పడును, నాతో రండు"

ఇద్దఱును బయలు దేఱిరి. విశ్వేశ్వరుఁ డొకమాఱు అట్టువైపు తిరిగి పెద్దనిట్టూర్పు విడిచెను—రామశంకరుఁ డెట్టియవస్థలో నున్నాఁడో అతనికి బోధపడినది.

# మూఁడవపరిచ్ఛేదము.

విశ్వేశ్వరుఁ డొక పల్లెటూరివాఁడు. అతనితండ్రి మంచి ధనవంతుఁడు, ఆగ్రామములో అతనికిమించిన ధనవంతుఁడు లేఁడు; కాని పై వ్యవహారములనుబట్టి అతఁడు ధనవంతుఁడని ఎవ్వరికినితట్టదు, అందఱును అతనిని పరమలోభి యనుచుండిరి.

అతఁడుండునది సామాన్యమైనచిన్న యిల్లు. సాలనిండను ఆవులు, దూడలు, ఎడ్లు. కొట్లనిండ ధాన్యము, గోధుమలు. ఇంత యున్నను నౌకర్లసందడిగాని దాసీలసందడిగాని యతని-యింట నంతగాలేదు, ఒకవంటవాఁడైనను లేఁడు. నలుగురుని వచ్చి కూర్చుండు ముందుగదిలో కుర్చీలు టేబిలులు లేవు. ఏట్టి ముస్తాబు లేనుసామాన్యగృహస్థునియిల్లు విశ్వేశ్వరునితండ్రిది.

తండ్రి మిగుల చిక్కనివాఁడని లోకప్రఖ్యాతి. అతనికి ఒక్కఁడే కొమారుఁడు. ఈలోకములో అతనికి ఉన్నవారు, ఆకొమారుఁడు, కొమారుని పినతల్లి యొకతె. పినతల్లిపై తము చాలడబ్బుగలది యని నలుగురును అనుకొనుచుండిరి. తల్లిలేని విశ్వేశ్వరుని సంరక్షణకొఱకై పిన్ని తనయిల్లు వదలి నారాయణ చంద్రమైత్రగారియింటికి కాఁపురము మార్చినది. అదిచూచి అందఱికడుపులలో ఈర్ష్యజ్వాలలు పుట్టినవి.

ఒక్కఁడే కొడుకగుటచేత తండ్రి విశ్వేశ్వరునిపైనుండి ఒక్కక్షణమైనను కన్నులు మరలించువాఁడు కాఁడు. కను

కనే విశ్వేశ్వరునకు ఆయూరిస్కూలులో చెప్పు మెట్రిక్యు లేషను మించిన చదువు ప్రాప్తము కాకపోయినది. కాని, విశ్వవిద్యాలయములో చదువకున్నను విశ్వేశ్వరుఁడు విశేషముగ జ్ఞానమును సంపాదించెనని అందఱు ననుకొనుచుండిరి. గొప్పగొప్ప బిరుదులు సంపాదించిన సంస్కృత పండితులుకూడ ఇతనితో చాలలేకుండిరి. ఆగ్రామముననుండు జమీందారులయింటికి పట్టణమునుండి బంధువొకఁడు ఒకమాఱు వచ్చియుండెను. అతఁడు దిగ్విజయుఁడగు పండితుఁడు. ఎం. ఏ. ప్యాసైనవాఁడు. ఈ యువకునికిఁగల భాషాజ్ఞానము చూచి యతఁడు నిశ్చేష్టుఁడాయెను. ఇట్లనేకవిధముల అతని కీర్తి ఆ గ్రామమున పురుషసంఘములయందు వ్యాపించినది. కాని స్త్రీసభలోమాత్ర మతనిపేరు సుస్థాపితముకాలేదు. ఎన్నఁడును నోరైనను తెఱవని అబ్బాయి విశ్వేశ్వరుఁడు అని స్త్రీలసమ్మకము. కాని బుద్ధిమంతుఁడని వారుకూడ నొప్పుకొనుచుండిరి.

అసలు సంగతి యేమనిన, గ్రామములో చాలమంది అతనిని బాగుగా చూచియే యుండరు. అతని కిప్పుడు ఇరువది రెండేండ్లు. ఈయిరువది రెండేండ్లలో విశేషభాగము ఇంటి గదులలోనే గడిపినవాఁడు విశ్వేశ్వరుఁడు. సమాన వయస్కులతో నతఁడు కలసిమెలసితిరుగుచుండుటగాని, వారితో గంటలకొలఁది మాటలాడుచు కూర్చుండుటగాని ఇప్పటివఱకెన్నఁడును తటస్థించలేదు. పదునైదేండ్లప్పుడు మెట్రిక్ పాసయి స్కూలు వదలి

తనగదిలో దూరెను—ఆనాఁటినుండి నేఁటివఱకు భోజనము-నకు స్నానమునకు తప్ప యాతఁడు బయటికి రాలేదనియే చెప్పవచ్చును. ఇంటి యంతఃపురమున నున్న యితని గది-లోనికి పోవుటకు ఎవ్వరికిని అధికారము లేదు. ఎవరైన లోనికి వెళ్లియున్నయెడల బీరువా అంతస్థులపైని కుప్పలు కుప్పలుగ-నున్న పుస్తకములును, గది నడుమ నేలపై చాఁపమీఁద కూర్చుండి చదువులో మునిఁగియున్న యువకుఁడును వారి కంటఁబడియుండును. పుస్తకముల విషయమై తండ్రి కూడ డబ్బునకు వెనుదీయువాఁడు కాఁడు. కొమారున కిట్టి యభ్యాస ముండుట చూచి సంతోషముకూడ పొందుచుండెను. ఎట్టి సంసార చింతను తండ్రి నేఁటివఱకు కుమారునియొద్దకు రా-నీయలేదు. కుమారునకు పెండ్లిచేసి అతనిని సంసారము లోనికి దింపి, కడపటి యవస్థలో తాను కాశికి పోయి యక్క-డనే కాలము గడుపవలెనని నిశ్చయించుకొనెను. కాని హఠాత్తుగా కాలదేవుని యాజ్ఞయగుటవలన, ఏదో ఒకవిధ-ముగ నతఁడు కుమారున కంతయు బోధపఱచి వానిని పిన్ని కొప్పఁజెప్పి ఒకనాఁడు జీవనయాత్ర ముగింపవలసివచ్చినది.

విశ్వేశ్వరునిస్థితి మొదట నడిసముద్రమునందు ఓడ-వలె నుండెను. ఎటు చూచినను దరికానరాలేదు. నిర్జన సాహిత్యమందిరమున నొంటరిగా కాలయాపనచేయుచున్న విశ్వేశ్వరుని హఠాత్తుగ సంసారసముద్రమధ్యమున నిలఁబెట్టి

తండ్రి యొక్కడికో మాయమయ్యెను. అప్పుడే పుట్టినవానికి వలె, విశ్వేశ్వరునికంతయు కనఁబడుచుండెను.

కాని సంసారమతనికి అట్టే చిక్కైనదిగా కనఁబడలేదు. తండ్రిగారివి ప్రతివిషయములోను చక్కని యేర్పాట్లు, విశ్వేశ్వరుని తెలివితేటలకుకూడ ఆతండ్రిగారే కారణము. కనుక, విశ్వేశ్వరుఁ డిప్పటివఱకు సాహిత్యసాగరమున నెట్టి-యడ్డున్ను లేక యేనీతిని ప్రయాణము చేయుచుండెనో యిప్పుడు సంసారసాగరమునకూడ నట్టి స్వచ్ఛందతతోనే యాత్ర చేయ మొదలుపెట్టెను.

ఆ స్త్రీసంబంధమైనపనులును ఇంటి సంబంధమైనపనులును పూర్తిగాఁ జేసిన తరువాతఁగూడ ప్రతిదినమును విశ్వేశ్వరునకు కావలసినంత వ్యవధి యుండెను. ఆసమయ మెట్లు వినియోగ-పఱుపవలెనో దాని విషయమయే యిప్పుడతఁ డాలోచించుచు-న్నది. కొన్ని తోఁటలు భూములు కొని వాని యభివృద్ధికై కొంత పాటుపడెను. ఏటియొద్దుననున్న బయలు కొని యక్కడ పెద్దయిల్లొకటి కట్టించుచు ఆపనిలో ప్రస్తుతము మునిఁగియు-న్నాఁడు.

ఇంతలో, కొన్నాళ్ల క్రిందట ప్రారంభమైన గ్రామదేవత మందిరము మరామత్తు పూర్తియైనది. పూర్తిగా పూడి-పోయి యుండిన పెద్దచెరువు, "కాళీసాగరము" బురద లేక చక్కఁబడుటవలన అది శుభ్రమైన నీటితో నిండియున్నది. మహిమ్‌పూర్ చెరువుగట్లు తెగిపోయి దానిలోని నీరు ప్రతి-

సర్వవత్సరము ఊరిని ముంచివేయుచుండెను. ఆ గట్లు కూడ ఈ నడుమనే బలపఱుపఁబడినవి. ఈ పనులన్నియు చేయించుచుండువా రెవరో అందఱికిని తెలియకపోయినను, అక్కడక్కడ మాత్రము, "ఆ పరమలుబ్ధుఁడగు నారాయణమైత్ర ధనమున కిన్నాళ్లకు సద్గతిపట్టినది," అను మాటలు వినవచ్చు-చుండెను. పరులహితమును కోరు మహానుభావులు కొంత మంది విశ్వేశ్వరునియొద్దకు వచ్చి, "ఇతరులు కట్టించిన ప్రాత వానిని బాగుచేయించుచుండుట మాని క్రొత్తదేదైన నీవు-చేయించిన ట్లైన బాగుగనుండును; దానివలన నీ పేరును నిలు-చును, ఇతరులకు లాభము కూడనుండును."అని సదుపదేశము-చేసిరి. విశ్వేశ్వరుఁ డట్టిమాటలు చెవిని పడనిచ్చువాఁడు కాఁడు. "అంత పెద్దపనులు చేయుట నాకు సాధ్యమగునా? నాలుగైదు రూపాయలు ఖర్చుచేసి చేయఁగల పనియే నాకు చేతనైనది గాని?" అని యనుచుండువాఁడు. చెప్ప వచ్చిన-వారిలో కొంచెము జ్ఞానమున్నవారు, "మీరు చేయించు-చున్న పనులకు బోలెడు డబ్బగుచున్నదే!" అని యనుచుం-డురు. వారనుదానిలో నిజమేమియు లేనట్లు తలయాడించుచు విశ్వేశ్వరుఁడు, "విస్తారముగ నెక్కుడగుచున్నది, అధికముగ-ఖర్చుచేయఁ గలిగినంత భాగ్యవంతుఁడను కానే నేను!" అను-చుండును.

పినతల్లి అన్నపూర్ణాదేవి ఇప్పటివఱకు మనస్సున నెట్టి కలఁతయు లేక యింటిభారమంతయు తానే మోయుచు, అతి-

సంతోషముగ కాలముగడచుచుండెను, కాని ఒకనాఁడెందు-చేతనో కాని ఇంట గొప్పవెలితియున్నట్లామెకు తోఁచినది. ఎట్టి సందడియు లేక, చిన్నచిన్న సుఖదుఃఖములతో మాత్రము నిండియున్న తమ యింటిని నూతనత్వముతో నింపవలెనని కోరిక యామెకు పుట్టినది. ఒకనాఁడు పుత్రతుల్యుఁడగు విశ్వే-శ్వరుని పిలిచి, "నాకొక కోరిక యున్నది నాయనా *విశూ," అన్నది.

"ఏమి ఆ కోరిక పిన్నీ?"

"ఏ యిల్లు చూచినను పసిబిడ్డల నవ్వులతో కలకల-లాడుచుండును, కాని నాయింట నేమియు లేదు కదా!"

"మనమేమి చేయఁగలము పిన్నీ, ప్రాణములేని వస్తువు-లనువలె మనుష్యులను చేయలేముకదా! భగవంతుఁడు ఈ-యనప్పుడు మనమేమి చేయఁగలము?"

"కనుకనే కదా పెండ్లిచేసికొని యింటికి పిల్లను తెచ్చి-యుంచుకొందురు లోకములో. ఒక చక్కని కోడలిని నొక దానిని నాయింటికి తీసికొని రావేల విశూ?"

పిన్నిమాటలు వినఁగానే విశ్వేశ్వరునకు నవ్వువచ్చినది; ఆపుకొనలేక ఆపుకొనలేక నవ్వుచుండెను. పిన్ని కోపగించుచు, "అంత నవ్వేల నాయనా, చెప్పుము చూతము. ఇప్పటికిని ఇంటికి కోడలు లేకపోయిన యెడల నలుగురు ఏమందురు!" అని అన్నది పిన్ని.

---

* విశ్వేశ్వరుఁడు.

"తన ముక్కు కోసికొనియైన నితరుల ప్రయాణమున కడ్డువచ్చుట మనుష్యుని స్వభావము పిన్నీ* పైవారి పిల్లను మనయింటికి తీసికొనివచ్చి చీకాకు పడుటవలన మనకు కలుగు సుఖమేమి పిన్నీ—తల్లీకొడుకులము ఈలాగు మనమున్నప్పుడు మనకేమి లోపైనది చెప్పు."

"లోటేల ఉండును? కాని మన యిద్దఱితో కలిసియుండువారింకొకరు వచ్చినయెడల ఇంకను సరదాగానునుందుము కదా!

ఒకరు వచ్చిన పిమ్మట మఱియొకరు కావలసియుండును, అటుపిమ్మట మఱియొకరు—నూనవహృదయములో ఉండువాంఛ పెరుగుచునే యుండును. మొదటినుండి భగవంతుఁడు యేనలుగురిని ఒక్కచోట నుంచునో ఆనలుగురును కలిసి హాయిగా నుండుటయే అన్నిటికంటె మేలు."

"నీయంత వెఱ్ఱివాఁడు ఈలోకములో మఱియొక్కఁడైనను ఉండఁడు! ఆమాటలన్నియు నిఁక వినఁదలఁచుకొనలేదు నేను. నేనొకపిల్లను చూచి వచ్చెదను."

"ఆహా కావలసినంత మందిని చూచిరమ్ము. నేనెఱిఁగిన నలుగురైదుగురు పిల్లల మాట కూడ నీకు చెప్పఁగలను."

"అంతకంటె కావలసినదేమి? ఆనలుగురిలో నొకరినెంచుకొనిన చాలును."

---

* బంగాళీ సామెత.

"మంచిదానవే, ఒకరినెంచుకొని మిగిలిన ముగ్గురిని పంపివేయుదువేమో! అది పనికిరాదు పిన్నీ, వచ్చినపిల్లలనందఱిని ఉండనీయవలెను—అట్లైన పిల్లలతో నిల్లు మఱింత కలకలలాడుచుండును."

"ఏమి బుద్ధి, అబ్బాయిది! ఆపిచ్చియాట లింక చాలించి సరిగా చెప్పుము, పెండ్లి యిప్పుడైనను చేసికొనెదవా లేదా?"

"నాయభిప్రాయమును బట్టియే నీవేదైన స్థిరపఱచెదవా? నీకిష్టము వచ్చినంతమందిపిల్లలను తెచ్చి యింటనుంచుముపిన్నీ. నేను మాత్రము పశ్చిమమున కొంచెము తిరిగి దేశములు చూచివచ్చెదను.నీవు కాశీ బృందావనముల కథలు చెప్పుచుండుటయు నేను కేవలమువినుచుండుటయు నిప్పుడు జరుగుచున్నది. నేనొకసారి వెళ్లి వచ్చి నీకథలకు మించిన కథలు చెప్పెదను. మొదట గయవెళ్ళి నాన్నగారికి గయావర్జనము చేయవలెను. కాని నీవు నాతోకూడ నుండని యెడల తిండిలేక మాడవలసియుండునట్లున్నది పిన్నీ!"

"నీతో నేను రానని చెప్పుచున్నానా, లేక నిన్నువదలిపెట్టి వెళ్లిపోయెదననుకొనుచున్నావా? పెండ్లిచేసికొని గయ వెళ్లకూడదా అని నేననుచున్నది."

"అట్లైన నన్నొక్కనినే పోనిమ్ము, నీవిక్కడ ఉండి పెండ్లియేర్పాట్లు చేయుచుండుము."

"నీవిక్కడ నుండనప్పుడు పెండ్లి ఎవరికి చేయుమనుచున్నావు. విశూ?"

"అది నీకే తెలియవలెను!"

"ఆహా, ఎటువంటి పిల్లవాఁడవురా నాయనా! నీవంటి-వాఁడు వెదకుదమన్నను దొరకఁడు కదా! నీమాటయే కానిమ్ము, మొదట నీవనుకొన్నదంతయు పూర్తిచేసికొని వత్తము రమ్ము. కాని నేఁడు 'నిధి' తల్లి అన్నమాట వినినప్పటి నుండి, కోడలు కోడలు' అని నామనస్సు ఎంతో కొట్టుకొని పోవుచున్నదిరా నాయనా!"

కోరిక పినతల్లి మనస్సును వదలియు వదలకుండుట చూచి విశ్వేశ్వరుఁడు తనలో తాను కొంచెము నవ్వుకొనుచు నామె మనస్సునకు కొంచెము సంతోషము కలిగింపవలెననియు ఆమె మనస్సును కొంచెము మఱలింపవలెననియు నుద్దేశించి యామెచెప్పు విషయమును గూర్చియే తానుకూడ మాట-లాడఁగోరుచు నిట్లు మొదలుపెట్టెను—"నిధి తల్లి యేమనినది పిన్నీ — ఆమెయింట పిల్లల మంద యొకటి యున్నది కాఁబోలు!"

"ఆమెయింట పిల్లలెక్కడ? అట్టివన్నియు కోరినంత-మాత్రమున ప్రాప్తించవుకదా! నొసట వ్రాసియుండవలెను."

"ఇప్పుడు బోధపఱచుకొనుము పిన్నీ—మనకుకూడ నట్టి యదృష్టము లేదు."

విశ్వేశ్వరుని మాటలు విని పిన్ని మొదట కొంచెమునవ్వి పిమ్మట విసుకుఁకొనుచు, "చాలుచాలు! ఏమి బుద్ధిరా నాయనా

నది! నే ననుకొనినయెడల ఇంటికి ఎఱ్ఱగా బుఱ్ఱగానుండు కోడలినొకతెను తీసికొని రాలేనా!" అన్నది.

విశ్వేశ్వరుఁడు మిగుల నిరుత్సాహముతో, "కాని ఒకతెతో ఇల్లువాకిలి నిండదే పిన్నీ! కనుకనే నేను అను—"

పిల్లవాని పిచ్చిమాటలు చెవినిపడనీయక పినతల్లి మాటలాడుచు నేయుండెను. "నేనూరకుండుటవలనఁగాని లేనిచో, జమీందారుగారి దాసి మన నిధితల్లితో 'సూచావాచా' చెప్పినమాటలపైని నేనడ్డుపెట్టక పోయినయెడల వారి అమ్మాయికొఱకు ఎంతో గొప్పసంబంధము వచ్చియున్నను—"

"జమీందారుగారిదాసియింటినుండి తీసికొనివచ్చెదవు-కాబోలు కోడలిని పిన్నీ? దాసికూఁతురు—" ఇట్లని మఱి పట్టలేక నవ్వసాగెను విశ్వేశ్వరుఁడు.

పిన్ని కోపముతో బిగ్గరగా నిట్లు పలికినది--"నీకేమి పిచ్చెత్తినదిరా విశూ! ఎవరు దాసికూఁతురు? జమీందారుగారి కొమార్తె కమలమాట నేనన్నది— గుణములచేతనైననేమి, రూపుచేతనైననేమి, లక్ష్మీదేవివంటిది ఆమె!" ఇంతవఱకు వచ్చి పిన్ని ఉత్సాహము తగ్గిఆమె మెల్లగా మాటలాడుట మొదలుపెట్టినది—"ఆమాటలన్ని నీతో చెప్పిలాభమేమి? నేనువారిమాటల కేమియుజవాబీయలేదు. ఊరకుండుటయే మంచిదనుకొన్నాను-అంత పెద్దయింటిపిల్ల, వయస్సుకూడ స్వల్పముకాదు, మనవంటి సామాన్యసంసారులయిల్లా మెకు కుదురునా? వారితో సంబం-

థము చేసికొని మనము సుఖపడెదమో లేదో? సుఖమెప్పుడైనను సమానులతో కలియువారికే, అదికాక, అసలు నీకు సగము పిచ్చి. ఈమాట వినినంతమాత్రమున వెఱ్ఱివేషమువేసి, నన్ను-వదలి పాఱిపోయెదననుచున్నావు. అందుచేతను అదిమంచిది-కాదని యాలోచించి ఆమాటలు నేను వినిపించుకోలేదు."

"ఆహా ఇదే కాఁబోలు పిన్నీ, వినిపించుకోక పోవుట!" అని విశ్వేశ్వరుఁడు పకపక నవ్వుచు, మఱియు ని ట్లనసాగెను. "కోరిక అస్థిగతముచేసివేసికొంటివి. తీర్థయాత్రయనినను ఆకోరిక రవంతయు తగ్గకున్నదే!"

పిన్నికొంచెము సిగ్గుపడ్డది. నేనేమియు అనలేదే! జరిగినదేదో నీతోచెప్పుచున్నాను—అంతే! పద, తీర్థయాత్ర ముందుగా పూర్తిచేసికొని వత్తము-తరువాత ఏది జరుగవలసి-యున్న నది జరుగును."

ఈకథ ఇంతట ఆగినది. ఆనాఁటసాయంకాలమే విశ్వే-శ్వరుఁడు తాను క్రొత్తగా వేయించిన అరఁటితోఁట తనిఖీ చేసి యింటికి వచ్చుచుండ, కుండతో నీళ్లు మోసికొనివచ్చుచున్న-బాలికయొకతె అతనికి ఎదురుపడ్డది. విశ్వేశ్వరుని చూచి ఆమె దారి ప్రక్కనుండు కంచె నంటిపెట్టుకొని యతనికి దారివదలి-నది. అది చూచి విశ్వేశ్వరుఁడు "అంతగా ప్రక్కకేల పోవు-చున్నావమ్మాయీ, ఇట్టివేళ నక్కడ పాములుండవచ్చును. దారిలోనికి రమ్ము." అని మిగుల ఆతురతతో ననెను.

"అట్లైన మీరంతప్రక్కకు, ఆచెత్తలోనికి పోవు-చున్నారేమి?" అని ఆబాలిక నవ్వుచు నడిగినది.

విశ్వేశ్వరుఁడా ప్రశ్నకుత్తరమీయక, "దారిలోనికి రమ్ము," అనుచు తనదారిని ముందుకు నడచెను. కాని యా-బాలిక మాత్ర మక్కడనే యూరక నిలచియుండెను. విశ్వే-శ్వరుఁడు కొంతదూరము పోయి, రోడ్డువంక తిరుగుచోట వెనుకకు తిరిగిచూచెను—ఆపిల్ల యింకను నచ్చటనే నిలచి-యున్నది. విశ్వేశ్వరుఁడు కొంచె మాశ్చర్యపడుచు ఆమెవైపు చూచుచు నిలచెను—పిల్ల తనవైపే చూచుచుండెను, విశ్వే-శ్వరునికన్నులామెవంక తిరుగఁగానే ఆమె ముఖము వాల్చుట యతనికి స్పష్టముగ కనఁబడినది. పాప మాబాలిక కేదో యతనితో మాటలాడవలసిన యవసరమున్నదని హఠాత్తుగా విశ్వేశ్వరునకు తట్టినది—ఆక్షణమే ఆపిల్ల తానెఱిఁగిన దనున ట్లతనికి తట్టినది—ఆమె యెవరిపిల్లయో జ్ఞప్తికి రాలేదు, కాని రెండు మూఁడుమాఱు లెక్కడనో చూచియున్నట్లు-తోఁచినది. విశ్వేశ్వరుఁడు మఱల నాపిల్లయొద్దకు వచ్చి, "నీ-వెవరి పిల్లవమ్మాయీ?" అని యడిగెను.

"భట్టాచార్యులుగారి కొమార్తెను."

"ఏభట్టాచార్యులు? రామశంకరభట్టాచార్యులుగారి-కొమార్తెవా నీవు?"

"ఔను."

బాలిక మఱియేమియు ననకుండుట చూచి విశ్వేశ్వరుఁడు మఱల తనదారిని తాను పోవలసివచ్చినది. తానుకోరి, ఎవరినైనను, ఎట్టి ప్రశ్నయునడుగుట విశ్వేశ్వరునకు స్వభావవిరుద్ధము. ఎదుటివాఁడు తనతో నేదో మాటలాడఁగోరుచుండి, సంకోచమును జయించలేక ఊరకున్నాఁడని యెఱిఁగియున్నను విశ్వేశ్వరుఁ డెట్టి యుపాయమును కానక గంపెడు సిగ్గుతో తలవాల్చుకొని తానుకూడ ఊరక చూచుచుండును. ఐనను ఆనాఁడు రామశంకరభట్టాచార్యులుగారి కొమార్తెతో నట్లు మాటలాడఁగల్గుటకొక కారణముండెను. పిన్ని చెప్పుచుండఁగా వారి దురవస్థనుగుఱించి యాతఁడు కొంచెము కొంచెము వినియుండెను. విన్నప్పటినుండియు అది యతని కోమలహృదయమున సజీవమైయుండెను. భట్టాచార్యునకుఁగాని యతని కొమారునకుఁగాని యేదైనపని యిప్పింపఁగలిగినఁగాని వారి కష్టములు దూరముకావని నిశ్చయించుకొనెను. ధనసాహాయ్యముగాని ఇతర సాహాయ్యము మఱియెట్టిదైననుగాని చేయుమని ఈలోకమున నెవ్వరైన తన నడుగవచ్చునని విశ్వేశ్వరుఁడెన్నఁడు కలలోనైన ననుకొనలేదు. భట్టాచార్యునికి పని కుదిర్చినపిదప అతఁడెట్లున్నాఁడో విశ్వేశ్వరుఁడెన్నఁడును కనుఁగొన ప్రయత్నింపలేదు. విశ్వేశ్వరునకు నాలుగురోజులవిచారము ఒక్కరోజులో నివారణ అయిపోయినది.

విశ్వేశ్వరుఁడు పోవుచుండుట చూచి ఆ బాలిక మఱల నతనివంకఁ జూచినది. ఈమాఱు విశ్వేశ్వరుఁడు ఆమెకు

మిక్కిలిదగ్గఱగా వచ్చి, "నిన్ను నేను చాలసారులు చూచినాను, నీవు జమీందారుగారి రేవున ప్రతిదినమును స్నానముచేయు-చుందువు కదూ!" అని యడిగెను.

బాలిక మాటలాడఁ గోరుచున్నను, సిగ్గువలన మాట-లాడ లేకున్నదని కనిపెట్టి విశ్వేశ్వరుఁడు ఆమెకు కొంచెము ధైర్యము తెప్పించవలెనని నిశ్చయించుకొనెను. ఆ బాలిక తిన్నగా జమీందారుగారి రేవునుండి వచ్చుచుండుట కనిపెట్టి ఊహవలన నట్లనెను. సతి చిఱునవ్వు నవ్వుచు, "ఔను, ఆరేవుననే మీరు కమలను నీటినుండి పైకితీసి బ్రతికించితిరి," అన్నది.

"కమలా! కమల యెవరు?"

సతి కొంచెము దుఃఖముతోను, ఆశ్చర్యముతోను, "కమలను మీ రెఱుఁగరా? జమీందారుగారి పిల్ల—ఆమెను మీరే యొకసారి నీటినుండి తీసి బ్రతికించితిరి!" అన్నది.

విశ్వేశ్వరుఁ డాశ్చర్యపడుచు, "అది చాలరోజులక్రిం-దటి మాట; ఆమెపేరు కమలా!" అనుచు నవ్వెను.

ఆవిషయమై ప్రసంగించుటకు సతి సిద్ధయుగాలేదు. కమల సతికి కథలలోని ఘటనల నెన్నిటినో నిదర్శనముగా చూపించినది. ఐనను సతి ఆమెకెట్టిసలహాయు -ఈయలేకుండెను: కాని నేడు విశ్వేశ్వరుఁడు హఠాత్తుగా కనఁబడఁగానే ఆమాటలన్నియు నామెకు జ్ఞప్తికివచ్చినవి, కొంచెము

కుతూహలముపుట్టినది. కమల తనయభిప్రాయమును దాసిమూల మున తల్లి కి తెలియఁజేయఁగా తల్లి కోపగించినను, విశ్వేశ్వరుని యింటికి దాసిని పంపి వారితో మాటలాడించి చూచి, వారియభి ప్రాయము కనుఁగొనవలెనని నిశ్చయించుకొన్నది. ఇది సతి యెఱుఁగును. కమలను విశ్వేశ్వరుని కిచ్చి పెండ్లి చేయుదురని సతి పూర్తిగా నమ్ముచుండెను. పెండ్లి కాకుండు టెట్లు? ఇట్టిసం-బంధ మెవ్వరైన ఎప్పుడైన వదలుకొందురా? కనుకవిశ్వేశ్వరుఁడు కనఁబడినప్పుడు అతఁడు కాఁబోవుకమలమగఁడని సతి భావించి-నది, కాఁబట్టి యతఁడు తనకుకూడ కావలసినవాఁ డనుభావ మామెమనస్సున పుట్టినది. నాఁడు రేవునజరిగిన ఘటనను గుఱించి సతిముచ్చటించినపైని, ఆమె సరళబుద్ధిని చూచి కొంచెము ప్రసంగించి కథను ముందుకు నడపవలెననుకోరిక విశ్వేశ్వరునికి కలిగినది, కాని యతఁడు సిగ్గువలన నోరు విప్పఁ లేకుండెను.

విశ్వేశ్వరునికి పిన్ని మాటలు జ్ఞప్తికివచ్చినవి. ఎట్టిపరిచయ మును లేని యాబాలిక హఠాత్తుగ నంతస్నేహముతో పలికిన మూఁడునాలుగు మాటలవలన ఆమెకూడ ఆసమాచార మంతయు నెఱుఁగునని విశ్వేశ్వరుఁడు పోల్చుకొనెను. పినతల్లి హృదయమున నకస్మాత్తుగపుట్టిన యాకోరికకు మూల-కారణము, అట్టిన, ఈజమీందారుగారిపిల్ల, కమల—ఇప్పుడు తనతో మాటలాడుచున్న యీబాలికయొక్క సఖి. ఈబాలిక యింతసరళస్వభావము గలదియగుటవలన విశ్వేశ్వరునిలో

సహజముగనుండు సంకోచము తగ్గుచువచ్చినది. లోపుననుండి పొంగిపొరలుచుండునవ్వు నణఁచుకొనుచు అతఁడు, "ఆపిల్ల కేదోసంబంధము వచ్చినదఁట?" అనియడిగెను.

"ఔను," అనుచు గుటకఁ మ్రింగుచు, "మీ పెండ్లి-మాటలుకూడ జరుగుచుండ లేదా?" అన్నది.

విశ్వేశ్వరుఁడు మఱి యాపుకొనలేక నవ్వసాగెను. పిన్ని మాట లింతలో ఊరంతయు వ్యాపించెనని తెలిసికొని విశ్వేశ్వ-రుఁడు మిగుల నామోదము పొందెను; నవ్వుచు, "ఔను-నిజమే, కాని కమలపెండ్లితో ఆమాటల కేమి సంబంధము?" అని యడిగెను. తలవాల్చుకొని, సతి మృదుస్వరముతో, "కమలను మీకిచ్చియే పెండ్లి చేసెదరా?" అని యడిగినది.

ప్రశ్నవిని విశ్వేశ్వరుఁ డాశ్చర్యమొందెను, ఆశ్చర్య-మునకు మించిన నవ్వు నవ్వెను. కాని సతి సిగ్గు పడుచుం-డుటచూచి ఆమె యెదుట నంత నవ్వుట యుచితము కాదని భావించి, "ఏమి, మఱియొక్కడినుండియు సంబంధము రాలేదా?" అని యడిగెను.

విశ్వేశ్వరుఁడు వేళాకోళము చేయుచుండుట బోధ-పరచుకొనలేక సతి అమాయికముగా జవాబు చెప్పినది— "రాకేమి? చాంద్‌పూర్ జమీందారుగారి యింటినుండి వచ్చి-నది, కాని చేసికొనదు."

"ఎవరు చేసికొనరు?"

"కమల."

"పెండ్లి చేసికొనదా? నిజమే?"

"చేసికొనదు, నిజమే!"

"ఏమి?"

బాలిక యాప్రశ్నకుత్తర మీయలేకుండెను. బాలికలు గ్రామముననుండు తననే పెండ్లికొడుకును చేసి సరదాగా ఆటలాడుచు, మాటలు జరుపుచున్నారని విశ్వేశ్వరుఁ డీసంభాషణవలన నూహించెను. విశ్వేశ్వరునకు నవ్వొంతకంత కధికముగ వచ్చుచున్నను, అంత చిన్నపిల్లలకు సిగ్గు తెప్పించ కూడదని యనుకొని, గంభీరముగ "వారి అబ్బాయినే పెండ్లి-చేసికొనుమని చెప్పుమమ్మాయి." ఊరిలో గొప్ప సందడి యగును, మనకు విందులు ఫలహారములు దొరకును, వారు చాల గొప్పవారు" అని యనెను.

సతి సిగ్గుపడుచు కనులు వాల్చి, "మీరు మాత్రము గొప్పవారు కారా? మీరు కూడ గొప్పగానే పెండ్లి చేయఁ గలరు" అన్నది.

"పిచ్చిదానివలె నున్నావే! వారితో మమ్ము సరిపోలుటా?"

"అట్లైన మీరంగీకరింపలేదా? ఏమి మీరన్నది?"

విశ్వేశ్వరుఁడు పకపక నవ్వసాగెను, కాని అతికష్టముమీఁద తత్క్షణమే నవ్వాపుకొని, "నేనే వరుఁడనైన యెడల విందులు ఫలహారములు నాకు లభింపవు. వరుఁ డుపవాసము-

లతో చావవలసివచ్చును. ఈ పెండ్లిలో కడుపార తినవలెనని చాల రోజులనుండి ఆశించుచు కూర్చుండి యున్నాను, కనుక నేను పెండ్లికొఁడుకను కాలేను— తెలిసినదా అమ్మాయి?" అని యనెను.

సతికి దుఃఖము కలిగినది, కాని విశ్వేశ్వరుని మాటవలన నవ్వువచ్చి, "మీరు వేళాకోళము చేయుచున్నారు," అన్నది.

"లేదు; నిజముగా చెప్పుచున్నాను, వారిమాట అంగీకరింప లేనందుకు విచారముగానున్నది; కాని యేమి చేయఁగలను, ఎంత ప్రయత్నించినను నిందు ఆశ వదలుకో లేకున్నాను."

సతి పోఁబోవుట చూచి, "నీపేరేమి?" అని విశ్వేశ్వరుఁడడిగెను.

"సతి."

"మీ అన్న యింటికి తిరిగివచ్చినాఁడా? ఆనాఁడు మీ నాన్నగారు నాతో—"

"వచ్చినాఁడు," అనుచు సతి పోవుచుండెను. విశ్వేశ్వరుఁడు సంకోచించుచు, "మీనాన్నగారు తారాపూర్-ఫ్యాక్టరీకి, పనిచేయుటకు ప్రతిదినమును వెళ్లుచున్నారా?" అని యడిగెను.

"వెళ్లుచున్నారు," అని యాగకనే వెళ్లుచు జవాబుచెప్పెను.

విశ్వేశ్వరుఁ డామెను మఱికొన్ని ప్రశ్నలడుగవలెనని తలఁచెను—వారేస్థితిలోనున్నారు? హాయిగా నున్నారా? కష్టములు పడుచున్నారా? కాని ప్రారంభములోనే సతితొందర తొందరగా వెళ్లిపోయినది. సంకోచమునువదలి ప్రశ్నపై-ప్రశ్న నడుగుచుండుటకు తగిన సాహసము విశ్వేశ్వరుని-కింకను కుదురలేదు. ఫ్యాక్టరీలో పని కుదిర్చిననాఁటనుండి రామశంకరభట్టాచార్యు లతనికి మఱి కనఁబడలేదు. ఆయనను చూచిరావలెనను కోరిక విశ్వేశ్వరునికి రెండుమూఁడు రోజుల వఱకు వదలలేదు. ఐనను వారేమనుకొందురో యను సంశ-యమువలన విశ్వేశ్వరుఁడు వారియింటికి పోఁజాలకుండెను. అప్పటనుండి యేవార్తయు లేకుండుటచేత వారు హాయిగా నున్నారని యూహించెను. తిండికిలేక మాఁడుచున్న ఆ కుటుంబమునకు ఆపద తొలఁగించుకొను మార్గమొకటి కనఁ-బఱచఁగలిగినందుకు విశ్వేశ్వరుఁడు తన మనస్సులో భగవంతున కొక ప్రణామము చేసెను.



# నాల్గవపరిచ్ఛేదము.

నెలకు ప దేసి రూపాయలచొప్పున తెచ్చి యింటనిచ్చుట-వలన భార్యాపుత్త్రుల ఋణమునుండి విముక్తుఁడనైతిననియు, వారి విషయమై తాను చేయవలసినదిగాని, యోచించవలసినదిగాని . మఱియేమియు లేదనియు భట్టాచార్యుఁడు భావించు-చుండెను. కనుక మనస్సున నెట్టి విచారమును లేక వేళకు స్నానపానాదులు ముగించి, రెండుమూఁడు చిలుములు గుడు-గుడు పీల్చి కొంచెము నిద్రపోయి లేచి, శ్రద్ధతో భార్య అందిచ్చు నీళ్లతో ముఖము కాళ్లు చేతులు కడుగుకొని, ధోవతి రెండుమాఱులు దులిపి కట్టుకొని కండువా పైనివేసికొని పనికి ప్రతిదినమును బోవుచుండెను. అతఁడు రాత్రి యెనిమిది తొమ్మిదిఘంటల కింటికి వచ్చి, భార్య భక్తితో నర్పించిన వేఁడి యన్నము, కూర, తిని, ఆఁకలిచల్లార్చుకొని, హాయిగా నిద్రిం-చుచుండెను.

పెద్దకొమారుఁడు హరిశంకరుఁడు ఇప్పటికి కొంత-కాలముక్రిందటనే బడి విడిచిపెట్టెను. అతఁడు, ఎప్పుడో తప్ప, సదా చాంద్‌పూర్ జమీందారుగారి యింటియొద్దనే యుండువాఁడు. వారు వేడుకకై నాటకసంఘమొకటి, యేర్ప-ఱచిరి. దాని ముఖ్యసామగ్రిలో హరిశంకరుఁ డొకఁడు. స్త్రీ పాత్రము నభినయించుటలో హరి యద్వితీయుఁడు. అతఁడు

వేయుస్త్రీవేషము మిగుల చక్కగఁగూడ నుండునది. అందు-
చేతనే ఆజమీాందారు లతనిని విడువలేదు. మాసమున
కేరెండు రోజులో హరి యింటికి వచ్చుచుండును. తల్లిని,
చెల్లెంద్రను, తమ్ముని కన్నీటిలో ముంచి, మిగుల చీదరించు-
కొనుచు నిల్లు వదలుచుండును. ఆపాడు ఇంటి పాడుతిండి,
పాడు కూరలు, పాడు పఱపు వానికి అసహ్యము కలిగించు-
చుండును. ఇది చూచి భట్టాచార్యుఁ డంతగా విచారించ-
లేదు, గొప్పవారి నజరులోనికివచ్చి కొడుకు చివరకొక మంచి
యుద్యోగమేదైన సంపాదించునని యూహించి నిశ్చింతగా-
నుండెను; వాఁడు తల దువ్వురీతి, వాని చేతికఱ్ఱ, వాని-
కమీాజు, ధోవతి, సిగరెట్టు చూచి యెట్టి విచారమును లేక
కూర్చుండి గుడుగుడు పీల్చుచుండును. జాహ్నవీదేవి
మాత్రము ఉండియుండి కన్నులు తుడుచుకొనుచుండును,
తల్లి కన్నీరు చూచి కొమార్తె లిద్దఱును ఏడ్చుచుందురు.

ఎట్టి విశ్రాంతియు లేనివారీ ముగ్గురు ప్రాణులుమాత్రమే.
ఇంటిపనుల నడుమ వ్యవధి చిక్కినప్పుడెల్లను ప్రత్తివిప్పుట,
యజ్ఞోపవీతములు వడకుట, చేకుతో త్రాళ్ళు పేనుట మొద-
లగు పనులుచేయుచుందురు. పిల్లలిద్దఱును తల్లికి సాయము-
చేయుచుందురు. కుట్టుపనికూడ జాహ్నవి బాగుగానెఱుఁగును,
కాని దానివలన తగినంత డబ్బురాదు. కనుక నిట్టి చిన్న-
చిన్న పనులు సదా చేయుచు నామె తమలేమిని తగ్గించుటకు
ప్రయత్నించుచుండెను. పది రూపాయలు అన్ని ఖర్చుల-

కును చాలవు కదా, పైఁగా రాఁబోవు రోజులకొఱకు, సమయా సమయములకొఱకు, ఏదైన కొంచెము దాఁచి యుంచవలసి-యున్నది.

భర్తది జబ్బుశరీరము—శ్వాసరోగ మున్న దతనికి. పిల్లలిద్దఱికిని వయస్సు వచ్చుచున్నది. ఇద్దఱును మిగుల చక్కనివారు. రూపులోను గుణములలోను ఎట్టిలోపము-లున్నను దాచియుంచఁగలదేదియు నింటిలోలేదు. అట్టిస్థితిలో రూపున్నను, గుణములున్నను ఎవరు వారిని పెండ్లాడుదురు? వారిపెండ్లికై ప్రయత్నముచేయువారు మాత్రమేరి? జాహ్నవి యూరక కూర్చుండి నిట్టూర్పువిడుచుచు భగవంతుని స్మరించుచుండును.

మధ్యాహ్నము నిశ్శబ్దముగ నున్నది. అంట్లుతోముట, ఇల్లలుకుట మొదలగు పనులన్నియు ముగిసినవి. పిల్లి తులసి-కోట ప్రక్కను హాయిగా నిద్రించుచున్నది. కుక్క అరుగు ప్రక్కను పండుకొనియున్నది. మూలనున్న గుమ్మడి, ఆనప-పాదులయాకులు ఎండకు వాడి యున్నవి. అలికి ముగ్గుపెట్టి-యున్న అంగణమున నొకప్రక్కనుండు అరఁటిచెట్టుమాత్రము ఎండను లక్ష్యపెట్టక పచ్చని తనకాంతితో చూచువారి-కన్నులకు శాంతి నిచ్చుచున్నది. చెట్టున మామిడిపండ్లు నిగనిగమనుచు వ్రేలాడుచున్నవి; వాసనచే సంతుష్టిచెందిన కోకిలయొకటి దట్టముగనున్న ఆకుల నడుమ దాఁగి 'కూకూ' యని కూయుచున్నది. జాహ్నవి నారపోగులను తెచ్చి

మెత్తగాచేయవలెనని వానిని నీటిలో ముంచుచున్నది. సావిత్రి వానిని తీసి సరిచేసి పేర్చుచున్నది.

సతి తల్లివైపు చూచుచు, సంకోచముతో, "అమ్మా, కమల అత్తవారింటినుండివచ్చినది. ఒకమాఱు వెళ్లివచ్చెదను." అన్నది.

"వెళ్ళుమమ్మా; కాని ఇప్పుడెండ తీక్ష్ణముగా నున్నది, మఱి కొంచెము తాళి వెళ్లిన బాగుగనుండదా?"

"ఎండగానున్న బాధలేదు, మఱి కొంతసేపటికి దారిని మనుష్యులుందురు. సావిత్రీ, నాతో వచ్చెదవే?"

సావిత్రి రానను చు తలయూచినది.

"అట్లైన నాతో ఎవరు వచ్చెదరమ్మా? నన్నొక్కదానినే వెళ్ళుమనెదవా?"

"సావిత్రీ, వెళ్లుము తల్లీ! అక్క ఒక్కతే ఎట్లు పోగల దమ్మా?" అని తల్లి యన్నది.

సావిత్రి యెండవలన నెఱ్ఱగ కందియున్న ముఖమునటు త్రిప్పి ముఖముపై పడుచుండు జుట్టునుచేతితో వెనుకకుత్రోసి, వినతిపూరితమగు నేత్రములతో అక్కను చూచుచు, "నీవు తమ్మునితీసికొని వెళ్లుమక్కా, నేనమ్మతో కలసి నేడుత్రాళ్లుపేని చూచెదను, చేతనౌనో కాదో, కనుక నేడు నేను రాలేను," అనెను.

తమ్మున కిది యిచ్చెదను అది యిచ్చెదను అని ఆశపెట్టి వానితలపై తడితువాలొకటివేసి వానినెత్తుకొని సతి బయలు

చేసినది. నీవుకూడ తలమీఁద నొక తడిగావంచా వేసికొని పొమ్మమ్మా, ఎండ తగులును," అనుచు తల్లి వెనుకనుండి కేక వేసినది. సతి ఆమాట వినిపించుకొనక వెళ్లిపోయినది.

గొప్పవారియిల్లు. ఇంటిలోనడుగు పెట్టఁగానే సతికి కాళ్లు వణఁకుట మొదలు పెట్టినవి. కమల అత్తవారింటికి వెళ్లి సుమారు రెండేండ్లైనది, అప్పటినుండి సతి ఈయింటి కొక్కమాఱైన రాలేదు. అప్పటికంటె వయస్సున పెద్దదయినది, సంకోచము కూడ అధికమైనది. ధనగర్వితులగువారు నోటితో మాట-లాడరు; చూచియు చూడరు. "ఇఁక నెప్పుడును ఈయింటికి వచ్చుట కానిపని యని సతి తనలోతా ననుకొన్నది.

కాని కమల సతిని చూచి పలుగెత్తుకొనివచ్చి ఆమెను కౌఁగిలించుకొనఁగానే ఆమె వైరాగ్యమంతయు నెగిరిపోయి-నది. ఈ రెండేండ్లలో కమలకు మునుపటికంటె రూపువచ్చినది, ఆమె మునుపటికంటె కొంచెము పుష్టిగానున్నది. సౌభాగ్య-మామె కొకవిధమైన దీప్తినిచ్చినది, చక్కనివస్త్రములతోను, ఆభరణములతోను ఆమె ప్రకాశించుచున్నది. సతి యేమియు-ననక విస్మితురాలై యామెవంక చూచుచున్నది. కమలకూడ మొదట నేమియు ననలేకపోయినది, ఈసతిమునుపటిసతి కాదని-పించినది యామెకు. నిరుపేదయగు సతిమనస్సుననుండు గర్వ-మును స్వాభిమానమును నామెముఖమున కొక చిత్రమగు రమణీయత నిచ్చుచుండెను—దానిని చెఱిపించి యెవరో మఱల క్రొత్తగా పోయించిరని కమల కిప్పుడనిపించుచున్నది.

సతి తనకంటె పొడవైనది, మునుపటివలెసన్నముగా నేయున్నది, వ్రేలాడుచున్న జుట్టు ఛాయవలె ఆమె సుకుమారమగు-శరీరము నావరించియున్నది. పెదవులపై చిఱునవ్వాడుచున్నది, వాడియున్న పెద్దపెద్ద కనులలోమాత్రము దుఃఖము వ్యక్త-మగుచున్నది. కమల మెడయెత్తి "ఎంత కఠినమైన మనసైపో-యినదే నీది, మూఁడురోజులయినది నేను వచ్చి, వారము-రోజులుమాత్రమే యుండఁగలను. నేనే రాఁగలిగియున్నచో వచ్చినతోడనే నీయొద్దకు పఱుగెత్తి యుందును. అద్భుతమైన-దానవే నీవు!" అన్నది. విని సతి కొంచెము నవ్వినది.

"ఇంత నీరసముగా నున్నావేమే?" అని కమల యడిగినది.

"నీరసమూ? లేదే! ఎన్నాళ్లకు నిన్ను చూచినానే అక్కా!"

"సుమారు రెండేండ్లైపోయినది. నేనుండునది యెట్టి-స్థలమో యెఱుఁగుదువా? ఒక్కదినమైనను సెలవు దొరకదు. ఎంతో ప్రయత్నించిన తరువాతఁగాని యిదియైనను సాధింప-లేకుంటిని" ఇట్లనుచు కమల కొంచెము నవ్వినది. కమల నవ్వుట చూచి సతికూడ నవ్వినది; నవ్వి, "ఒప్పుకొననివా-రెవరు, ఇంటివారా?" అని అడిగినది.

"మఱి యెవరు? మా అత్తమామలకు వారి కొమా-రులపై నెట్టి యధికారమును లేదు. మాతోడికోడలు మాత్రము అప్పుడప్పుడు పుట్టినింటికి వెళ్లుచుండును, నాకా యదృష్టము లేదు. తోడికోడలితో నే నామాట అన్నప్పు

డామె (వేళాకోళము చేయుచు, 'ఇప్పు డింకను క్రొత్త కదా! మఱి నాలుగురోజులు పోయిన తరువాత నెట్టి యభ్యంతరమును ఉండదు, క్రొత్తప్పుడు మాయవస్థయునదియే' అన్నది. ఎట్టి మనుష్యులే చెల్లీ, పుట్టింటికి రానీయరు!"

ఇట్లు ఇద్దఱును మాటలాడుచు కూర్చుండిరి. కమల యనుభవించుచుండు సుఖసంపదలను గూర్చి విని సతి నిజముగ నానందించుచుండెను. రెండేండ్ల క్రిందటి ముచ్చట జ్ఞప్తికి వచ్చి, సతి అప్పుడప్పుడు, "కమల ఎట్లున్నదో కదా!" అనుకొనుచు వ్యాకులపడుచుండెను. వివాహసమయమున చీకాకు పడుచుండు కమలముఖము మిగుల వాడియుండుట చూచి సతికి మిక్కిలి దుఃఖము కలిగినది. ఆమెకు విశ్వేశ్వరునిపై కూడ మహాకోపము వచ్చినది.

ఇన్నాళ్ళ కాదుఃఖము పోయినది. ప్రశ్న యొకటి యడుగవలెనని యామెకు మిక్కిలి కుతూహలముగా నుండెను. కాని యడుగకూడదేమోయని యనుకొని యడుగలేకుండెను. చాలసేపిట్లు మాటలైన తరువాత కమల, "కేవలము నాకథయే నేను చెప్పుచున్నాను, ఇక నీసంగతి కొంచెము చెప్పుము వినెదను," అన్నది.

"నా సంగతి యేమున్నది?"

"నీ పెండ్లిమాట చెప్పవే సతీ, ఇంకెన్నాళ్లు పెండ్లిలేకుండ నుండెదవు? పెండ్లి చేసికొనవా?"

సతి కొంచెము నవ్వినది.

"నవ్వినంతమాత్రమున తప్పించుకోలేవు. చెప్పుము, పెండ్లిమాట లేమియు జరుగలేదా?"

"నాకేమి తెలియును?"

"చంటి పిల్లవు పాపము! వయస్సు కూర్చుండు నేమో!"

"నేనేమి చేయఁగలను? అనినంత మాత్రమున పెండ్లి-అయిపోదుకదా కమలా? ప్రయత్నము చేసి చేసి అమ్మమతి నాన్న-మతి పోయి వారికి పిచ్చెత్తవలెను. ఇల్లువాకిలి అమ్మి, అంద-ఱును వెళ్ళి చెట్లక్రింద వంటపెట్టవలెను—ఇదియంతయు నైనతరువాతకదా నావంటిదానికి పెండ్లి కాఁగలదు?"

"చాలుచాలు, ఏమే నీవనునది! చక్కనిదానవు, కన్నులనద్దుకొని తీసికొందు రెవ్వరైనను."

"నీవు తీసికొనెదవా? అట్లైన చెప్పుము."—ఇట్లనుచు సతి నవ్వినది. ఆనవ్వు చూచి కమలకన్నులు తడిపైనవి. "ఔను నిజమే! అట్లైన ఉపాయమేమి?" అని మెల్లఁగా అన్నది కమల.

"దేనికి ఉపాయము? ఇట్లే యుండి తల్లిదండ్రుల గుండెలలోని రక్తము నీరుచేయుచుందును. అంతకంటె చేయఁగలదేమియున్నది! నా కీలాగుననే యుండుట యనిష్ట-మనుకొనకుము. అసలే కష్టపడుచుండువారికి పీక పట్టుకొనునట్టి కష్టమిదియొకటి కదా యని నాదుఃఖము."

ఇట్లనుచు సతి లేచుచుండుట చూచి "అప్పుడే లేచి-పోవుచున్నావేమే, సతీ?" అని యనెను.

"ఇంక మఱి ఉండలేను, [illegible]పోనిమ్ము దారిలో మనుష్యులుందురు, ఆలస్యమైన."

"రేపు మఱల రావలెను అక్కైన."

"రేపు రాలేనేమో కాని నీవు వెళ్లిపోకముందు మఱియొకమాఱెప్పుడైన వచ్చెదను."

"ఒకమాఱెప్పుడైన వచ్చెదవా! ఎట్టిదానవైతివే సతీ! నీవెప్పుడు కనఁబడుదువో అని నేను చూచుచున్నాను, ఒకమాఱెప్పుడైన వచ్చెదననుచున్నావు, అతి శాంతముగా— మా మంచిదానవైతివే సతీ!"

తమ్ము నెత్తికొని సతి యింటికి పోయినది. ఇంటికి రాఁగానే తుపానొకటి ప్రారంభమైనది. "పదునాలుగేండ్ల-పిల్ల—పెద్ద గడకఱ్ఱవలెనున్నది—పెద్దవారియింటికి పోనిచ్చుటకు సిగ్గైనను లేదు," అనుచు పెత్తల్లి భరింపలేని సిగ్గుతోను, సహింపలేని అసహ్యముతోను సప్తమస్వరమున ప్రారంభించినది; "మఱఁది యింటికి రానిమ్ము సాయంకాలము, దీనికి తగిన శాస్తి చేయించనిదే నీళ్లైనను ముట్టుకొనను," అన్నది.

రాత్రి యెనిమిదైన తరువాత రామశంకరుఁ డింటికి వచ్చెను. తండ్రికి కాళ్లు చేతులు కడుగుకొనుటకు నీళ్లిచ్చినది సావిత్రి, తుడుచుకొనుటకు గావంచా యిచ్చినది. తండ్రి కాళ్లుచేతులు కడుగుకొని కూర్చుండిన తరువాత, విసనకఱ్ఱ పట్టుకొని విసురుటకు మొదలుపెట్టినది. జాహ్నవి అన్నము

కూర వడ్డించినది, రామశంకరుఁడు భోజనమునకై కూర్చుండెను. సతి చిన్నతమ్ముని నిద్రపుచ్చవలెనని చేసిన ప్రయత్నము లన్నియు వ్యర్థమగుటచే, వానిని పాన్పుపై వదలి నాన్నయొద్దకు వచ్చి కూర్చున్నది. కాళీపదుఁడు బిగ్గఱగా నేడ్వసాగెను. సతి అది విని "నీవు వెళ్లి తమ్ముని పరుండఁబెట్టుము చెల్లీ, నేను నాన్నకు విసరెదను." అని సావిత్రితో నన్నది. సావిత్రి పోయి తమ్ముని ఎత్తికొని చందమామను చూపించుచు, పాటలు పాడి చేతులలో ఊపసాగెను. తమ్ముఁడు నడుమ నడుమ చరణములందుకొని యక్కతో కలిసి పాడుచు నిద్రపోయెను. జాహ్నవి భర్తభోజనము చూచుచు ద్వారముకడ నిలచియుండెను. పరిస్ఫుటముగ వెలుఁగుచుండు ఆదీపము కాంతిని జాహ్నవిదృష్టి హఠాత్తుగ సతిపైఁబడినది. నిండువెన్నెల కాయుచుండ, నిరుపేదలయింటి అంగణమున ఆయర్ధ నిమీలితమగు కుసుమకలికను చూచుచు ఆమె తానెఱుఁగకయే పెద్దనిట్టూర్పును విడిచెను. సతి అదివిని అమ్మవైపు చూచెను.

గుఱ్ఱుపెట్టుచు నిప్పటివఱకు హాయిగా నిద్రించుచున్న పెత్తల్లికి హఠాత్తుగ నిద్రభంగము కలిగినది; ఆమె ఉచితసమయమున దబ్బు దబ్బుమని అడుగులు వేయుచు వంటింటి అరుగెక్కినది. నెత్తిమీఁద నాపద పడఁబోవుచున్నదని తెలిసికొని అందఱును భయపడసాగిరి. పెత్తల్లి వంటయింట ప్రవేశించి పీఁటయొకటి వేసికొని మఱఁదియెదుట కూర్చుం-

డెను. రామశంకరుఁడు తలయెత్తి ఆమెవంక నొకమాఱు చూచి మరల మనసార భోజనము చేయసాగెను. ఓర్వ-వహించియుండలేక పెత్తల్లికసాధ్యమై యామె యప్పుడు ప్రారంభించినది, గొంతెత్తి:—

"మెతుకు లేలాగున దిగుచున్నవో తెలియదు! ఈవల పదునాలుగేండ్ల పిల్ల ఒకతె, పండ్రెండేండ్లది ఒకతె— ఇద్దఱు పిల్లలు గొంతుకడ్డుపడుచున్నను, ఏమియు తెలియుట-లేదేమో? కండ్లకేమియు కనఁబడుట లేనట్లున్నది!"

"ఏమి చేయఁగలను? రూపాయలు లేనిదే పిల్లలను వద-లించుకొనుట యెట్లు?" అని విసుగు చెందుచు రామశంకరుఁ-డన్నాఁడు.

"అట్టైన తండ్రివెట్లు కాఁగలిగితివి? పిల్లలిద్దఱును దుఃఖ-పడుచు తిరుగుచున్నారు, వారివైపు చూచువారైనను లేరు. ఎట్టి కసాయివాండ్రు బాబూ, ఈతల్లిదండ్రులు! దానివిషయమై ఆలోచించనైనను ఆలోచించరు, కాని నోట నన్నము మాత్రము పెట్టుకొనఁగలరు?"

"ఆమాటలన్నియు ఇప్పుడేల అక్కా, అవి యన్నియు నెప్పుడును ఉన్నవేకదా! ఇప్పుడు—" అని మృదుస్వరముతో జాహ్నవి ప్రారంభించినది.

జాహ్నవిని మాటాడనీయక ఆకాశము బ్రద్దలగునంత పెద్దకేకలువేయుచు ప్రత్యుత్తరమిచ్చినది తోడికోడలు; "కను-కనే దేమైనను ఈయింట నుండవలెనని యుండదు. చావ-

నిండదు! నాకెందుకు అక్కరలేని బాధ! అమ్మ అయ్య పోయినా మన్నారు, ఏమియు అక్కరలేదని—నేనెందుకు చావవలెను మధ్య? నాకేమి పూచీయున్నది? నాజాతి పోదు, నాముఖమునకు సున్నముబొట్టెవరును పెట్టరు, నన్ను చూచి యే శత్రువులు నవ్వరు."

రామశంకరుఁడు భోజనమువదలి లేచి పోఁబోవుచుండ, సతి తండ్రిపాదములపై చేతులువేసి నొక్కుచు, "లేవకుము, నాన్నా, భోజనముచేసిపొమ్ము," అనెను.

రామశంకరుఁడు కోపముతో కాళ్లువిసరుచు బిగ్గరగా మాటలాడసాగెను—

"మీరైనను చావవలెను, నేనైను—" ఇట్లను చుండుసరికి అతని కెగయూపిరివచ్చినది; దగ్గిదగ్గి యతఁడు నేల చతికిలఁబడెను.

జాహ్నవి భయపడుచువచ్చి యతనిగుండెపైని వీఁపుపైని చేతితో రాయసాగెను, సావిత్రి పలుగెత్తుకొనివచ్చి తండ్రిని విసనకఱ్ఱతో విసరనారంభించెను, సతి కఱ్ఱబొమ్మవలె నేలకూలఁబడినది.

దగ్గు సమదుకొనిన కొంతసేపటికి, జాహ్నవి యెంతో వేఁడుకొనఁగా, రామశంకరుఁడు భోజనము ముగించెను. జాహ్నవి భర్తకు తాంబూల మిచ్చుటకు పోయినది. సతి మెల్లమెల్లగపోయి పండుకొనినది. భర్త నిద్రించుటచూచి జాహ్నవి వంటయింటికి వచ్చినది, నిద్రవలన నూఁగుచు సావిత్రి

[illegible]త్తరి ప్రక్కను కూర్చుండి పిల్లని అదరుచున్నది. "అక్క యమ్మా?" అని తల్లి అడిగినది.

"అక్క పండుకొనుటకు వెళ్లినది, నీవు వడ్డింపుమమ్మా; నే నక్కను పిలుచుకొని వచ్చెదను."

సావిత్రి పోయి, "అక్కా భోజనమునకు రమ్ము" అని పిలిచినది. అక్క ఏమియు నుత్తర మీయలేదు.

"అక్కా, భోజనమునకు రమ్ము, అమ్మ కనిపెట్టుకొని యున్నది, లెమ్ము."

అక్క లేవలేదు.

"లెమ్ము అక్కా, నీకాళ్లు పట్టుకొనెదను. నాన్న అన్న-దానిలో కోపమునకేమున్నదక్కా? ఎంతదుఃఖము కొలఁది అన్నమాట అది. ఆసంగతి నాకంటె నీకే బాగుగ తెలియును అక్కా; లెమ్ము భోజనమునకు."

సతి, కప్పుకొనియున్న బట్టను ప్రక్కకుత్రోసి ఏడ్చుచు నుండినందున సరిగా మాటలాడలేక, "నీవు వెళ్లుము చెల్లీ, నేను భోజనముచేయను నేఁడు, నాకాఁకలి లేదు, మీరు భోజనము చేయుఁడు" అన్నది.

"అట్లైన నీపాదములయొద్దనే తల పగులఁగొట్టుకొని చచ్చిపోయెదను. లెమ్ము, అక్కా."

"సావిత్రీ, బంగారు తల్లివి కావమ్మా నీవు! నీవు వెళ్లి భోజనము చేయుము, నాశరీరములో నేఁడేమియు బాగుగ-లేదు."

"ఆమాట నే నొప్పుకొనను. రెండు మెతుకులైనను నోటిలో వేసికొని తీఱవలెను."

జాహ్నవి వచ్చి సతిని చేయిపట్టి లేవనెత్తుచు, బిగ్గఱగా నిట్లు కేకలువేసెను—"బుద్ధిలేక మీరందఱును ఇట్టి పనులు చేయుచుండిన నాకు చావే మేలు—లెండు భోజనమునకు."

ఒక్కమాటగైనను ఆడక అందఱునుకలసి. వెళ్లి భోజనము ముగించిరి.

ఉదయములేచి రామశంకరుఁడు రెండుమూఁడు చిలుములు గుడుగుడుపీల్చి బాగుగా నాలోచించి ప్రస్తావన మొదలుపెట్టెను: "పెండ్లికొడుకును చూచుటకు నేఁడే ప్రయత్నము మొదలుపెట్టుచున్నాను, జ్ఞప్తియం దుంచుకొనుము; కాని మనకున్న ఆస్తియంతయును ఈయిల్లే! ఎటువంటి వరుఁడైన నాలుగైదువందలకు తక్కువకు రాఁడు కదా! ఇల్లు అమ్మి రూపాయలు తేవలెను, లేదా తాకట్టుపెట్టి తేవలెను—వేఱు మార్గము లేదు. జమీందారుగారియొద్ద తాకట్టుంచి తేఁగలనేమో చూచెదను."

"మొదట వరుఁడు దొరకనిండు, తరువాత రూపాయల ప్రయత్నము చేయవచ్చును," అన్నది జాహ్నవి.

"నీవు చెప్పిన దదియే, నేనేఱుఁగుదును. కాని రూపాయలు మొదట అవసరము. ఎన్ని రూపాయ లుండునో అట్టి

[illegible]డు కుదురును. ఈపిల్లకోసము ఇల్లుముక్క-కూడ ఈమాటు [illegible]పోవును," అన్నాఁడు భర్త.

జాహ్నవి ఒకమాఱు గదిలోనికి పోయి చూచినది, సతి యింకను నిద్రపోవుచున్నది. ఈమాట లామెకు వినఁబడి యుండవు—తల్లి కొంచెము శాంతినొంది నిట్టూర్పువిడిచినది.



## ఐదవ పరిచ్ఛేదము

అన్నపూర్ణాదేవి సావిత్రీవ్రతము నతివైభవముగా జరుపుచున్నది. పెద్దపెద్దగాడీ పొయ్యిలపై వంట జరుగుచున్నది. మిఠాయివాండ్రు సందేశ్ మొదలగు మిఠాయిలు తీసికొనివచ్చి కీచుగొంతుతో పెద్ద సందడిచేయుచున్నారు. గొల్లవాండ్రు పాలుపెరుగు తీసికొనివచ్చి ఆకుండలతో అంగణము నింపుచున్నారు. ఇరుగుపొరుగులవారు వచ్చి పెద్దపెద్ద పళ్లెములలో భీమునివంటి పరాక్రమముతో మైదాముద్ద చేయుచున్నారు. సుదర్శన చక్రములవంటి చక్రములను చేతపుచ్చుకొని బ్రాహ్మణకులతిలకములు పెద్దపెనములలో పూరీ తయారుచేయుచున్నారు. వాసనతో దిఙ్మండలము పులకితమగుచున్నది. అంగణము గ్లాసులతోను, పళ్లెములతోను, ఆకులతోను నిండియున్నది. నిశ్శబ్దముగనుండు ఆయింట నేఁడు దేశముననుండు ప్రజ అంతయు జమకూడినది. పిన్ని ఎప్పుడేది చేయింపుమని చెప్పుచుండునో అది అత్యుత్సాహముతో చేయించుచున్నాఁడు విశ్వేశ్వరుఁడు. వ్రతము సమాప్తమైన తరువాత పట్టుబట్టలు కట్టుకొని శాంతమూర్తియగు అన్నపూర్ణాదేవి ఎక్కడను ఎట్టిలోటును ఉండకూడదని తలఁచి, ఇది యది చూచుచు తిరుగుచున్నది.

విందు ముగిసినది, అన్నపూర్ణాదేవి ఇచ్చుచున్న తాంబూలము, యజ్ఞోపవీతములు దక్షిణ ప్రతిబ్రాహ్మణుఁడును

పుచ్చుకొని ఆమె నాశీర్వదించుచుండెను. ప్రేమవలన తడి-యగుచున్న కన్నులతో అన్నపూర్ణాదేవి విశ్వేశ్వరునిచేత అందఱికిని ప్రణామముచేయించుచు, "అందఱును వీనినే ఆశీర్వధింపుఁడు," అని యనుచున్నది.

స్త్రీలకు వేఱుగా విందుజరిగినది. సతిని సావిత్రిని తీసికొని జాహ్నవికూడ విందునకు వచ్చినది. అన్నపూర్ణ విస్మితురాలగుచు ఉండియుండి సతివంకఁ జూచుచుండెను. భోజనముచేసి తాంబూలము బట్టలు దక్షిణ అందుకొని ఒకొక్కరు సెలవుపుచ్చుకొనుచుండిరి. అన్నపూర్ణ జాహ్నవి యొద్దకు వచ్చి "వదినా నీవు కొంచెము కూర్చుండకూడదా, మాటలాడుకొని సావకాశముగా వెళ్లవచ్చును," అన్నది. జాహ్నవి ఉండవలసి వచ్చినది.

అందఱును వెళ్లిన తరువాత అన్నపూర్ణ వచ్చి పీఁట యొకటి దగ్గఱ వేసికొని కూర్చున్నది. "మీ పెద్ద అమ్మాయి వయస్సెంత వదినా?" అని యడిగినది అన్నపూర్ణ.

"పదుమూఁడు పదునాలుగునకు తక్కువ ఉండదు." అని ముఖమున కళలేకుండ జాహ్నవి యన్నది.

"పెండ్లిమాట లెవరితోనైన జరుగుచున్నవా?"

"ప్రయత్నము చేయుచున్నారు. ఇప్పటికింకను ఎవరి-తోను మాటలు జరగలేదు."

"ఇంత చక్కనిపిల్ల, ఎవరైన కనుల నద్దుకొని తీసికొన వలసినది కదా, ఇంత ఆలస్యమైన దేల?" అని అన్నది అన్న-

పూర్ణ. జాహ్నవి ఏమియునన లేదు. ఒక్క నిమిషమూరకుండి అన్నపూర్ణ, "మావిశుకొలకు ఇటువంటిపిల్ల దొరకినయెడల, ఆహా, ఎంత బాగుగనుండును!" అన్నది. తల వాల్చుకొని మూలను కూర్చుండియుండు సతికి చెమటపట్టుచున్నది.

జాహ్నవి "విశుకొలకు పిల్లలకు లోటేమి వదినా? దీని కంటె మంచివారు లెక్కలేనంతమంది దొరకెదరు," అని మెల్ల-మెల్లగా నన్నది.

"నీకొమార్తె లిద్దఱును మంచి బుద్ధిగలవారని విను-చున్నాను. పెద్దదైయినప్పటినుండి వారు నాకొక్కమారైనను కనబడలేదు. మీా పెద్ద అమ్మాయిని మాకిమ్ము వదినా, ఇదియే నామనస్సులోనుండు మాట."

జాహ్నవి మాటలాడుశక్తి పోయినదానివలె కొంత సేపూరకుండి, అతిక్షీణస్వరముతో నిట్లనసాగెను—

"మాపిల్లదానిది అట్టి యదృష్టమా? మీారు దానిని-"

"ఆమాటలన్నియు నిలుపుము. అటువంటి పిల్లలుకాక మఱియెవరదృష్టవంతురాండ్రు? నాబంగారుతల్లివి మహాలక్ష్మివి నీవు, రమ్మమ్మా ఇటు. పాపము ఎంత చెమటపోసినది, నన్ను కొంచెము విసరనిమ్మమ్మా"

అన్నపూర్ణ పైటచెంగుతో సతిని విసరఁబోవ, సతికి చెమట నాలుగింత లధికమాయెను. సావిత్రి అక్కకు దగ్గఱగ వచ్చి కూర్చుండి యుండియుండి నవ్వుముఖముతో ఆమెవంక చూచుచుండెను.

"రాత్రియైనది వదినా, నాకిఁక సెలవిమ్ము," అని జాహ్నవి యన్నది...

"నే నడిగిన ప్రశ్న కేమందువు? సతిని మాకిత్తువా?"

"మీపాదములకడ సతికి స్థానము దొరకినయెడల సతి వంటి యదృష్టవంతురాలు మఱియొక రుండరు. సతి మీపిల్ల యగును—ఆవిషయములో మేము చెప్పఁగలదేముండును కాని విశు ఇష్టపడవలెను కదా?"

"సతినికూడ ఇష్టపడనప్పుడు వివాహము వాని నొసట లేదన్నమాట. కాని, వదినా, ఈమాటమాత్ర మిప్పు డెవ్వరికిని తెలియనీయకు. మా అబ్బాయి యెటువంటివాఁడో యెఱుఁగుదువా—ఈమాట వాఁడెవరినోటివెంటనైన వినినయెడల పట్టుపట్టి కూర్చుండి మన యాశయంతయు భంగము చేయవచ్చును. నేమెల్లమెల్లగ నంతయు స్థిరపఱచెదను. నీవెంతమాత్రము భయపడకుము. నీకొమార్తెను జూచి యిష్టపడని అబ్బాయి యెక్కడను ఉండఁడు.ఒకటిరెండునెలలు తాళుము నేను నీకు మాట యిచ్చితిని గదా."

ఇంటికి వచ్చి జాహ్నవి జరిగినదంతయు భర్తతో చెప్పినది. పండుకొనియున్న భట్టాచార్యులు లేచి కూర్చుండి మాటలాడ మొదలుపెట్టెను."అట్లైనమన కెట్టిచింతయు నక్కఱలేదు. విశ్వేశ్వరుఁ డెట్టివాఁడో నీవెఱుఁగుదువా? అతఁ డొక్కపైసయైన నడుగఁడు, మనయిల్లు మనకుండిపోవును పెండ్లిఖర్చుల కెక్కడనైన బదులుతెచ్చిన చాలును—ఏమి

వెనుకనుండి కొంచెము కొంచెముగ తీర్చుకొనవచ్చును." ఈధోరణిని మాట్లాడుచుపోయెను రామశంకరుడు.

"ఇప్పుడే అంత ఆనందింపకూడదు. వ్రాసి ఉంచవలెను కదా. ఇప్పుడే ఏమియు చెప్పలేము." అని జాహ్నవి యన్నది.

"అట్లనకుము, వారిన్ని మాట లాడువారు కారు. విశు కూడ కడు మంచివాఁడు. ఇదికాక నాపిల్లలకు రూపులో నెట్టిలోటును లేదు. ఈగ్రామమంతటిలో నా కొమార్తెలవంటిఅందముగలవా రెవ్వరైన నున్నారేమో చెప్పుము."

బిడ్డల సౌందర్యమును గుఱించి యనుకొనుటవలన తండ్రి హృదయము గర్వముతో నిండుచున్నది. జాహ్నవి యేమియు ననలేదు. ఇంత పెద్ద యాశ అసందర్భమైన దనియు అసంభవమైనదనియు ఆమెకు తోఁచుచుండెను. అది యామె మనస్సులో నిముడకుండెను.

రెండు మూఁడు రోజులు గడచిన తరువాత అన్నపూర్ణ సతిని సావిత్రిని భోజనమునకు పిలిచినది. సతి వెళ్లుటకు మిగుల సిగ్గుపడుచుండెను కానివెళ్లక తీఱినది కాదు. అన్నపూర్ణ మిక్కిలి ముద్దుతో ఇద్దఱిని దగ్గఱ కూర్చుండఁ బెట్టుకొని మాటలాడుచుండెను. స్నానముచేసి, పొడిబట్టలు కట్టుకొని, తెల్లనియజ్ఞోపవీతముల నొత్తుకొనుచు విశ్వేశ్వరుఁడు భోజనమునకు పిన్నికడకు వచ్చుచుండెను. పిల్లలను చూచి యతఁడు మొదట కొంచెమాగెను, కాని మఱల కేమి

[illegible]లంచెనో కాని పిన్నికి దగ్గఱగ వచ్చి నిలిచి, "ఎవరి పిల్లలు [illegible]న్ని, ఆయిద్దఱు?" అని యడిగెను.

"ఎవరి అమ్మాయిలో పోల్చుకొనుము," అని కుతూహలముతో పిన్ని యన్నది. సతి సిగ్గుకోలఁది తలవాల్చుకొన్నది. పిన్ని మనస్సున నున్నది ఎఱిఁగియుండుటచే సావిత్రికూడ కొంచెము సిగ్గుపడ్డది.

విశ్వేశ్వరుఁడు, "ఈమె సతి, నేనెఱుఁగుదును కాని ఆమె యెవరు పిన్నీ?" అని యనెను.

"ఆమె సతి చెల్లెలు, సావిత్రి.. వారిద్దఱు నీకంటికి ఎట్లగపడుచున్నారు విశూ?"

"మంచి చక్కనివారు, ఇద్దఱును విందునకై పిలిచితివి కాఁబోలు, నేఁడేమి వ్రతము పిన్నీ?"

"వ్రతములేకున్న మాత్రము తమవారిని విందుకు పిలువఁగూడదా! వీరితో నీవు మాటలాడుచుండుము, నే నంతలో వడ్డించెదను."

పిన్ని బయటికి వెళ్లినది. విశ్వేశ్వరుఁడు కిటికీపై కూర్చుండి, "సతీ మీతమ్ముని పేరేమి? వానిని తీసికొనిరాలేదేమి?"

సిగ్గుచేత సతి ప్రాణము లెగిరిపోవుచున్నవి, ఆమెముఖమెట్లుగ నగుచున్నది; ముఖమున చెమటపట్టుచున్నది.

సతి గడబడ పడుచుండుట చూచి సావిత్రి, "మా తమ్ముని పేరు కాళీపదుఁడు, మేము బయలుదేరునప్పుడు వాఁడు

నిద్రపోవుచుండెను," అని మెల్లఁగా నన్నది.

"నీపేరు సావిత్రి, కాదా?"

"ఔను"

"నీవు మిగుల చిన్నదానవై యున్నప్పుడు, అనేక సంవత్సరముల క్రిందట ఎప్పుడో ఒకమాఱు నిన్ను చూచినాను, కనుకనే నేఁడు పోల్చుకొనలేకపోయినాను. సతిని నేను చాల సార్లు చూచినాను. సతీ, నీవు చదువఁగలవా? ఏయేపుస్తకములు చదివినావు—రామాయణము భారతము చదివినావా?"

అప్పటికిని సతి నోటివెంట మాటరాలేదు. సతి యింతగా సిగ్గుపడుచుండుట చూచి విశ్వేశ్వరుఁడు కలవర పడుచుండెను. సావిత్రి అక్కతరఫున జవాబుచెప్పినది—"అక్క రామాయణము, మహాభారతము చదివినది."

"నీవుకూడ చదివితివి కదూ?"

సావిత్రి తల వాల్చుకొన్నది.

భోజనముచేసి సతియు సావిత్రియు తమయింటికి పోయిరి. అప్పుడు పిన్ని "ఆయిద్దఱిలో ఎక్కువ చక్కఁదన మెవరు చెప్పుము చూతము," అని విశ్వేశ్వరు నడిగినది.

"ఎక్కువ చక్కఁదనమా!?" అని ఆశ్చర్యపడుచు "ఇద్దఱును నాకంటికి చక్కగానే ఉన్నారు. ఎవరి చక్కఁదన మెక్కువయో విశ్వేశ్వరుఁడన్నాఁడు. చెప్పఁగలిగినంత జాగ్రత్తగా పరిశీలించి నేను చూడలేదు—కాని అట్లడుగుచున్నావేమి పిన్నీ?" అని విశ్వేశ్వరుఁ డనెను.

"జ్ఞానము వచ్చిన అబ్బాయివి కనుక నిన్ను పరీక్ష చేయుచున్నాను. సతిపైనుండి కన్నులు మరలించుకొనలేకున్నాను."

"నిజముగానే! ఔనౌను నిజముకావచ్చును, పిల్లలిద్దఱును మంచిచక్కనివారు పిన్నీ, వారి కిప్పుడెట్టికష్టములు లేవుగదా?"

"కష్టములు లేక పోవచ్చును, కాని యెదిగిన పిల్ల యింటిలోనుండుటవలన వారికి గొప్ప చింతపట్టుకొన్నది."

"చింత యేల పిన్నీ?"

"పెండ్లి చేయలేకపోవుట చింతకు కారణము కాదా! డబ్బులేదు; పిల్లలెంత చక్కనివారైనను డబ్బులేనిదే మంచిపెండ్లికొడుకు దొరకఁడు కదా!"

"అట్లైన నీవు రూపాయలు బదులీయవేల పిన్నీ; మంచి పిల్లలు పాపము!" అని మిగుల ఉత్సాహముతో విశ్వేశ్వరుఁడనెను.

"నాయింటినిండ రూపాయలు పడియున్నవనుకొన్నావా? సలహా యిచ్చుటకు వచ్చినాఁడు అబ్బాయి, సిగ్గులేదు. రూపాయ లున్నంత మాత్రాన మంచి వరుఁడు దొరకును కాఁబోలు! అటువంటిపిల్లకు తగిన వరుఁడు సులభముగా దొరకఁడు—ఎఱుఁగుదువా?" అని పిన్ని మిగులకోపముతోననెను.

"నీ వనునది నిజమే పిన్నీ. అట్లైన నేను మంచివరుని సంపాదించు ప్రయత్నములో నుండెదను. కాని వరుఁడు దొరకిన యెడల మాత్రము నీవు రూపాయలిచ్చెదవా?."

పిన్ని కోపము పట్టియుంచుకొనలేకపోయినది; "పొమ్ము, నీతో నేను మఱివాదనచేయలేను, పొమ్ము! ఆహా, ఏమి బుద్ధి-కదా అబ్బాయికి!"

పిన్ని కేల అంతకోపము వచ్చుచుండెనో తెలిసికొనలేక విశ్వేశ్వరుఁడు నవ్వుచు తన చదువుగదిలోనికి పోయెను.

ఇది జరిగి మాసమునకు పైఁగా నయినది. ఏదో పనిసం-దర్భమున విశ్వేశ్వరుఁడొకనాఁడు భట్టాచార్యులయింటి యెదు-టనుండి పోవుచుండెను. దూడతో నాడుకొనుచుండు చక్కని పసిబాలుఁ డొకఁడు విశ్వేశ్వరుని కంటఁబడెను—కాళీపదు-ఁడాబాలుఁడు, తెల్లని దేహము వానిది, దేహముపై నెట్టిబట్టయు లేదు. దూడతో నాడుకొనుచుండు ఆబాలుని పొడుచుటకు ఆవొకటి పరుగెత్తుకొని వచ్చుచుండెను—కాని ఉల్లాస ప్రమ-త్తుఁడైయున్న యాబాలుని దృష్టి యటువైపునకు పోలేదు. విశ్వేశ్వరుఁ డది చూచి ఒక్కగంతున ఆబాలునిచేరుకొని వాని-నెత్తుకొని ప్రక్కకు తొలఁగెను. తనమూడ విముక్తురాలగుట చూచి ఆవు ఆబాలుని వదలి దూడ వైపునకు పోయెను.

విశ్వేశ్వరుఁ డాబాలకునకు ధైర్యము చెప్పుచు, మిగుల ముద్దుతో, "నీపేరేమి చిట్టివాఁడా?" అని యడిగెను.

"చిట్టివాఁడను కాను నేను. నేను కాళీపదుఁడను."

"కాళీపదా, ఇప్పుడే ఆవు నిన్ను పొడిచి త్రోసివేసి-యుండునే?"

"ఓస్! ఆవు నొక్క—తాపుతన్ని ఉందును నేను!"

పిల్లవానివణ కిప్పటికిని పూర్తిగా పోలేదు. విశ్వేశ్వరుఁడు వానికి ధైర్యమిచ్చుచుండ ద్వారము దగ్గఱనుండి ఎవరో "కాలీ" అని పిలిచిరి. విశ్వేశ్వరుఁడు తలయెత్తి చూడఁగా సతి కనఁబడినది.

సతి యులికిపడినది. విశ్వేశ్వరుఁ డామెదగ్గఱగ వచ్చి, "మీతమ్ము నిప్పుడు ఆవు పొడిచి వేసియుండును, పిల్లవానిని జాగ్రత్తగా ఉంచనియెడల ప్రమాద మేదైన కలుగవచ్చును." అని అన్నాఁడు. సతియేమియు నన లేదు. విశ్వేశ్వరుఁడు పిల్లవానిని ఆమెచేతికీయఁబోవుచుండ ఆమెకొంచెము వెనుకకు జరిగినది-ఇది యెవరికంటనైన పడవచ్చునేమోయని సతి సంకోచించినది.

విశ్వేశ్వరుఁడు పిల్లవానిని క్రిందపడించి, సతితో, "పిల్లవాని నెత్తుకొనుము, ఇప్పటికిని వణఁకు వదలలేదు," అన్నాఁడు. సతి తమ్ముని ఎత్తికొన్నది, సిగ్గువలన నామెకూడ వణఁకసాగినది.

"పిన్ని దగ్గఱకు వచ్చుట మానివేసినా రేమి?" అని విశ్వేశ్వరుఁ డడిగెను.

సతి ప్రత్యుత్తర మీయకయే యింటిలోనికి పోయినది. విశ్వేశ్వరునకు కొంచెము దుఃఖము కలిగినది. సతి యేమైన ననవలసియుండెను—అట్టిసందర్భములలో నేవో రెండు మాట లనవలెను—ఏమియు అననప్పు డది కృతజ్ఞత లేకపోవుటను తెలియఁజేయును. ఇంతసిగ్గు ఎవరిలోను శోభించదు.

రెండుమాసములైనది. తనతుంటరి కొమారునితో స్పష్టముగా నాలుగుమాటలు చెప్పవలెనని అన్నపూర్ణకు అప్పటికి తెలిసినది. లేనిచో నతనికి బోధపడదు, బోధపఱచు-కొనవలెనని యతఁడు ప్రయత్నము చేయఁడు. ఇది సరియైన-సమయమా కాదాయని యాలోచింపక అన్నపూర్ణ హఠాత్తుగా నొకనాఁడు విశ్వేశ్వరుని పిలిచి "నీ పెండ్లి నిశ్చయించినాను. రాఁబోవుమాసములో సతినిచ్చి నీకు పెండ్లి చేసెదను," అని డొంకతిరుగుడులేక తటాలున అన్నది.

విశ్వేశ్వరుఁడు స్తంభితుఁ డాయెను; మనస్సును స్థిమిత-పఱచుకొని కొంచెమునేపైనతరువాత,"అది యెట్లు కాఁగలదు పిన్నీ, సతికిని నాకును పెండ్లికి వరుస కుదురదఁట?" అని యనెను.

"కుదురకపోవు టేల ? వారిది మనది ఒకటేశాఖ, దూరపుసంబంధ మేదో యున్నదఁట—ఆసంబంధము పెండ్లికి అడ్డురాదు."

"తప్పక అడ్డువచ్చును. ఛీఛీ, సతితమ్ముఁడు నన్ను అన్నా అని పిలుచుచుండును. సతీసావిత్రులుకూడ నావిషయమై మాటలాడునప్పుడు 'విశుదాదా'* అనుచుందురు."

"అట్లైన నీవనున దేమి? పెండ్లి చేసికొనవా? పెండ్లి చేసి-కొనవలెనని కోరినయెడల మాత్ర మింతకంటె మంచిపిల్ల నీ కెంత వెదకినను దొరకదు."

---

* విశు అన్న

"తప్పక దొరకును పిన్నీ. అట్లు దొరకవప్పుడు కురూపి-యైనపిల్లగాని, బుద్ధిమంచిదికాని పిల్లగాని మనయింటికి రాకుం-డిన చాలునుకదా? ఇప్పుడింక నాతో పెండ్లిమాట లనకుము, పిన్నీ."

"అట్లైన పెండ్లియెప్పుడు చేసికొనెదవు? ఇరువదినాలు-గేండ్లు దాఁటిపోఁబోవుచున్నవి. నీవేమి, చంటిపిల్లవాఁడవా, చంటివానిబుద్ధి చూపించుచుండుటకు? ఇదిగో, నేను ఆఖరుమాట చెప్పుచున్నాను, విను—నేను వారికి మాట-యిచ్చితిని. రెండునెలలనుండి వారాశించుకొనియున్నారు. నా కవమానము కలుగుపని నీవుచేయ నిశ్చయించుకొనిన యెడల నేను మఱి నీయింట నుండను."

విశ్వేశ్వరుఁడు దిగులు చెంది, "ఇంతకాలము నన్ను క్షమించియున్నావు! మఱి ఒక్క సంవత్సరముపాటు తాళుము పిన్నీ, నీకాళ్లు పట్టుకొనుచున్నాను! మనస్సును కొంచెము వశములోనికి తెచ్చికొననిమ్ము."

"వశములోనికి తెచ్చుకొనునంత విషయ మేమి-యున్నది? లోకములో పెండ్లిచేసుకొనువా రెవ్వరును లేరా?"

"వేరేల? కాని నేనింతకు పూర్వమెన్నఁడును పెండ్లి-యాడలేదు గనుక నాకు భయమగుచున్నది పిన్నీ. 'నీ-స్వాతంత్ర్యమునకు అడ్డురాను' అని నామనస్సునకు నేను నేఁటివఱకు ధైర్యమిచ్చుచుంటిని. కాని నీవిట్లు పట్టుపట్టి కూర్చుండుటచూచి ఆయాశ వదలిపెట్టుకొనవలెనని తోఁచు-

చున్నది. కనుక నాకుకొంత వ్యవధియిమ్ము పిన్నీ, హఠాత్తుగ నన్నిట్లు కట్టిపెట్టకుము."

"వారు పిల్లను మఱియొక సంవత్సరము పెండ్లి లేకుండ ఉంచలేరు. నాముఖము వారికి మఱి చూపింపలేను విశూ. అట్లైన నేను మజుత్ పూర్ విడిచి పోవలసియుండును."

"నీవీ ఊరువిడిచి పోయినయెడల నేను కూడ పోయె-దను. కాని నాకంటె చాల మంచి వరుని సతికొఱకు నేను సంపాదింపఁగలను. డబ్బు ఘన మీయవచ్చును, వారికట్లైన ఎట్టి కష్టమును కలుగదు."

"నీకెట్లు మంచిదని తోఁచునో అట్లు చేయుము విశూ. కాని ఒకమాట మట్టుకు నిజము. నీ కిటువంటి పిల్ల మఱి దొరకదు, ఈమెను వదిలివేయుచున్నావు. తరువాత పశ్చా-త్తాపపడుదువు."

పిన్ని ఆశవదలుకొని మాట లాపినది. పిన్నికి మిగుల దుఃఖము కలిగినదని పోల్చుకొన్నను విశ్వేశ్వరుఁడు మనస్సు త్రిప్పుకొనలేకపోయెను. 'పెండ్లి వద్దు పెండ్లి వద్దు' అని విశ్వే-శ్వరుఁడు ప్రతిదినమును పాఠము, వల్లించుచుండెను కాఁబోలు—హఠాత్తుగ వివాహ వేషము వేసికొనలేకున్నాఁడు. పిన్ని సతిని తమయింటికి ఏల పిలిపించినదో విశ్వేశ్వరుఁ డిప్పుడు పోల్చుకొనెను. నాఁడదిరోయెఱుఁగక సిగ్గులేనివానివలె మాట-లాడుచుండుటవలన సతి ముఖమెట్టి చేసికొనినది—అది నేఁడు

విశ్వేశ్వరునకు జ్ఞప్తికివచ్చి, తటాలున, "ఛీ ఛీ—అట్టిది ఏన్నఁటికిని జరుగదు." అని అన్నాఁడు.

విశ్వేశ్వరుఁడు మఱునాఁడు రామశంకరభట్టాచార్యుని యొద్దకు పోయి తనకు వారియెడలగల అనురాగమును, బాంధవ్యమును వ్యక్తపఱచు మాటలునాలుగాడి, తాను సతి-కొఱకు మంచివరుని కుదిర్చెదననియు, అన్నకు చెల్లెలిపై నుండు అధికారము తనకు సతిపై నున్నది గాన పెండ్లిఖర్చులన్నియు తానే భరించి కృతార్థుఁడు కాఁగోరుచున్నాఁడనియు చెప్పెను.

రామశంకరుని యాత్మగౌరవమునకు దెబ్బతగిలినది; కోపముచే నతని కనుల చీకట్లు క్రమ్మినవి. 'తన కొమార్తె అంత హేయమైనదా?' అని తనలోతా ననుకొనుచు, "ఇప్పటికే నీఋణము నేను తీర్చలేను, ఆఋణ మధికము కానిచ్చుట మంచిదికాదు నాయనా, మాసతి భారము నేను వహింపఁగలను—ఆవిషయమై నీవు నిశ్చింతగా నుండుము." అని రామశంకరుఁడు గర్వముతో ననెను.

రామశంకరుని శాంతిపఱచి, అతనిచే నెట్లైన ఒప్పింపవలెనని విశ్వేశ్వరుఁడుచేసిన ప్రయత్నములన్నియు నిష్ప్రయోజనమగుట చూచి దుఃఖితుఁడై యతఁడు పిన్నియొద్దకు వచ్చి జరిగినదంతయు నామెతో చెప్పెను. అది విని పిన్ని, "నేను వెళ్లి కొన్నాళ్లు కాశీలో నుందును, వారిముఖ మింక చూడలేను. నన్ను కాశీకి పంపు ఏర్పాటుచేయుము," అని దుఃఖముతో నన్నది.

విశ్వేశ్వరుఁడు నెమ్మదిగా నన్నియేర్పాట్లును చేసెను. పిన్ని కాశీకి బయలుదేఱినది. విశ్వేశ్వరుఁడు పిన్నిని రైలెక్కించి యింటికి మఱలిపోవలెనని మొదట జరిగిన ఏర్పాటు. అట్లుచేయక విశ్వేశ్వరుఁడుకూడ రైలెక్కుచుండుట చూచి, "నీవెక్కడికిరా బాబూ?" అని పిన్ని అడిగినది.

"నీవెక్కడికో నేనును అక్కడికే! మఱియొకమాఱు నన్ను మాతృహీనునిగా చేయవలెననుకొనుచున్నావా పిన్నీ?

పిన్ని వానిమాట కుత్తరమీయక వానితలను తన ఒడిలో పెట్టికొనినది.



## ఆఱవపరిచ్ఛేదము.

ఉన్నదంతయు పోఁగొట్టుకొనినవాని కొక విధమగు నిశ్చింత కలుగును. రోగముచే బాధపడుచుండు ముఖమున మరణానంతర మొకవిధమగు శాంతి చేరును. సతికి పెండ్లిచేసి రామశంకరుఁ డట్టి శాంతిని పొందెను. ముక్తిని పొందినవాని వలె పెద్దనిట్టూర్పు విడిచెను. నవగ్రామవాసియగు తీన్ కొడి లాహిడీ యను అనామధేయుఁ డొకఁడు నగదు మూఁడువందలు రూపాయలు మాత్రమే పుచ్చుకొని సతిని భార్యరూపముగ నందుకొనెను.—కాదు, కాదు, చెప్పుటలో కొంచెము పొరపాటైనది—సతికి భార్యయను పేరు నిచ్చెను. వివాహమైన తరువాత సతి భర్తగృహమునకు వెళ్లుట యావశ్యకము కాలేదు. వరుఁ డెట్టి స్వార్థపరాయణతయు లేని బ్రాహ్మణుఁడు, మితిలేని పరోపకార బుద్ధిగలవాఁడు, భట్టాచార్యుని జాతి కులములను రక్షింపఁ బూనుకొని యిట్టిపని చేసినవాఁడు. ఈమహాత్ముఁడు తనయింట లేమి పొడఁజూపుచున్నప్పు డెల్ల, ఇంట పెండ్లికాని పిల్లలుండుటచే భయపడుచుండు తండ్రినొకనిని కనిపెట్టి, అతనిబాధ నివారించి తనలేమిని కూడ తగ్గించుకొనుచుండును. ఈవ్యాపారము ఇటుపైని ఈవిధముగా చాలా రోజులు జరుగునట్లు బ్రాహ్మణునకు మఱి కనఁబడలేదు.— లెక్కకొలఁదికాలములో ఫైసలు చేయుమని చిత్రగుప్తుఁడు

తొందర చేయుచున్నట్లుండెను. కనుక తనకు మిగిలియున్న నాలుగు రోజులలో సాధ్యమైనంతవఱకు పరోపకారము చేయవలెనని యతఁడు నిశ్చయించుకొనినట్లుండెను.

వాని మాట అటుండనిండు. రామశంకరుని చింతలన్నియు దూరమయినవి. పిల్లకు పెండ్లి చేయకపోవుటచే జాతి పోవుననుభయ మతనిని వదలినది. ఇల్లు తాకట్టుపెట్టి పెండ్లికై మూఁడువందల రూపాయలు తేవలసి వచ్చినది. ఈజన్మములో ఆయప్పు దిద్దగల యాశ లేకుండుటచే ఆవిషయమై కూడ రామశంకరుఁడు నిశ్చింతగానే యుండెను. ప్రతిమాసము వచ్చు జీతము, పదిరూపాయలు, అకాలవృద్ధుఁడైన యతని రోగశరీరము—ఇవియే ఇప్పు డతనికిగల ఆధారము. ఈరీతిగానైనను చాల రోజులు గడచునట్లు లేదు. ఆసంగతి రామశంకరునకు బోధపడుచున్నది. కాని బ్రతికియుండవలసిన నాలుగురోజులైన అతనికి బహు కష్టముగా నున్నవి. సతి కనఁబడినప్పుడెల్లను అతఁడామెను తిట్టి తఱిమివేయుచుండును, పెద్దకొడుకు ఎప్పుడో కాని యింటికి రాఁడు—తండ్రి వానిని చూడఁగానే తిట్టి శపించి పొమ్మనుచుండును, చిన్నకొడుకును కొట్టుచుండును. సావిత్రి కంటఁబడినప్పుడు ముఖ మటువైపు త్రిప్పివేయుచుండును. జాహ్నవి ఇప్పుడు తోడికోడలితో ఎట్టివాదనయు చేయుచుండుటలేదు, ఏవిషయమైనైనను ప్రసంగించుచుండుటలేదు. పిల్లలొకప్పు డేడ్చుచుండుఁ డొకప్పుడు కోపగించుచుందురు. పెత్తల్లి కేకలతో ఇల్లెగిరి-

పోవుచుండును. జాహ్నవి మాటాడక కనులు మాత్రము తుడుచుకొనుచుండును. శ్వాసరోగము గుండెభారము మిక్కిలి అధికమయి రామశంకరుఁడొక్కొకనాఁడు రాత్రింబగళ్లు బాధపడుచుండును ఇంటివా రందఱును మిగుల దిగులు చెందుచుందురు. అట్టిసమయములయందు తనకు పథ్యపానాదులుచేసి యిచ్చి సేవచేయుచుండువారినికూడ రామశంకరుఁడు తిట్టుచుండును. తిట్టుతినుచుండువారు మాత్రము నోరైనను తెఱవక అంతయు సహించియుందురు.

సతి పెండ్లియయి ఆఱుమాసము లైనది. రామశంకరుఁడు జీవములేని బొమ్మవలె నయిపోవుచుండెను. ఐనను ఫాక్టరీపనికి వెళ్లుటమాత్ర మెన్నఁడును మానలేదు.

ఒకనాఁడు సాయంకాలము గొప్పమేఘము క్రమ్మినది. సతియు సావిత్రియు తొందరతొందరగా నింటిపనులు పూర్తి చేయుచున్నారు. ఉండియుండి చేయుచున్న పని యాపి పరధ్యానముగ జాహ్నవి యింటిద్వారమువైపు చూచుచున్నది. నేఁ డెట్టి దురదృష్టమో! రామశంకరుఁ డింకను ఇంటికి రాలేదు! పెత్తల్లి జపతావళము చేతపుచ్చుకొని పేట ఒకమాఱు చుట్టఁబెట్టి వచ్చినది. మేఘములధోరణి చూడఁగా పెత్తల్లికి పిల్లలను తిట్టుటకు అవకాశము నేఁడు చిక్కదు, ప్రొద్దుటివఱకు తాళియుండవలెనని తోఁచియుండవచ్చును.

పెద్ద ఝుంకారముచేయుచు గాలివాన ప్రారంభించినది. ఇంటిపైనుండుగడ్డి యెగిరి నాలుగుదిక్కులను వ్యాపించుచు-

న్నది. శిథిలమగుచున్న ఆయిల్లు గాలికి కదలుచున్నది. కాటు-
కవంటి కారుమేఘము లాయింటి యంగణము నంధకారముగ
ముంచినవి. అరఁటిచెట్లు విఱిగిపడుచున్నవి. అంగణములో
నున్న మామిడిచెట్టునుండి దబ్బుదబ్బు మని శబ్దముచేయుచు
కాయలు, పడుచున్నవి. కాళీపదుఁడు పెత్తల్లితో వెళ్లి
మామడికాయ లేరుటకై యల్లరిచేయుచున్నాఁడు. సతి వాని
నెత్తినాని యింటిలోనికి తీసికొనిపోయి మఱపింపవలెనని
ప్రయత్నము చేయుచున్నది. పెత్తల్లి వాయుదేవునీ తిట్టు-
చున్నది, కాని ఆమెతిట్టు ఆప్రబలమగు వాయుప్రవాహమున
కొట్టుకొనిపోవుచున్నవి.

జాహ్నవి ద్వారముపై చేరఁబడి నిలచియున్నది. ఆతుర-
తతో నెదురుచూచుచున్న యామెదృష్టి మేఘనిర్మితమగు
ఆయంధకారమున పలుగెత్తుచున్నది. సావిత్రి మిగుల దుఃఖ-
ముతో తల్లిముఖమువైపు చూచుచున్నది—గాలికి ఆమెజుట్టు
ఎగురుచున్నది, వాడియున్న యామెతెల్లనిముఖముభయగ్రస్త-
మయియున్నది—అస్ఫుటముగ ఆమె 'అమ్మా!' అని ఒకమాఱు
పిలిచినది.

అమ్మ పలుకలేదు. హఠాత్తుగ వర్షము దడదడ కురియ-
నారంభించినది. పెత్తల్లి పరుగెత్తి రాఁబోవు కాలుజాఱిబుట్టతో
నేలపడినది. సావిత్రి తటాలున వచ్చి ఆమెను లేవనెత్తినది
పెత్తల్లి పెద్దపెద్ద కేకలువేయుచు నేడ్వ మొదలుపెట్టినది.

అప్పటికిని జాహ్నవి ఎట్టిచలనములు లేక ద్వారముకడ రాతి విగ్రహమువలె నిలిచియుండెను.

వృష్టిలో భయంకరమగు ఆందోళన జరుగుచున్నది. క్రిందనుండు వస్తువులు మీఁదికి ఉప్పుచు మీఁదనుండు-వస్తువులు క్రిందికి పడద్రోయుచుండు అల్లరి పిల్లవానివిజయోల్లాసము నాలుగువైపులను కాన్పించుచున్నది. అట్టి-యాందోళనలో గుండికూడ ద్వారముబయట నేదో పడినట్లు, శబ్ద . మొకటిజాహ్నవి చెవినిపడ్డది—ఆశబ్దముతో పాటు మనుష్యుని మూలుగువంటి మూలుగుకూడ ఆమెకు వినఁబడి-నట్లైనది. ఆమె తత్క్షణమే అరుగు దిగినది. సతియు, సావిత్రియు వచ్చి ఆమెప్రక్కను నిలిచిరి. అడుగడుగునకు కాలుజాఱుచున్నను, వారు ముగ్గురును బయటిద్వారమువైపు పఱుగెత్తిరి.

బయటను బోర్లపడియున్న రామశంకరుఁడు వీరికంటఁ-బడెను. జాహ్నవి యతనిని ఎత్తిపట్టుకొన్నది—సతియు సావిత్రియు 'నాన్నా నాన్నా' అనుచు నేడ్వసాగిరి.

"ఊరకుండుఁడు, ఊరకుండుఁడు—వచ్చి నాకు సా-యము చేయుఁడు, నేనొక్కతెనే ఆపియుంచలేకున్నాను"

జాహ్నవి ఎదురురువ్వకొననుండు ఆకువలె వణఁకు-చుండెను. ప్రపంచమంతటను ఆవరించియున్న యంధకారమంతయు ఘనీభూతమై ఆమెకండ్లయెదుట నిలిచినది. చేత-నములేక పడియున్న రామశంకరుని ముగ్గురును కలిసి ఎంతో

కష్టముపైని ఇంటిలోనికి తీసికొనిపోయిరి. దెబ్బబాధవలన నేడ్చుచున్న పెత్తల్లి కేకలు ఆగినవి. సతి ఆమెవంకకు తిరిగి నిప్పుచేయుము దొడ్డమ్మా" త్వరగా అని యన్నది. పెత్తల్లి కుంటుచువెళ్లి పిడకలతో నిప్పుచేయుచు కూర్చున్నది.

తడిబట్టలు విప్పి దేహమంతయు బాగుగా తుడిచి రామశంకరుని పఱుపుపై పరుండఁ బెట్టిరి. అప్పటికిని అతనికి తెలివిరాలేదు సతి బొక్కిపెట్టె నొకదానిని తెఱచి పాత ఫ్లానలు చొక్కా ఒకటి పైకితీసి దానితో తండ్రి కాళ్లను చేతులను రుద్దసాగినది. అంతలో నిప్పుకూడ సిద్ధమైనది—అందఱును కలిసి చేతులు వేడిచేసికొని ఆచేతులతోను, గుడ్డమూటలుచేసి వానితోను, రామశంకరుని దేహమును కాచుట మొదలుపెట్టిరి. జాహ్నవియు సతియు నోరు తెఱవ లేదు. సావిత్రిమాత్రము నోరు సగము విప్పి మెల్లఁగా "నాన్నా" అన్నది. నిశ్చేష్టుఁడై ఒక మూలను నిలచియున్న కాళీపదునకు అక్కమాటవలన ధైర్యము కలిగి అతఁ డేడ్వ మొదలుపెట్టెను.

"ఊరకుండు మమ్మా, కాళీ, భయమేల—నాన్న క్షేమముగా నున్నాఁడమ్మా," అని సతి తమ్ముని యోదార్చుచు, కొంచెము పాలు వెచ్చఁబెట్టుమని అమ్మతో నన్నది.

"అది నీవే చేయుమమ్మా, నేను లేవలేను," అని తల్లి క్షీణస్వరముతో ననెను.

సతి పాలు వెచ్చఁబెట్టి, ఆలిచిప్పతో కొంచెము కొంచెముగా దానిని తండ్రినోటిలో పోసినది. కొంచెముసేపటికి అతఁడు మెల్లఁగ కదలి, నోటిలోవేసిన పాలనుమ్రింగి, రెండు-మూఁడుసారులు పెద్దనిట్టూర్పువిడిచెను. అందఱికిని కొంచెము ప్రాణములువచ్చినవి, ఇటునటుకదిలి సరుదుకొని కూర్చుండిరి— ఇప్పటివఱకు చేతులుకాళ్లు కదల్చుటకైనను ఎవ్వరికిని సాహసము లేకుండెను. క్రమక్రమముగ రామశంకరుఁడు కనులు-విప్పి, ప్రక్కకు తిరుగుటకు కాఁబోలు ప్రయత్నము చేయు-చుండెను. దగ్గఱకు వచ్చి, సతి "నాన్నా!" అన్నది.

రామశంకరుఁడు కొమార్తవైపుచూచి, "ఎవరు?" అని యడిగెను.

"నేను నాన్నా, సతిని."

మతిలేకపడియున్న రామశంకరునిలో ఏదో యొక్క-గొప్పశక్తి ప్రవేశించినది—కుడిచేతితో కొమార్తెను త్రోసి-వేయుచు మిగుల ఉద్రేకముతో, "పొమ్ము, దూరము పొమ్ము-నాసమస్తమును నాశనము చేసితివి. ఇంకను నేమి కావలెను నీకు. నన్నుకూడ మ్రింగివేయవలెననియా నీకోరిక? పొమ్ము— అటుపొమ్ము."

సతి అటు జరిగి దూరముగా కూర్చున్నది. జాహ్నవి తలవాల్చుకొని మాటాడక భర్తదేహము కాపుచున్నది. సావిత్రి కన్నులు వాల్చినది. "పాడు స్వభావము పుట్టెను పుట్టినది పిడకలతోగాని పోదు!" అని పెత్తల్లి గొణిగినది.

"ఇప్పు డేలాగున ఉన్నది, కొంచెము సుఖముగా-నున్నదా?" అని జాహ్నవి అడిగినది.

"ఎట్లుండును? రోగము ఆరోగ్యము—అన్నియును నేటితో ఆఖరు. నేనిఁక బ్రతుకను—కనఁబడుచుండ లేదా."

జాహ్నవి ఉత్తరమీయలేదు. సావిత్రి ఏడ్చుచు "అటువంటి మాటలాడకుము నాన్నా," అని యన్నది.

రామశంకరుఁడు కోమా ర్తెవైపు తీవ్రముగా చూచు-చు "ఏమీ, మీకష్టము లధికమగునా? తండ్రి చేయవలసిది మీవిషయమై నేనేమి చేసితిని, నాచావువలన మీకష్టము లధికమగుటకు ప్రతిదినము సగము పస్తుంచి, ప్రొద్దుట మొదలు మీచేత పనిచేయించి, తిట్టుచు మిమ్ములను పెద్దవాండ్రను చేయుచున్నాను. నేను లేకున్నను కాఁబోవున దదియే కదా? నేను బ్రతికియున్నయెడల నీకుకూడ * గంగాయాత్రికు నొకనిని చూచి పెండ్లి చేసెదనేమో! నేను మీకు నాన్ననా? కాను కాను!" అని పల్కి ఉద్రేక మధికముకాగా రామ-శంకరుఁడు మఱల మూర్ఛిల్ల నుండెను—అతికష్టముపైని తెలివి తెచ్చుకొని, "హరి వచ్చినట్లున్నాఁడే! పంపివేయుడు, వానిని త్రోలివేయుడు," అని యనెను.

---

* చావు దగ్గఱపడుచున్నదని అనుమానము కట్టగానే గంగాతీరమునకు యాత్ర చేయు ఆచారము ఉత్తరాదిని కలదు. గంగఒడ్డున ప్రాణము విడిచినయెడల పుణ్యము వచ్చునను నమ్మకము ఆయాచారమునకు కారణము. నదిఒడ్డున ఉండియుండి ఎంతకును చావు రాకుండుటవలన మఱల యింటికి వచ్చువారుకూడ ఉన్నారు.

"ఏఁడీ? అన్న రాలేదే?" అన్నది సావిత్రి.

"రాలేదా? పోనిండు, వాఁడు పెట్టు ముఖాగ్ని నా కక్కఱలేదు, కాళి పెట్టును—వానికి నరకము ప్రాప్తిల్లుగాక!"

జాహ్నవి భర్తముఖముపై చేయివేసి తడవుచు "నిద్ర-పోవుటకు ప్రయత్నింపుఁడు—బాధ కొంచెము తగ్గవచ్చును. కొంచెము నిద్రింపుఁడు," అన్నది.

"కష్టము తగ్గుచున్నది. జాహ్నవీ, ఇదిగో ఇప్పుడే పూర్తిగా తగ్గిపోవును."

సతి కొంచెముదూరమున తలుపుదగ్గఱ కూర్చుండి-యున్నది.

తలుపు కొంచెము తీసియున్నది. అప్పటి కింకను చినుకులు పడుచున్నవి. బయటను సూచీభేద్యమగు నంధకారము. అందులోనుండి ఎడతెఱపిలేకుండ కప్పల బెకబెకలు వచ్చు-చున్నది. చినుకులతో తడిసై యున్నగాలి యుండియుండి ఝుంకారముచేయుచు ఇంటిలో ప్రవేశించుచున్నది. సతి తదేకధ్యానముగా అంధకారమువైపు చూచుచున్నది. ఆ యంధకారమున ప్రయాణమై పోఁగలిగినయెడల ఎన్నటికిని ఉషఃకాంతి కంటఁబడదని కాఁబోలు సతి అనుకొనుచున్నది.

రామశంకరుఁడొక్క నిమిషము కన్నులు మూసెను, కాని తత్క్షణమే లేచి, "జాహ్నవీ?" అన్నాడు.

"ఏమీ?" అన్నది జాహ్నవి.

"కాళీపదుఁడేడీ?"

"అదిగో, మీ ప్రక్కనే నిద్రపోవుచున్నాఁడు."

అతి కష్టముపైని రామశంకరుఁడు కొమారుని తలపై-చేయి యుంచెను. జాహ్నవి అది చూచి, "ఏమి మీరు చేయుచున్నది?" అని యన్నది.

"ఆశీర్వదించుచున్నాను. సావిత్రి నిద్రపోవు-చున్నదా?"

"నాన్నా" యనుచు సావిత్రి తండ్రియెదుటికి వచ్చి నిలిచినది. తండ్రి యామెనుచూచి, "ఇటు రమ్మమ్మా, నీకు కడపటి ఆశీర్వాద మిచ్చెదను," అన్నాడు.

"అట్లనకుము నాన్నా, చాలకష్టముగా నున్నది," అని యనుచు సావిత్రి ఏడ్వసాగినది.

"ఊరకుండుమమ్మా, సావిత్రీ, నీవేడ్చినయెడల నాన్నకు మఱింత కష్టముగానుండును," అని తల్లి యన్నది.

"లేదు లేదు, కష్టమేల, కష్టమేల అమ్మా? ఆశీర్వదించ-నిమ్ము." హరీ!—అన్నట్టు, "హరి లేఁడు! ఐనను వానినికూడ ఆశీర్వదించుచున్నాను—ఏమిరైయినను కొడుకేకదా!"

"నాన్నా, అట్లైన అక్క నాశీర్వదింపవేమి? అక్క నొక-మాఱు ఆశీర్వదింపుము నాన్నా."

ఒకమాట అని రెండునిమిషము లూరకయుండి మఱియొకమాట అనుచు రామశంకరుఁ డుత్తర మీయసాగెను—

"అక్కనా? సతినా? ...నిజముగానే? కాదు కాదు—వేళ్లా

కోళము! తండ్రి—తండ్రినై యుండి చనిపోవువేళ పిల్ల నెగతాళిచేసి పోఁగలనా?"

జాహ్నవి "చూడుఁడు, మీరు కోపపడితిరని సతి గుమ్మము కడకుపోయి అక్కడ కూర్చుండియున్నది. ఒక్క-షూరు దానిని పిలువుఁడు," అని క్షీణకంఠముతో నన్నది.

రామశంకరుఁ డాదిక్కు-చూచుచు, "రమ్మమ్మా సతీ, రాతల్లీ," అని క్షీణస్వరముతో పిలిచెను.

సతి తలవాల్చుకొని ఎడమచేతితో—కనులు మూసి-కొనుచు వచ్చి తండ్రిపాదములకడ కూర్చుండెను. "అక్కడ కాదమ్మా ఇక్కడికిరమ్ము, నీతో చెప్పవలసినవి రెండుమాట-లున్నవి, ఇటురమ్ము—నిన్ను చాల తిట్టినాను!"

సతి ముఖ మటుత్రిప్పుకొని ప్రక్కకువచ్చి కూర్చున్నది. రామశంకరుఁడు కొంతసేపామె వంకచూచి ఇట్లనసాగెను— "నీకా ఆశీర్వాదము? ఆశీర్వదింపవలసిన అవసరమేమియు లేదు. ఉండియుండును, విశ్వేశ్వరుఁడు నిన్ను—వద్దు వద్దు—ఆ మాటలన్నియు ఇప్పు డనవసరము. నన్నేమి చేయుమన్నావు, తల్లీ? ఆశీర్వాదింపుమన్నావా? తండ్రి పాపములవలన పిల్లలకు దుఃఖము కలుగును—కనుకనే మీకిప్పుడు దుఃఖము కలుగు-చున్నది—ఇటుపై నీకూడ కలుగబోవుచున్నది. నే నేమి-చేయఁగలను, తల్లీ, నాచేతిలో నేమియున్నది? నే నెఱిఁగినంత-వఱకు అంతపాపము నేనెన్నడును చేయలేదు—కాని పూర్వ-జన్మపాప ఫలమేమో యిది! నీసుఖమునకు మూలమైన దానిని

నా చేతితో నేనేనరికి, ఇప్పుడు నిన్నెట్లు ఆశీర్వదింపఁగలనమ్మా? కాని ఎట్టి యుపాయమును గానక, ఎంత దుఃఖించుచు నేను నిన్ను—నాబిడ్డను—హత్య చేసితినో నీ వెఱుఁగనిది కాదు!"

సతి కఱ్ఱబొమ్మవలె కూర్చుండియుండెను. "ఇప్పు డామాటలన్నియు నేల? కొంచెము నిద్రింపుఁడు," అని భాహ్నవి యనెను.

"నిద్రా! మఱికొంచెము సేపైన తరువాత హాయిగా నిద్రపోయెదను. ఆనిద్ర బహుగాఢనిద్ర—ఎట్టి చింతయు, ఎటువంటి తాపత్రయములును ఆనిద్రలో నుండవు! ఆనిద్ర-వలన కలుగునది యెట్టిశాంతియో యెఱుఁగుదువా? కాని దానికి పూర్వము చెప్పవలసినవి రెండు మాటలున్నవి—అవి చెప్పనిమ్ము. సతీ! ఏదీ అమ్మా? లేచిపోయినదా? లేదు, ఇక్కడనేయున్నది. వినుము తల్లీ! ఏమిచెప్పఁబోయినాను? మఱచిపోతినే! ఆహా, ఔను—ఆశీర్వాదమా? ఏమని నిన్నా-శీర్వదింపుమన్నావు చెప్పుము. తల్లీ? నేను పోవుచున్నాను-నిన్ను—"

తండ్రివాక్యము పూర్తికాకమునుపే సతి యెట్టితడ-బాటును లేని స్థిరమగు కంఠముతో బదులుచెప్పుటకు మొదలు-పెట్టినది. "నీవు వెళ్లిపోవుచున్నావా నాన్నా? మనసార నీకుసేవ చేయుట నాకీలోకములో ప్రాప్తింపలేదు. నీయొద్దకు-వచ్చి నీకుసేవచేయుట నాకు ప్రాప్తించుఁగాక అని ఆశీర్వదిం-పుము నాన్నా."

"నాయొద్దకు వచ్చెదవా? ఔనౌను, అది మహాసుఖముగా నుండుస్థలము—విశ్రాంతి! ఆహా! అక్కడనుండునది, ఎట్టి విశ్రాంతి! వచ్చెదవా సతీ? మిగుల శ్రమచెందితివే తల్లీ? ఇంత అల్పవయస్సున, ఈయౌవనమున నీకెంత శ్రమ కలిగినదే అమ్మా! రమ్ము తల్లీ, ఇటురమ్ము, నాఒడిలోనికి రమ్ము—నీవు చంటి దానవై యుండినప్పు డేరీతిని నిన్నొడిలో కూర్చుండఁబెట్టుకొను చుంటినో అట్లు—రమ్ముతల్లీ మనము పోదము."

భర్తను శాంతిపఱుపఁగోరుచు జాహ్నవి—అతని తలపై చేయివేసి మెల్లఁగా దువ్వుచుండెను. రామశంకరుఁడు మఱల ప్రారంభించెను. "ఏమనుచుంటిని? ఔను—అపరాధుఁడను నేనే, సందేహము లేదు. నేనుచేసిన అపరాధమేమో యెఱుఁగుదువా అమ్మా? ఎట్టి ఆధారము లేకున్నను, పెండ్లియాడి, సంసారమునదిగి, బిడ్డలను కంటిని—దోషి నే సందేహము లేదు. నేను పెండ్లిచేసికొంటిని నిజమే, కాని ఆయపరాధము నాదికాదు, నాతల్లిదండ్రులది. వారి పాపములవలన నాకు దుఃఖము కలిగినది, నాపాపములవలన మీకు దుఃఖము కలుగుచున్నది. నే నపరాధినే సందేహము లేదు. తల్లీ—అట్లైనఆహా! ఆశీర్వాదమా! ఆశీర్వదించెదను. మఱికొంచెము తాళి,—కొంచెముతాళి—ఏమిచేయవలెను? తరువాత—. అలసట చెందియున్న రామశంకరుఁడు మాటలాడుచునే కనులు మూసికొని నిద్రింపసాగెను.

రాత్రి చాలభాగము గడచినది. మాటిమాటికి తల్లి కోరుచుండుటవలన, సావిత్రి తండ్రి పఱుపుప్రక్కను నేలను పరుండి నిద్రించుచున్నది, కునుకుచు జోగుచున్నను సతి గోడనుచేరఁబడి కూర్చుండియేయున్నది. జాహ్నవి మాత్రము రెప్పనైనను వేయక భర్త ముఖమువైపు చూచుచు కూర్చుండినది.

తల్లి హఠాత్తుగ "సతీ"- అని పిలుచుచు ఆమెపై చేయివేసినది.

సతి కనులు విప్పి, "ఏమమ్మా ?" అన్నది.

"నాన్న గొంతులో ఎటువంటి శబ్దము పుట్టుచున్నదో చూడుమమ్మా, ఉండియుండి ముఖ మెట్లు చేయుచున్నారో చూడుము___ఏమి చేయుదమమ్మా."

ఏమైన తెలియునేమో యని, సతి కొంచెముసేపు తండ్రివైపు చూచి, "డాక్టరును పిలుచుకొని వచ్చిన నైన బాగుగనుండదమ్మా ?" అని యనెను.

"తెల్లవాఱ లేదింకను, చీఁకటిగానున్నది. ఇప్పు డెట్లు పిలుచుకొని రాఁగలము ?" అని జాహ్నవి యన్నది.

తల్లియు సతియు ఎంతో నెమ్మదిగా మాటలాడు చుండినను, సావిత్రికి తెలివివచ్చినది, లేచి నిలిచి "నేను వెళ్లుచున్నానమ్మా," అని ఆమె యన్నది.

"చిన్నపిల్లవు ఒక్కతెవే ఎట్లు పోఁగలవు ?" అన్నది తల్లి

"నేను వెళ్లెదనమ్మా, నీ వీ లోఁగా కొంచెము నిప్పుచేయుము—నేనిప్పుడే తిరిగి వచ్చెదను—డాక్టరుగారి యిల్లిక్కడికి దూరముకాదు."

జాహ్నవి నిప్పుచేసి భర్త పాదములు కాఁచుచున్నది, కాని కనులుమాత్రము ద్వారముపై నే యున్నవి. సుమారు అరగంట యైనది, సావిత్రియు డాక్టరును గదిలో ప్రవేశించిరి. అందఱికిని కొంచెము ధైర్యము వచ్చినది. రోగి యవస్థచూచి డాక్టరుగా రేమియు అనలేదు, వచ్చినందులకు ఫీజుకూడ పుచ్చుకొనలేదు, రెండు మోతాదులు మందుమాత్ర మిచ్చి వెళ్లిపోయిరి.

తెలివి తప్పిన రామశంకరునకు మఱల చైతన్యము రాలేదు. అతనిరోగ మంత కంతకు అధికమైనది. పెత్తల్లి, అప్పుడు, తన యేడ్పువిని గుంపుకూడిన, నలుగురు మనుష్యుల చేత చైతన్యములేని ఆరోగిని తులసికోటకడకు మోయించుకొని వచ్చినది. జాహ్నవి భర్తపాదములను తన ముఖముపై పెట్టుకొని తనలో తా నేడ్చుచు పడియున్నది; సావిత్రి "నాన్నా! నాన్నా!" అని మొఱపెట్టుచు గొంతుబ్రద్దలగున ట్లేడ్చుచున్నది; సతి గంగాజలమును తండ్రినోట పోయుచున్నది,—లోపున నుండి పొంగి వచ్చుచున్న దుఃఖము ఆమె కనులను అశ్రువులతో నింపుచున్నది. పెత్తల్లి రామస్మరణ చేయుచు కూర్చుండినది. ప్రతిదినమువలెనే నేడు కూడ నలుదిక్కులను ఉషఃకాంతి కనఁబడుచున్నది.

---

# ఏడవపరిచ్ఛేదము.

ప్రపంచములో ప్రతిస్థలమున జరుగుచున్నది, ప్రతి-దినము జరుగుచున్నది—ప్రతిదిన మన్న మాట యేమి, ప్రతి-క్షణము జరుగుచున్నది — భట్టాచార్యునియింట నేఁడు జరిగినది.

ఆయింట వినఁబడుచున్న యేడ్పులవలన మొత్తులవలన, ఎట్టికలతయుఁజెందక కాలప్రవాహము హాయిగా పోవు-చుండెను. పరోపకారబుద్ధిగల ఆపేటలోని యువకులు కొంద-ఱు రామశంకరునకు చేయవలసిన ఉత్తరక్రియలలో తోడ్ప-డిరి. జాహ్నవి ముఖాగ్ని పెట్టవలసివచ్చినది. జ్యేష్ఠపుత్రుఁడగు హరిశంకరుఁడు గ్రామమున లేడు. చాంద్‌పూర్ జమీం-దారుగారి బృందముతోఁగలసి కలకత్తా వెళ్లియుండెను. సరిగా అగ్ని పెట్టవలసినసమయమున జాహ్నవి హఠాత్తుగ తెలివితప్పి పడిపోయినది, నలుగురు కలిసి ఆమెను లేవనెత్తి, స్నానముచేయించి నియమానుసరణము వేషమును మార్పించి ఇంటికి తీసికొనివచ్చి కొమార్తెల కొప్పఁజెప్పి చేయవలసిన క్రియలు తామే ముగించి యింటికి వచ్చిరి.

శోకాచ్ఛన్నమగు దినములు అతిదీర్ఘములుగానుండును. కాని అవి యెవరినిగుఱించియైనను ఆలోచించుచు కూర్చుం-డవు, ఎవరిని మన్నింపవు, ఎవరికొఱకును ఆగవు, విరామము

లేక నడుచుచునే యుండును. బలము ప్రయోగించి మనుష్యుఁడు తనకు కావలసినస్థలము నాక్రమించుకొను-చున్నాఁడు.

నోట మాటలేక, యెట్టిచలనమును లేక పడియున్న తల్లి-వైపుచూచుచు సతీసావిత్రులు దినములు గడపుచున్నారు. నడుమ, అప్పుడప్పుడు, కాళీపదుఁ డేడ్చుచుండును—అక్కలు వాని నోదార్చుచుందురు. దినవారక్రియలు ప్రారంభించుటకు రెండురోజులుమాత్రమే గడువున్నది.

ఫ్యాక్టరీయజమానులు ధర్మబుద్ధిగలవారగుటచేత రామశంకరుఁడు హాజరుకాని ఒకరోజునకుమాత్రము ఐదణాల-నాలుగుపైసలు మినహాయించి అతనికి రావలసిన తొమ్మిది-రూపాయల పదియణాల ఎనిమిదిపైసలును అతనియింటికి పం-పిరి. దినవారములకు వానియవసరము వచ్చునని తలంచి సతి ఆరూపాయలను వేఱుగా నొకచోట నుంచినది. తాము పస్తుండ వలసివచ్చినను పస్తుండవచ్చును కాని తండ్రి పరలోకసౌఖ్యమున కెట్టి యాటంకమును రాకూడదు. ప్రతి-దినమును హరిరాక కండలు నెదురుచూచుచున్నారు—కాని హరి రాకున్నాఁడు. హరికొఱకై చాంద్‌పూరువెళ్లిన మను-ష్యుఁడు తిరిగివచ్చెను—"హరి యిక్కడలేఁడు కలకత్తాలో ఉన్నాఁడు." అని అక్కడివారు వానితో చెప్పినారఁట. వెళ్లిన-మనుష్యుఁడు సతి చెప్పినప్రకారము హరికి వర్తమానము

పంపుఁడని జమీాందారుగారి యింటివారిని వేఁడుకొనివచ్చెనట. కాని యన్నకు ఆవర్తమాన మందలేదని సతి నమ్మకము.

చివరకు కర్మ చేయవలసిన రోజు వచ్చినది. అందఱును కలిసి జాహ్నవిని కర్మ చేయుటకు తీసికొనిపోవ ప్రయత్నించఁగా ఆమెకు కొంచెము తెలివి వచ్చినది. నేఁటివఱ కామె యొకజడపదార్థమువలె నొకమూలను పడియుండెను, ఎట్టి యోచనశక్తియు లేనిదానివలె కొమార్తె లేమి చెప్పుచుండురో అదే చేయుచుండును. నేఁడు కొంచెము తెలివివచ్చుటచే జాహ్నవి ఇన్నాళ్ల కొక ప్రశ్న యడిగినది—"ఇది నేనేల చేసెదను సతీ? హరి—"

సతి తలవంచుకొని, "అన్నయ్య లేఁడమ్మా," అన్నది.

"లేఁడా? కబురుపంపలేదా?"

"కబురుపంపితిని, కాని అది అన్నకందియుండదు, అన్న కలకత్తాలో నున్నాఁడట."

జాహ్నవి కొంచెముసేపు యోచించి, "అట్లైన కాలీచేత చేయింపుఁడు, వానికి చేతనైనంత చేయనిండు—నాన్నగారికి దానివలన తృప్తికలుగును," అని యన్నది.

ఆతేండ్ల పిల్లవాఁడు రోజంతయు ఉపవాసముండి కర్మ ముగించెను. కర్మ ముగిసినతరువాత సతి తమ్ముని గొనిపోయి అమ్మఒడిలో కూర్చుండఁబెట్టి, "అమ్మా! వీనిని కొంచె మిఁక చూడుము, లేనియెడల వీని ప్రాణములైనను కాపాడలేము.

కొంచెము ధైర్యము తెచ్చుకొనుమమ్మా, లేకున్న మేమైన ఎవరిని చూచి నిలిచి యుండఁగలము?" అని యన్నది.

ఇది విని జాహ్నవి లేచి కూర్చుండి, కొమారుని ఒడిలో కూర్చుండఁబెట్టుకొని, తనచేతితో వానికి అన్నము తినిపించినది. గ్రామమునందు ధనికులు కొందఱు తమకుతోఁచి తామేవచ్చి వీరికి కొంచెము ధనసహాయము చేసిరి. నలుగురు బ్రాహ్మణులకుమాత్రము సంతర్పణచేసి, పాపమా దరిద్రుఁడగు రామశంకరుని యాత్మకు క్షుత్పిపాసలు తగ్గించుటకు వారు చేయఁగలిగినది చేసిరి.

జమీందారులు దుర్గేశనందిని నాటకముచూచుటకు హరిశంకరుని తీసికొని కలకత్తా వెళ్ళియుండిరి. తమసమాజములోకూడ ఈనాటకమే ప్రదర్శింపఁబోవుచున్నారఁట—హరి ఆయేషాభూమిక అభినయించు నఁట —అది అతనికి కనపఱచవలెనని కలకత్తా తీసికొని వెళ్ళినారఁట. వీరందఱును కలకత్తా నుండి తిరిగి వచ్చిరి—తమ గ్రామములో ఆనాటకము ప్రదర్శింపఁబోవునాఁడే హరిశంకరుని తండ్రి శ్రాద్ధము. హరికి తండ్రి మరణించెనని తెలిసినయెడల నాటకమంతయు పాడౌనేమో యని యోచించి నాఁడు శ్రాద్ధమని హరితో నెవ్వరును చెప్పలేదు. చాంద్ పూరుకును మజూత్ పూరుకును సుమారు మూఁడు క్రోసులదూరముండును, కాని అతి సామాన్యమరణమగుటచేత నాసమాచార మిక్కడ నెవ్వరికిని తెలియలేదు.

ఎట్లైననేమి నాటకము జరిగినది. గ్రామమున అహో-వాను పొగడని వాఁడులేఁడు. మహానందము కలిగి కాఁబోలు హరిశంకరునకు ఇంటి శోకమూఁ పోయిన బాగుగ నుండునని తోఁచినది. జామీందారు లడ్డు పెట్టలేదు, హరి మజూత్ పూరు-నకు బయలుదేఱెను. రామశంకరుఁడు చని పోయి పదునైదు దినములైనవి. భట్టాచార్యకుటుంబమువారు ఈయల్పకాల-ములో తమ శోకావేగమును తగ్గించుకొనవలసివచ్చినది. దుఃఖించుటకు వ్యవధిగ్గయినను వారికేది? దినవారము లైన తరువాత ఏ రవంత మిగిలియుండెనో దానితో ఈనాలుగు రోజులు సంసార మొకరీతిని గడపుచువచ్చిరి కాని భవిష్యత్తు భయంకరమగు ఘనాంధకారచ్ఛాయవలె సతీసావిత్రుల ముఖములపై పడుచుండెను. కొమార్తె లిద్దఱును తల్లి ప్రక్క-నుండి లేచి వెదురుబుట్టలోనుండు నారనుతీసి నీటిలో నానఁ-బెట్టిరి. ఏకులనుండి దారము తీయుటకై మంచము క్రింది-నుండు రాట్నము పైకితీసిరి. భోజనానంతరము అరుగుపై నిద్రించుచుండు కాళీపదుని ప్రక్కను జాహ్నవిని పరుండఁ-బెట్టిరి. ఆమె కాళీపదుని తలపై చేయివేసి శూన్యనేత్రము-లతో వాసముల వైపుచూచుచు పండుకొనియున్నది. పలువిధములగు తలంపులు ఆమెలో ప్రవహింప మొదలు-పెట్టినవి. ఎన్నాళ్ళనుండియో చక్కఁగా అమర్చబడి వచ్చు-చున్న ఆమె జీవనము నేఁడు గ్రంథిహీనమైపోయినది. అందుందునవన్నియు తాఱుమాఱై నేఁ డడ్డదిడ్డముగ పడి-

యున్నవి, పృథ్వి మునుపటివలెనే నవ్వుతో కలకలలాడుచున్నది, కాలము మునుపటివలెనే హాయిగా నడచుచున్నది, సూర్యుఁడు మునుపటివలెనే పృథ్విపై తన కిరణములను ప్రసరింపఁజేయుచున్నాఁడు, చంద్రుఁడు ఎప్పటివలెనే వెన్నెలను వెదచల్లుచున్నాఁడు, రాత్రి యెప్పటివలెనే తారాభరితమై యున్నది. ఆహా! ఎటువైపు చూచినను ఎట్టినిర్దయ! ఇందేదియు ఒక్కనాఁటికైనను ఎవరివిషయమైనైనను దుఃఖింపదు కాబోలు! కాని సానుభూతిరహితమగు ఈజడపదార్థసమూహముకంటె ఈవిషయమున సచేతనమగు మానవచిత్తమే మిగుల కఠినమైనదేమో?

హరి తటాలున ఇంటిలోనికి వెళ్లలేక పోయెను; అతనికి సందేహము కలిగించునట్టి దేదో కనఁబడిన ట్లైనది. ఇంటికేదో సంభవించినదా యనుఅనుమానమతనికి కలిగినది. ఇంటికి సిరివదలినది, ఇంటి పరిశుభ్రత తగ్గినట్లు కనఁబడినది, ఇల్లు తమసాచ్ఛన్నముగ నున్నదనిపించినది. తండ్రి రుగ్మత అధికమై యుండునేమో యని తోఁచి హరి భయపడుచు భయపడుచు అంగణమున ప్రవేశించి, "నాన్నా" అని పిలిచెను.

పనిచేయుచు కూర్చుండియున్న సతీసావిత్రుల చేతులలోనున్నవి జారి క్రిందపడినవి. జాహ్నవి దేహమున పులకరింపు పుట్టినది. భర్త కౌమారునితో కలిసి వచ్చుచున్నాఁడా అని ఆమెకు తటాలున తోఁచినది, కాని చూచుసరికి

హరి యొక్కఁడే కనఁబడెను. జాహ్నవి కనులు మూసికొనిపోయినవి.

పెత్తల్లికి తెలివివచ్చినది, గడబిడపడుచు లేచి అంగణములోనికివచ్చి ఆమె యే ఢ్వారంభించినది—— "ఓరి నాతండ్రీ, హరీ! మీనాన్న లేరురా, నాతండ్రీ. పదునాలురోజులై పోయినదిరా నాన్న వెళ్లిపోయి! వచ్చి నీవు నిప్పైన పెట్టలేదురా, పిండమైనవేయలేదురా! ఎటువంటికొడుకువై జన్మించితివిరా నాయనా!......"

హరి నిలుచుండి యుండుచోటనే హఠాత్తుగ కూలఁబడెను. ఇట్టిదికూడ జరిగియుండునా! ఎదుటనుండు సావిత్రిని చూచి మిగుల కలతచెందిన కంఠముతో, "ఏమిజరిగినది సావీ?——ఏమి?——అది——? నాన్న ఏఁడీ? అదినిజమేనా సావీ?—— కానేరదు, ఎన్నటికిని కానేరదు!" అని హరి యనుచుండెను.

సావిత్రి రెండుచేతులతో ముఖము మూసికొన్నది. అంగణమున పండుకొనియున్న తల్లివంకకు హరి కనులుపోయినవి——తెల్లని అంచులేని బట్టకట్టుకొనియున్నది తల్లి, జుట్టు చింపిరిచింపిరిగా నున్నది, నీరసించి తెల్లబారిన దేహముతో ఆమె అతిదీనముగ నచ్చట పడియున్నది. ఎల్లప్పుడును నవ్వుముఖముతోనుండు లక్ష్మీస్వరూపముగల తనతల్లియా ఈమె! అతని పాషాణనేత్రములను పగులఁగొట్టి కన్నీరుకాఱుట మొదలుపెట్టినది. చేతులలో ముఖము దాఁచుకొని, కదలక మెదలక హరి అచ్చటనే కూర్చుండెను.

చాలసేపైన తరువాత సావిత్రి మెల్లగా, "అమ్మయొద్దకొంకమాఱు రమ్ము, అన్నయ్యా," అని హారితో నన్నది.

"అమ్మదగ్గఱకా? వద్దువద్దు అమ్మయొద్దకు రాలేను. నన్ను పోనిమ్ము."

సతి అన్నదగ్గఱకు వచ్చి, "నీవు చేసినదానికి ప్రాయశ్చిత్తములేదు. అమ్మయవస్థ బాగగు ప్రయత్నము చేయుము, తమ్ముఁడు బ్రతికియుండుమార్గము కనిపెట్టుము. ఇక్కడనుండి పోయి. నీవు చేయఁగలదేమియున్నది? రమ్ము, అమ్మయొద్దకు, వచ్చి కొంచెమామెదగ్గఱ కూర్చుండుము," అని కఠినస్వరముతో ననెను. చెల్లెలిమాట నతిక్రమించి పోవుటకు హారి సాహసింపలేదు. అతఁడు లేచి నిలువఁగానే పెత్తల్లికేక వినఁబడినది—"ముట్టుకొనకుము—స్నానముచేయనిదే ఎవ్వరిని ముట్టుకొనకుము."

"అట్లైన పెరటివైపుననుండు చెఱువునొద్దకు పోదము రమ్ము, ఇప్పుడేటికి పోనక్కరలేదు" అని సతి కొంచెమాలోచించి అన్నది. బయటికి పోనిచ్చిన అన్న పాఱిపోవునేమోయని అనుమానించి సతికూడ నతనితో పోయి స్నానముచేయించి మఱలవాని నింటిలోనికి తీసికొనివచ్చినది. స్నానముచేసి వచ్చి హారి తల్లిప్రక్కను చాలసేపు ఏడ్చుచు కూర్చుండెను.

జాహ్నవి నిట్టూర్పు విడిచి ఇట్లనసాగెను—"ఏడ్చి యేమి ప్రయోజనము నాయనా? నీమీఁద నెట్టికోపమును

ఉంచుకొనక నిన్నాశీర్వదించుచునే నాన్నగారు వెళ్లిపోయినారు. నీవు మంచివాఁడవు కమ్ము, నాన్నగారానందించుదురు."

జమీందారులను హరి తనలో తాను పలువిధముల దూషింపసాగెను, ఇక నెన్నఁడును వారితో నెట్టి సంపర్కమును ఉంచుకొనననని ఒట్టుపెట్టుకొనెను. కొన్నాళ్లవఱకు అతఁడు ఇల్లు వదలలేదు. అన్నకు నిజముగా దుఃఖము కలిగినది. ఇఁక మంచిదారిని పడునని సతి తలఁచినది, కాని మఱి రెండురోజులలో అట్టియాశ వృథాకాకమానదని పోల్చుకొన్నది.

రెండు మూఁడు రోజులు సంకోచమువలన హరి యేమియు అనలేకుండెను. చివరకొకనాఁడు సతితో ఇట్లనసాగెను; "సతీ, నేనిట్లు ఇంట కూర్చుండి యుండిన రోజులు గడవవు. బయటకి పోయి ఏదైన పని చూచుకొనెదను. ఇదిగో, నాయొద్దను పదిరూపాయలున్నవి, ఇవి తీసికొని ఇప్పటి వలెనే సంసారము జరుపుచుండుము. కొద్ది రోజులలో సమస్తభారమును నేనే వహించెదను. నీవు భయపడ వద్దు. ఈలోపున మిగుల నవసరమని తోఁచినయెడల చాంద్‌పూర్ జమీందారుగారియింటికి ఎవరిచేతనైన వార్త పంపుము, లేదా నాపేర నొక జాబును వ్రాయుము. నేను వెంటనే వచ్చెదను——ఏమి! తెలిసినదా చెల్లీ? ఇఁక నేను పోయెదను, ఇక్కడ కూర్చుండియుండిన ప్రయోజనము లేదు."

అన్న చెప్పునది సతి బోధపఱచుకొని ఏమియు ననక యూరకొనెను. సావిత్రి మాత్రము, "అన్నా, మఱి రెండురోజు లుండుము. నీవు వచ్చినప్పటినుండి అమ్మకు దుఃఖము కొంచెము తగ్గినది—కావలెనన్న రెండు రోజులైన-తరువాత పోవచ్చును," అనుచు దీనముగా వేడుకొనసాగెను.

"పిచ్చిదానవు నీవు—ఊరక కూర్చుండిన నెట్లు గడచును? చూడుమమ్మా చెల్లీ—నేను పోవుచున్నానని అమ్మతో ఇప్పుడు చెప్పవద్దు—ఏడ్చుచు కూర్చుండు నేమో! నే నిప్పుడు వెళ్లెదను, అమ్మతో తరువాత చెప్పుము."

సాయంకాలమైన తరువాత తల్లి సావిత్రిని పిలిచి దగ్గఱ కూర్చుండఁబెట్టుకొని జడలుకట్టి ధూళితో నిండియున్న ఆమెచింపిరిజుట్టును దువ్వి సరిచేయవలెనని ప్రయత్నము చేయుచుండెను. తల్లికి తెలియకుండ కన్నీటిని తుడుచుకొనుచు సావిత్రి, "ఇప్పటి కాలాగుల నుండనిమ్మమ్మా, మఱి యొకనాఁడు దువ్వవచ్చును," అని యన్నది. బలహీనముగ నుండుటచే జాహ్నవిచేతులు విఱిగిపడునట్లుండెను, అయినను, జుట్టు వదలక, "చాల జడలు పడిపోయినవమ్మా, ఇప్పుడు విప్పనియెడల తరువాత మఱి విప్పుటకు శక్యము కాదు," అనెను.

రాత్రి పని చక్కఁబెట్టి వంటయింటికి తాళమువేసి సతి కాళీపదుని కొఱకు గిన్నెడుపాలు పట్టుకొని గదిలో ప్రవేశిం-

చెను, ఆమె పాలగిన్నె ఉట్టిపై పెట్టి నిలిచి యుండుట చూచి తల్లి, "వంటయింటి తలుపు వేసితివేల సతీ? అన్నయ్య భోజనము చేయఁడా? మీరు భోజనము చేయరా?" అని యడిగినది.

"అన్నయ్య భోజనముచేసినాఁడు. ఇంటిపని అయి-పోయినది."

"నీవు భోజనము చేయవా? హరీ!—హరి యేఁడీ?"

సతి క్రిందికి చూచుచు, "ఏదైన ఉద్యోగమునకై ప్రయత్నించవలెనని చాంద్‌పూర్ వెళ్లినాఁడమ్మా" అన్నది.

"నాతో చెప్పలేదేమి?"

"నీ వేడ్చెదవని నీతో చెప్పలేదు. రెండుమూఁడు రోజులలో మఱల వచ్చెదనని చెప్పి వెళ్లెను. పనిలేకున్న ఎట్లు గడచును అన్నాఁడు. ఇంటి ఖర్చులకై పదిరూపాయలు కూడనిచ్చెను."

జాహ్నవి ఏమియు పలుకక కొంతసే పూరకుండి, మెల్లగా—"నే నేల నేడ్చెదను; దేనివలన వానికి సుఖము కలుగునో అదియే చేయనిమ్ము," అని తల్లి యనెను. సావిత్రి జుట్టువిప్పుటకు ప్రయత్నముచేసినది గాని సాధింపలేక అలయికఁజెంది, "సావిత్రికి తలదువ్వుమమ్మా సతీ, నాకు చేతకాకున్నది," అని యన్నది.

సతి సావిత్రిజుట్టు దువ్వుట మొదలుపెట్టినది సావిత్రి వద్దువద్దనుచుండెను, అక్క కోపముతో నాలుగుమాటలాడి

త్వరలో. నామెజుట్టు దువ్వి ముడివేసినది. జాహ్నవి పఱుపుపై పరుండియుండెను; సావిత్రి వచ్చి ఆమెగుండెకడ తలనుంచి ఆమెపై తన కుడిచేయిని వేసి ప్రక్కను పరుండెను. సతి దగ్గఱకు వచ్చి, "అమ్మా కొంచెము ఫలాహారము చేయుము" అన్నది.

"వద్దమ్మా నన్ను చీకాకుపెట్టకుము, నాకు కొంచెము నిద్రవచ్చుచున్నది," అని తల్లి యుత్తరమిచ్చినది.

చింతలో నున్నప్పుడు తల్లికి నోట మాటయుండదు, ఎట్టి చలనమును నుండదు, నిద్రించునప్పటివలె మైమఱచి పడియుండును. సతి ఈమాట యెఱుఁగును. అట్టి సమయములలో నెవ రేమన్నను తల్లికి బహుకష్టముగా నుండును, కనుక సతి తల్లిని విడిచి పరుండియున్నతమ్ముని లేపి వానిచే పాలుత్రాగించి, బహుప్రయత్నముపై వానిని మఱల నిద్రపుచ్చినది. ఆవు ఇచ్చుచున్న యీపాలే ఆబాలకుని జీవనమున కాధారము; కనుక ఆయావున కెట్టిలోటును లేక సంరక్షణ జరుగుచుండెను.

అంతకంతకు రాత్రియగుచున్నది, ఆనాఁడు సహింప శక్యముకాని వేఁడిగా నున్నది. సతి దీపమార్పి పైటచెంగు నేలపఱచి కిటికీయెదుట పరుండియున్నది. జడలు జడలుగనుండు ఆమె పెద్దజుట్టు నాలుగువైపుల నల్లుకొనియున్న నాచువలె క్రింద చెదరిపడియున్నది. బయటను ఘన మేఘాచ్ఛన్నమగు ఆషాఢాకాశము—ఎట్టి వెలుతురును లేదు, నక్షత్ర మొక్కటియైనను కానరాలేదు. స్తంభితమై యున్న పృథ్వి

సతీవలెనే పైటచెంగు పట్టుకొని పరుండియున్న ట్లున్నది— దుఃఖాక్రాంతమై అలసిపడియున్నది—మరునాటి యుదయము లేచి నిలువలేదేమో!

రాతివలె నామె గుండెపై కూర్చుండియుండు భారమున కర్థమేమో సతి యెఱుఁగ కుండెను. పగలు పనిలో మునిఁగి-యున్నంతసే పామెకు హాయిగా నుండును. కొంచెము వ్యవధి దొరకఁగానే ఆభారము మఱల నామెను నొక్కుచుండును. ఇంక నెంతకాల మిట్లుండునో గదా ? ఈభార మెన్నఁటికిని ఆమెను వదలదా ? మనసార నొకమాఱు ఏడ్వవలెనని యామెకు కోరిక పుట్టుచుండెను, కాని యేడ్పు రాకుండెను.

సతి యొకసారి తలయెత్తి చూచి, "ఏమి అంధకారము!" అని తనలో తా ననుకొనెను. ఆకాశమున మిణుకు మిణుకు మనుచున్న నక్షత్ర మొకటి మాత్రము కనఁబడినది. "ఆ నక్షత్రము మా నాన్న యగునా?" అని ఆమెకు తోఁచినది. "నాన్న పోవుచున్నప్పుడు నన్ను రమ్మని పిలుచుచు వెళ్ళిపో-యెను, ఇప్పటికిని పిలుచుచున్నాఁడా ఏమి ?" ఇ ట్లనుకొనుచు హఠాత్తుగ నా నక్షత్రమువైపు మఱియొకమాఱు చూచెను- అది మఱీ యుజ్జ్వలమానమై భయంకరమగు నేత్రములతో నామెవంక చూచుచున్న ట్లుండెను. భయముఁజెంది సతి లేచి కిటికీ తలుపులు మూసి అమ్మప్రక్కను పరుండెను. నిద్రించు-చున్న తమ్ముని, చెల్లెలను, అమ్మను ఒకసారి ముట్టుకొని,

"పోను పోను, నాకు పోవలె నని లేదు" అని వినీ వినఁబడనట్లనెను.

మూఁడు మాసములు గడచినవి. ఈలోఁగా హరిశంకరుఁ డింటి కొకమాఱు వచ్చి కొన్ని రూపాయ లిచ్చిపోయెను. ఈరూపాయలవలనను, ఆ ముగ్గురి పరిశ్రమవలన దొరకినడబ్బువలనను రోజు లొకరీతిని గడచుచుండెను.

సతి ప్రతిదినము ఏటికి పోవుట మానినది. స్నానమునకై ఒకనాఁడు చెఱువు నొద్దకు పోయియుండెను, సావిత్రి ఆవుకు తవుడు కలిపిపెట్టుచుండెను, అట్టి సమయమున పోస్టుబంట్రోతు వచ్చి "ఉత్తరము" అని కేక వేసెను. కాళీపదుఁడు పఱుగెత్తుకొనిపోయి ఉత్తరము తెచ్చి అమ్మచేత పెట్టెను. తల్లి తులసికోట యెదుట నలుకుచుండెను, ఎడమచేతితో కార్డునందుకొని చదివినది. చదివి వణఁకుచు ఆవేడలో నచటనే చలికిలఁ బడిపోయినది.

సతి స్నానముచేసి వచ్చి వంటయింట నీళ్లబిందె నుంచి తల్లి దగ్గఱకు వచ్చి నిలిచి, "ఏమమ్మా, వణఁకుచున్నావేమి?" అని భయపడుచు నడిగెను. తల్లి ఏమియు నుత్తరమీయలేదు.

కార్డు ప్రక్కను పడియున్నది. సతి దానిని తీసి చదివినది—నవగ్రామవాసియగు తీన్‌కోడి లాహిడీగారు పరలోకప్రాప్తులైనారు. అతని కొమారుఁడు ఈవార్త సవతితల్లికి తెలియఁజేయుచు, బంధుసమేతముగ వచ్చి తనయింట జరుగఁబోవు పారలౌకికకార్యము సుసంపన్నము చేయుమని కోరుచున్నాఁడు.

సతి కూడ నేమియు పలుకక కొంతసేపక్కడ నిలిచి యుండెను. కార్డు చేతిలోపట్టుకొని అక్క అచ్చట నిలిచి యుండుట చూచి సావిత్రి కొంచె మాశ్చర్యమొంది అక్క కడకు వచ్చెను. అక్క చేతిలోనుండు కార్డును తీసికొని చదివి, అక్క ముఖ మొకసారి చూచి బిగ్గరగ, "అమ్మా, అమ్మా!" అనుచు ఏడ్వసాగినది.

పెత్తల్లి పలుగెత్తికొని వచ్చి ఏడ్పులో మునిఁగియున్న సావిత్రిని చూచినది, ఎంతో కష్టముపైని ఆమె ఏలయేడ్చు చున్నదో తెలిసికొని, పెద్దకేకలతో తానుకూడ ఏడ్వారంభించినది. క్రమక్రమముగ ఆపేటవా రందఱును అక్కడ పోగై ఇంటిని మొఱలలో ముంచిరి. జాహ్నవి చేతులలో ముఖము నుంచుకొని ఊరక కూర్చుండెను, ఆమె కీ రోదనమంతయు ఎగతాళివలె నుండెను—సతికి పెండ్లి చేసిననాఁడే ఏడ్పు లన్నియు ముగిసినవి—ఇప్పుడు మఱల ఈగోల యేల!

చాల ప్రొద్దుపోయినది, పెత్తల్లి వచ్చి, "కావలసిన దైనది. రమ్మమ్మా, ఇఁక స్నానముచేసి వత్తువుగాని" అన్నది.

"చెఱువులో స్నానముచేసిన చాలదా?" అని సతి యడిగెను.

"ఎంతమాట! ఎంతమాట! ఏటికి వెళ్లవలెను," అని అందఱు ననిరి.

సతిధోరణి చూచి అందఱు నామెను లోలోపల నిందింపసాగిరి—ఎటువంటి పిల్లకదా! కాఁపురము చేయుటకు

వాళ్లకున్న నేమి, భర్తయే కదా, పెండ్లి చేసికొనలేదా! కండ్ల నొక్కనీటిబొట్టైనను లేదుకదా! ఆహా ఎటువంటి పిల్ల! సతి గాజులు విఱుగఁగొట్టఁ బోవుసరికి పెత్తల్లికి నిజముగా దుఃఖము వచ్చినది. సతి ఇటుకముక్క నొకదానిని తీసి తానే వానిని చిట్లఁగొట్టినది.

స్నానము చేసి తెల్లని మల్లుపంచెయొకటి కట్టుకొని నొసట కుంకుమ లేక పోయినను చేతిని గాజులు లేకున్నను సతి క్రొత్తదుఃఖమేమియు లేనట్లు ఎప్పటివలెనే ఇంటికి నడిచివచ్చెను. నలుగురు తనవైపు చూచుచున్నారనుజ్ఞాన మొక అవ్యక్తమగు బాధరూపమున ఆమెహృదయమును దిగజార్చుచుండెను. గడప దగ్గఱకు రాఁగానే పెత్తల్లి, "కాళీ, వేపాకులు రెండిమ్ము"—అని కేక వేసి, సతితో, "ఇంటిలోనికి పోవద్దు—వేపాకులు నమలుము మొదట, తరువాత అగ్నిహోత్రము ముట్టుకొనుము—పిమ్మట లోనికి పొమ్ము." అని యన్నది.

సతి యథావిధిని అంతయు మిగుల నోర్పుతో చేసినది. సతి ఇంటిలో ప్రవేశించుసమయమున, "సావీ, నీవు ప్రక్కకు పొమ్ము, అక్కముఖ మిప్పుడు చూడకుము," అని యెవరో అనిరి. ఆమాటలు వినఁగానే సతి ముసుగును ముఖముపైకి లాగుకొనినది, సావిత్రి పఱుగెత్తికొని పోయి "అక్కా నీకెవరీబట్టలు కట్టినారు," అనుచు అక్కను పట్టుకొనెను. అక్కడ నున్నవా రందఱును సావిత్రిని చీవాట్లుపెట్టిరి. సతి అచ్చటనే

చతికిలఁబడిపోయినది. అక్క భుజముపై మెడనుంచి సావిత్రి యేడ్వసాగినది. కన్నులు తుడుచుచు పతి చెల్లెలికి బోధపఱచుచుండెను.

పెత్తల్లి జాహ్నవియొద్దకు వచ్చి, "ఇఁక లెమ్ము, నొసటనేమియున్నదో అది జరిగినది, పిల్లకేదైన తినుటకిమ్ము— విచారించి యిప్పుడు చేయఁగలదేమియున్నది? " అని తోడికోడలితో చీవాట్లు పెట్టుచు ననెను.

తల్లి లేచి దగ్గఱకు రాఁగానే సతికూడ లేచి నిలిచినది. విధవవేషమును ధరించియున్న కొమార్తెను చూచి ఇంత సహనముగల జాహ్నవియు దుఃఖమాపుకొనలేక బిగ్గఱగా నేడ్వఁబోయినది. కాని ఆమె కంఠము రాలేదు, సతిని రెండుచేతులతో గట్టిగా పట్టుకొన్నది.

అట్లు చాలసేపుండి, "సతీ, రమ్ము తల్లీ, రెండుగ్రుక్కలు పానకము త్రాఁగెదవు గాని, " అని తల్లి అన్నది.

"నాకు దాహము వేయలేదమ్మా, నీవు కొంచెము త్రాఁగుము, నేను బియ్యము పొయ్యిమీఁద పెట్టి వచ్చెదను" అన్నది.

"దొడ్డమ్మ వండుచున్నది, నేఁడు నీవు వంట చేయకూడదమ్మా. "

"ఓహో!" అనుచు సతి అచ్చటనే చతికిల పడిపోయినది.



## ఏడవపరిచ్ఛేదము.



విశ్వేశ్వరుఁడును అన్నపూర్ణాదేవియు తీర్థయాత్ర ముగించుకొని యింటికి వచ్చునప్పటికి సుమారొక సంవత్సరమైనది. పూర్వ మొకమాఱు విశ్వేశ్వరుఁడు పశ్చిమప్రాంతములు చూచివచ్చెదనని యనెను, కాని అది సాగలేదు. ఇప్పు డిద్దఱును కలిసి తీర్థయాత్రకై బయలుదేఱిరి. ఆదినాథుని దర్శనము, చందనాథుని దర్శనము అయినతరువాత, పావిత్రి, పుష్కరము, కురుక్షేత్రము, హరిద్వారము మొదలగు కష్టసాధ్యములగు క్షేత్రములకు కూడ పోయిరి. పిన్ని నేఁటివఱకు ఈక్షేత్రములలో నొక్కచోటునకైనను పోలేదు. లేకలేక బయలుదేఱినందులకు అన్నియును ముగింపనిదే యింటికిఁ పోకూడదని విశ్వేశ్వరుఁడు నిశ్చయించుకొనెను.

పుట్టినప్పటినుండి యిల్లు విడిచి బయటికి రాని విశ్వేశ్వరునిలో నూతన ప్రపంచ సంపర్కమువలన నూతనజీవ ముదయించినది. నేఁడిక్కడ, రేపక్కడ-స్నానముచేసి యొకనాఁడు, దేవుని దర్శనముచేసి యొకనాఁడు, పర్వతారోహణముచేసి మఱియొకనాఁడు, గడపుచు విశ్వేశ్వరుఁడు సంవత్సర మంతయు తన్ను తాను మఱచియుండెను. ఉత్తరాదిని యాత్ర చేయుచున్నప్పు డొకచోట విశ్వేశ్వరుఁడు, "పిన్నీ, మన మిక్కడనే యిల్లొకటి కట్టించుకొని ఉండి పోవుదము." అని అన్న-

పూర్ణతో ననెను. అన్నపూర్ణ చిఱునవ్వు నవ్వుచు నూర-కుండెను. ఉత్తరదేశయాత్ర పూర్తిచేసికొని వారిద్దఱును పశ్చిమాభిముఖు లైరి. ఆప్రాంతములలో తిరుగుటవలన విశ్వేశ్వరునకు ఆనంద మెంతకలిగెనో దుఃఖముకూడ నంత కలిగెను. దుర్భిక్షదేవత వచ్చి పశ్చిమదేశము నంతను చుట్ట-రించి అప్పుడే పోయినది. విశ్వేశ్వరుఁ డదిచూచి ఒకనాఁడు, "పిన్నీ, మన యింటికి మఱల పోకుండ నిక్కడనే యుండి-పోయిన బాగుగనుండదా ?" అని అన్నపూర్ణతో ననెను.

"ఏల బాగుగ నుండును ?"

"ఎక్కడ చూచినను లేమియే! సామాన్య సంసారులు-కూడ తిండికిలేక బాధపడుచున్నారు. ఇక్కడనుండిన యెడల 'మనమెట్టి యుపకారము చేయఁగలము ఎవరికి చేయఁగల'మని యోచించుచు కూర్చుండ నక్కఱలేదు. దారిద్ర్యమన నేమియో తెలిసికొనఁ గోరువారు కఱవు రోజులలో పశ్చిమ-దేశము రావలెను."

ఎట్టి ఉల్లాసమును లేని నవ్వునవ్వి, పిన్ని, "మనదేశ-ములో నిరుపేదలు, తిండికి లేనివారు లేరోయి, పిచ్చివాఁడా!" అన్నది:

"ఉండవచ్చును కాని వారియవస్థ వీరియవస్థతో సరి-పోల్పఁ దగినదే కాదు. 'సుజలాం, సుఫలాం, సస్యశ్యామలాం' అనఁదగినది కదా మన దేశము! ఏమియు లేనివారైనను తిండికి లేక చావవలసిన యవసరమురాదు."

"నిజమే! కాని రామశంకరునింటిమాట కొంచె మాలోచించి చూడుము."

"చూచితిని. కాని వారే యీదేశమున నుండినయెడల ఏనాఁడో చచ్చిపోయే యుందురు. మన దేశమున నుండుటచే ఇప్పటికిని మర్యాద నిలుపుకొని కాలముగడపుచున్నారు. పిన్నీ, లేమిలేనిచోట మన మితరుల కెట్టిసహాయమును చేయలేము—చేయుటకు సిగ్గగును. అక్కడ నుండువారు కష్టపడి పనిచేసి ఏదోవిధముగ గడపుకొనుచుందువా రగుటచే సాయ మందుకొనుటకుకూడ వారికి కష్టముగ నుండును—నలుగురి కంటికి బిచ్చమెత్తుకొనువారివలె కనఁబడుటకు వారికిష్టముండదు. ఎచ్చట అట్టి సంకోచ ముండదో, ఏదేశములో సహాయము చేయువారు లేకుండుటచే ప్రజలు తిండికి లేక చచ్చిపోవుచుందురో అటువంటి దేశములో మన ముండవలెను పిన్నీ. అట్టిచోట ఎట్టి ప్రయత్నము లేకయే మనము సత్కార్యములు చేయుచుండఁ గలుగుదుము."

"ఏమి చేయఁగలము? ఏమి నీకు చేయవలెనని యున్నదో చెప్పుము," అని నవ్వుచు పిన్ని అడిగినది.

విశ్వేశ్వరుఁడు ముఖము వాల్చుకొని సిగ్గువలన ముఖ మెఱ్ఱఁగాఁ జేసికొనెను. పెద్దపెద్ద మాటలాడుట యాతనికి చేతకాదు. భావోద్రేకమువలన హృదయ మాందోళిత మైనప్పుడు కేవలము వాగ్విహీనుఁ డగుట అతనికి స్వాభావసిద్ధము. అట్టిస్వభావము గలవాఁడగుటచేతనే స్వగ్రామమున అతిథిశాల

కట్టించుచు కట్టించుచు హఠాత్తుగ పని నాపుచేసెను. 'నేను బహు ధనవంతుఁడను, దయాళువును; ఎట్టి సహాయము కోరు వారైనను నాయొద్దకు వచ్చినయెడల వారు కోరు సహాయము బొందఁగలరు, అందఱి దుఃఖములను తొలఁగింపఁగలవాఁడను నేను,' అని ఎట్లతఁడు ప్రచారణ చేయఁగలఁడు! తలఁచుకొని నంతమాత్రమున అతని హృదయము సంకుచితమగుచుండెను. కనుకనే భావోద్రేకమువలన అతిథిశాల కట్టుట మొదలుపెట్టి-నను, హఠాత్తుగ పని నిలిపివేసెను. అతఁడు కట్టించఁబోవుచుండి-నది పట్టుబట్టల ఫ్యాక్టరీ యనియు, పట్టుధర తగ్గిపోవుటచే ఫ్యాక్టరీ కట్టుట విశ్వేశ్వరుఁడు నిలిపినాఁడనియు, దేశమంత-టను అనుకొనుచుండిరి. అతిథిశాల పని యాపుటకు మఱి-యొక కారణముకూడ నుండెను. ఇతరుల సహాయము నందుకొని నలుగురిచేత యాచకులనిపించుకొనుటకు సిద్ధ-ముగా నుండువారు మన దేశములో చాలా తక్కువ. అట్టి సంకోచము లేనివారు వైష్ణవ భిక్షువులు మాత్రమే. హిందూదేశమునను్ండు ధర్మశీలురగు గృహస్థుల దయవలన వారికికూడ నెట్టి లేమియు లేదు. కనుక పలువిధముల నాలోచించి విశ్వేశ్వరుఁడు అతిథిశాల కట్టించవలెనను ఉద్దే-శము వదలుకొనెను.

పశ్చిమ ప్రదేశముల నుండువారి దుర్దశ చూచి విశ్వేశ్వరుఁడు కన్నీరాపుకొనలేకపోయెను. పశ్చిమప్రాంత-ములకు వచ్చి అనేక దినములనుండి తనతో నున్నవా కొక్కను

నెఱవేర్చుకొనుచు అక్కడనే ఉండిపోవలెనని అతనికి బుద్ధి పుట్టినది. కాని పిన్ని మనస్తాపముతో నవ్వుచు నతనికోరిక కద్దుపచ్చుచుండెను, కుబేరుని ధనాగారము లేక అక్కడి కలిమిను చల్లార్చుట కెవరికిని శక్యముకాదని ఆమె తెలిసి కొనినది. లెక్కలేని దానములుచేయుచుండు విశ్వేశ్వరుని పిన్ని నిరుత్సాహ పఱచలేదు, కాని యింటికి పోదము రమ్మని యతనిని తొందర పెట్టుచుండెను. ఆదేశమున చాల కాల మున్నట్లైన కుమారుని తలతిక్క మఱింత అధికమగునని యామెకు తోఁచినది, కుమారుఁడు తనయాస్తి యంతయు దానముచేసి సంపూర్ణముగ రిక్తుఁ డగునేమో యని పిన్నికి భయ మగుచుండెను.

పిన్ని తొందరపడుచుండుటచేత విశ్వేశ్వరుఁ డింటికి త్వరగా పోవలెనని ప్రయత్నముచేయుచుండెను. ఒకనాఁడు వంటచేసికొని పిన్ని కనిపెట్టుకొని యున్నది—రెండుగంటలు దాఁటినది, మూఁడు కాఁబోవుచున్నది—ఆ సమయమున విశ్వేశరుఁ డింటికి తిరిగివచ్చెను—జుట్టు చింపిరి చింపిరిగా నున్నది, తలపై గుడ్డయైనను లేదు. ముఖ మెండను మాడి యున్నది, ముఖమునిండ దేహమునిండ చెమట. పిన్ని అతనికి పానకముచేసి యిచ్చి, విసరుచు ప్రక్కను కూర్చుండి అతని శ్రమను తీర్చినది. ఇంతసేపటివఱకు విశ్వేశ్వరుఁ డేమి చేయుచుండెనో ఆమె యెఱుఁగని విషయము కాదు.

ఏఁబది మంది కొఱకు వంటచేయించుమని విశ్వేశ్వరుఁడు పిన్నిని వేఁడుకొనుచుండును, పిన్ని తన బుద్ధి

ప్రయోగించి నూఱుమందికి తగిన యేర్పాటు చేయు-చుండును. గాడీ ప్రొయ్యిలపై పెద్ద హండాలతో అన్నము ఉడుకుచుండును, విశ్వేశ్వరుఁడు అంగవస్త్రము నడుమునకుకట్టి ఉత్సాహముతో ఇటునటు పరుగెత్తుచుండును. పిన్ని కూడ-వండుచు కూర్చుండును. చివరకు రెండువందలమంది కుమ్ము-లాడుకొనుచు భోజనమునకై తయారగుచుండురు. వండిన వంట చాలదు గనుక బియ్యము పంచి వచ్చినవారి నందఱిని శాంతింపఁజేయవలసి వచ్చుచుండును.

పరిశ్రమ అధికమై విశ్వేశ్వరుని దేహము కృశింప నారంభించినది, రెండుమూఁడుసార్లు జ్వరముకూడ తగిలినది. ఇదిచూచి పిన్ని మూట ముల్లె కట్టి విశ్వేశ్వరుని తోడ్కొని రైలెక్కినది. వారిద్దఱును ఇల్లు విడిచిన ఒక సంవత్సరము-నకు మఱల స్వగ్రామమును చేరుకొనిరి. రైలులో నుండఁగానే పిన్ని యొకనాఁడు విశ్వేశ్వరునితో, "విశూ, ఇంటికి వెళ్లిన ఒక నెలలోఁగా నీకు పెళ్లి చేసెదను; జ్ఞప్తియందుంచుకొనుము;" అని అన్నది. విశ్వేశ్వరుఁ డది విని నవ్వెను.

వివాహ మనిన విశ్వేశ్వరుని మనస్సున నిజముగా భయము పుట్టుచున్నట్లుండెను; ఏరీతిగ నాలోచనచేసి వివాహము చేసికొనననీ మొదట నన్నాఁడో చెప్పుట కష్టము; కాని ఆసంకల్ప మిప్పుడు నలుదిక్కుల శాఖల నల్లుకొని లోఁతుగ వేరు తన్నియున్న అశ్వత్థవృక్షమై స్థిరపడినది. గాలి, వాన, తుపాను—దేని భయమును దాని కిప్పుడు లేదు.

మొదట నది సామాన్యమగు నూహ—కడుచిన్న విత్తు, అదియే యిప్పుడు రాళ్లను పగులగొట్టఁగల పెద్దపెద్ద వేరులుగ పరిణమించినది. మొదట నతఁడు పెండ్లి చేసికొనను అనుటకు కారణము అతఁ డప్పుడు విరామములేక రసవిహీనమగు గ్రంథ-పఠనములో నిమగ్నుడై యుండుటయే. అట్టి సమయమున అతని తల్లిగాని, అక్క సెల్లెండ్రుగాని అతఁడు ప్రేమించగల దగ్గఱ చుట్టము లెవరైనగాని అతనితోడ నున్నయెడల ఇట్టి-ఉద్దేశ మతనిలో పుట్టియుండక పోనేమో! పిన్ని అప్పుడే ఈ యింటికి వచ్చియుండెను; కేవలము తాను చేయక విధిలేదు. అన్నపనులు మాత్ర మామె చేయుచుండెను. పైవారి పిల్ల-వానిసంబంధమున అంతకంటె చనువు చేసికొనుట కిష్ట-పడలేదు.

కాని ఆగర్వ మీవృద్ధవయస్సున పిన్ని నంటియుండ-లేదు. కాని స్త్రీ జాతి యెడలగల భయము విశ్వేశ్వరుని వదలకుండెను. అతఁడు చేయుచుండు జ్ఞానచర్చ నడుమ, వ్యవధి దొరకినప్పుడెల్ల నతఁడు కావ్యములు మొదలగు నితర-గ్రంథములు చదువుచుండెను. చదువుచుండు గ్రంథము-లలో స్త్రీ జాతికిఁగల ప్రాముఖ్యము చూచుచున్న కొలఁదిని అతనికి భయ మధికమగుచుండెను. మహావిస్తృతమైనది పురుషజీవితము. సామాన్య స్త్రీయో బాలికయో ఒకతె అట్టి పురుషుని జీవితమునకు కేంద్రముగ ప్రతిష్ఠితమై, ఎట్ల-తనికి సార్థకత నీయఁగలదో, అతని సర్వసుఖములకు ఆధారము

నాఁగలదో యెంత యోచించినను విశ్వేశ్వరునకు బోధపడకుం-
డెను. ఐనను కావ్యాదిసాహిత్యములకు స్త్రీయే ప్రాణమై-
యున్నదో ఆలాగుననే ప్రపంచమునకు కూడ స్త్రీ ప్రాణమై-
యున్నది. తానుకూడ ఈమాయలోపడి మతి తప్పినవాఁ-
డగునేమో యని భయపడుచు, అట్లు కాకుండుటకై విశ్వేశ్వ-
రుఁడు మహాప్రయత్నము చేయుచుండెను. తాను పెండ్లి-
యాడిన ట్లూహించుకొని, విశ్వేశ్వరుఁడు తన యవస్థనుగుఱించి
మనలో తాను తర్కవితర్కములు జరిపి చూచుచుండెను.
తానాశించుచుండు సుఖములన్నిఁటికిని ఆబాలికయొక్క సుఖ-
దుఃఖములా పర్యవసానము? తాను చేయుపనులన్నియు ఆ
బాలికకొఱకా? తన యనురాగము, ఉత్సాహము—అన్నియు
నీక్షుద్రబాలికతో ఆగవలసినదా? మానవహృదయము కోరు
చున్న దిదియా యేమి? సుఖము, శాంతి, తృప్తి అనిన నివియే-
నైనచో దాసత్వమని దేనికందురు?

ఊరుదగ్గఱ పడునప్పటికి సాయంకాల మగుచున్నది.
మ్లాన సూర్యకిరణములు పడి గ్రామవనరేఖ పటమువలె దూర-
మున అతి మనోహరముగ కనబడుచున్నది. చిరపరిచితమగు
వాయువు పొలములపైనుండి వీచుచు వచ్చి మిగుల నాదర-
ముతో నతని ముంగురులను కదల్చుచున్నది. గడ్డము పట్టుకొని
దయతో క్షేమసమాచారము లడుగుచున్నది. హఠాత్తుగ
విశ్వేశ్వరుని కనులు నీళ్లతోనిండి, కన్నీరు బొటబొట కారు-
టకు మొదలుపెట్టినది. పసితనమున తన్ను విడిచి అంతర్ధాన-

మైన తనతల్లి నేఁడు మామిడితోఁటల నీడను నిలిచియుండి విదేశమునుండి యింటికి తిరిగి వచ్చుచున్న కొమారుని సజల నేత్రములతో పలుకరించుచున్నదా యనున ట్లున్నది. విశ్వేశ్వరునకు లోపున పుట్టుచున్న ఆనందోద్రేకము చల్లార్చుకొనుటకై నడుచుచు నడుచుచు నతఁడు దారినడుమ నాగెను; కొంచెమాగి హఠాత్తుగ శిరస్సును భూమికి తగిలించి ప్రణామము చేసెను. పిన్ని ఎడ్లబండిపై కూర్చుండియుండెను. అట్లు కాకున్న బిడ్డని ధోరణి చూచి కనుల నీరు పెట్టుకొని యుండునేమో!

ఇల్లు చేరఁగానే ఆమె సాలలోనికిపోయి ఆవులను దూడలను చూచివచ్చినది. ఇంటి నౌకర్లు, ఘోషును, నిధి తల్లియు ఇల్లువాకిళ్లు తమకు చేతనైనంతవఱకు పరిశుభ్రముగానే ఉంచుచుండిరి. కాని తాళములువేసి మూసియుంచిన గదుల వైఖరి చూచి పిన్ని విదేశప్రయాణమును గుఱించి తనకుఁగలఅభిప్రాయమును వ్యక్తపఱచుచు ఘాటుగా నాలుగుమాటః లనినది. పుణ్యక్షేత్రములనుండి తెచ్చిన ప్రసాదము, వస్త్రములు, పాత్రలు మొదలగునవి ఇరుగు పొరుగులవారికిచ్చుటకై తనలో పుట్టుచుండు ఉత్సాహమును కొంచెము కట్టిపెట్టియుంచి, ఉపవాసముచేయుచుండు కొమారుని కొఱకు వంటచేయ నారంభించెను. విశ్వేశ్వరుఁ డీలోఁగా గ్రామము చుట్టుబెట్టి వచ్చుచుండెను. ఎవరి యింటికైనను వెళ్లి వారిని పలుకరించుట విశ్వేశ్వరునకు స్వభావవిరుద్ధమైనను

అట్టి పనిచేయుటకు కూడ నడుమ నడుమ నేఁ డతనికి బుద్ధి పుట్టుచుండెను.

కాని ఎవ రేమనుకొందురో యను సంకోచమువలన ఆకోరిక నెఱవేర్చుకొనలేక, తన అరఁటితోట చూచివత్తమని అతఁ డచ్చటికిపోయెను. సూర్యుఁ డస్తమించుటచే ఆరఁటితోఁట అంతయు చీకటిగ నుండెను. మిగుల ప్రేమతో నతఁ డా-యరఁటిచెట్ల వైపు పోకమాఱుచూచి ఇంటివైపునకు తిరిగెను, గ్రామమునందు ప్రతిగృహమును, ప్రతివృక్షమును ఎంతో మనోహరముగ నున్నట్లు నేఁడతనికి తోఁచుచున్నది. అతనితో నెట్టి పరిచయమునులేని నాథుమండలుఁడు, పరాణుకలుఁడు, విపినుఁడు దారిలో కనఁబడి విశ్వేశ్వరునకు నమస్కారము చేసి "ఎప్పుడు వచ్చినావు నాయనా?" అని యడుగఁగానే మిగుల ప్రఫుల్లతనొందుచు నతఁడు వారితో మిక్కిలి చనువుగా సంభాషణ చేసెను. ఆ గ్రామమునందు అతిసామాన్యుని సహవాసముకూడ నేఁ డతనికి మిగుల స్పృహణీయముగఁ దోఁచుచుండెను.

దక్షిణమువైపున భట్టాచార్యులుగారి యిల్లు. చీక-టిలో స్తూపాకారము వహించి కానవచ్చినది. అది కాన-రాఁగానే విశ్వేశ్వరుఁ డులికిపడి నిలిచెను. "భట్టాచార్యులు-గారూ" అని ఒకమాఱు పిలువవలెననియతనికి కోరికపుట్టినది. కాని వెనుకటి పెండ్లి ప్రస్తావము హఠాత్తుగ జ్ఞప్తికివచ్చి యతఁడు తనదారిని పోవ నారంభించెను. అక్కడికి నది

యడుగుల దూరములోనే ఉమేశముఖోపాధ్యాయుని యిల్లున్నది. ఇంటి యజమానుఁడరుగుపై కూర్చుండి హుక్కా పీల్చుచుండెను. విశ్వేశ్వరుఁడింటియెదుట నిలుచుట చూచి, "ఎవరది?" అని యడిగెను.

"నేను, విశ్వేశ్వరుఁడను."

"విశ్వేశ్వరుఁడా! రమ్ము నాయనా, రమ్ము. వచ్చికూర్చుండుము. పడమటినుండి యెప్పుడు వచ్చితివి! క్షేమమా?"

ఇద్దఱును మాటలాడుచు చాలసేపు కూర్చుండిరి. సంభాషణ పలువిధములపోయినది. తానువిదేశయాత్రకై బయలు దేఱినప్పటినుండియు గ్రామమున జరిగినదంతయు విశ్వేశ్వరుఁ డెఱుఁగఁ గోరెను అందఱి క్షేమసమాచారము తెలిసికొని యింటికి తిరిగి వచ్చునప్పటికి చాల ప్రొద్దుపోయినది. పిన్ని విశ్వేశ్వరుని కొఱకు కంచములో వడ్డించి పైని మూఁతబోర్లించి ప్రక్కను కూర్చుండి కునుకుచున్నది. విశ్వేశ్వరుఁ డొక్క మాటయైన ననక తిన్నఁగపోయి పీటపై కూర్చుండెను. పిన్ని ఉలికిపడి లేచి, ప్రారంభించినది—"ఆహా, ఎటువంటి అబ్బాయి! అన్నము చల్లారి నీరు కాఱుచున్నది. రెండు రోజులనుండి తిండిలేదు. రెండు మెతుకులు నోటవేసికొని వేళకు పండుకొనవలెననుబుద్ధి అబ్బాయికి ఎన్నఁడును లేదు. ఇంటికి వచ్చిన తరువాతకూడ పిల్లవానిస్వభావము మాఱలేదు. వేకువజామున శుభనక్షత్రమేమో యున్నదఁట. స్నానమునకు ఏటికి పోవలెనని అనుకొంటిని, కాని ఇంత

ఆలస్యమై పోయినది—పరుండుటకు పోవుట యెప్పుడు, లేచుట యెప్పుడు? నీకెన్నఁటికిని—"ఇంతవఱకు వచ్చి పిన్ని అడిగినది—ఇంతటితో ఆగవలసినది కా దామె, కాని కొమారుని ముఖమున దుఃఖచిహ్నములు కనఁబడుటచే తటాలున మాటలధోరణి మార్చి, "ఎక్కడ నుంటివిఇంత సేపును?" అని ఆతురతతో నడిగినది.

"ఉమేశ ముఖోపాధ్యాయునితో మాటలాడుచు వారియింటఁ గూర్చుండి యుంటిని."

"వారందఱును క్షేమమా? పేట వారందఱును కులాసాగా నున్నారా? గ్రామములో నందఱును క్షేమముగా నున్నారు గదా?"

"అందఱిమాట నేనెట్లు చెప్పఁగలను పిన్నీ? కాని మన రామశంకరభట్టాచారి చనిపోయినాఁడు."

బహుదుఃఖము కలిగి ఏమియు ననక అన్నపూర్ణ కొంతసే పూరకుండి, చివరకు మృదుస్వరముతో, "ఆహా పాపము! వదినె—" అన్నది. "ఆహా!" అనుచు దుఃఖింపవలసిన సంగతులు అనేకముగ జ్ఞప్తికి వచ్చుచుండుటవలన ఏమియు ననక చాలసేపు విచారించుచు కూర్చుండి అన్నపూర్ణ చివరకు, "చచ్చినవాఁడే పుణ్యాత్ముఁడు!—సుఖపడ్డాఁడు బ్రాహ్మణుఁడు—మఱియెట్టి విచారమును ఉండదు!" అన్నది. విశ్వేశ్వరుఁ డేమియు ననలేదు.

ఆనాటిరాత్రి అన్నపూర్ణకు బాగుగా నిద్రపట్టలేదు. సమస్తము నోర్చియుండు జాహ్నవియొక్క శాంతిస్వరూపము రాత్రియంతయు నామె కనుల యెదుట నుండెను తెల్లవాఱుజామున లేచి అన్నపూర్ణ స్నానమునకై యేటికి పోయినది. అచ్చట ననేకులు స్నానము చేయుచుండిరి. అందఱును అన్నపూర్ణను చూచి ఆమె నభినందించి కుశలప్రశ్న లడుగుచుండిరి. జాహ్నవి తోడికోడలు కూడ నచ్చటనుండు వారిలో నొకతె — ఆమె అన్నపూర్ణను చూచి కీచుగొంతుతో "మా ఊరు మఱి రారని అనుకొనుచుంటిమే!" అన్నది.

"రామేల వదినా!" అనుచు అన్నపూర్ణ ప్రక్కకు ముఖము త్రిప్పుసరికి అంచులేని తెల్లని మల్లు కట్టుకొనియున్న జాహ్నవికూడ ఆమె కంటఁబడినది. సావిత్రి నీటిలో మునుఁగుచు మఱియొక ప్రక్కనుండెను. సావిత్రి ముఖమామె కంటఁబడఁగానే దగ్గఱకుపోయి వాడియున్న ముఖమును రెండుచేతులతో పట్టుకొని ముద్దాడవలెనని అన్నపూర్ణకు బుద్ధిపుట్టినది. కాని సిగ్గులేక వారినెట్లు పలుకరించఁగలదు? తొందర తొందరగ స్నానము ముగించి యింటికి పోఁబోవుచుండ సావిత్రి ప్రక్కను అంచులులేని తెల్లని బట్టకట్టుకొని నిలిచియున్న బాలికయొకతె ఆమె కంటఁబడినది. ఎవరామె? ఆమె స్వతిరైయై యుండవచ్చునా? అన్నపూర్ణ నోటమాటలేక ఎట్టి చలనమును లేక నిశ్చేష్టురాలై కఱ్ఱబొమ్మవలె నిలఁబడిపోయినది."

# తొమ్మిదవ పరిచ్ఛేదము.

---

విశ్వేశ్వరుఁడు మఱల ఒంటరిగ తన గది చేరి అందుండు-పుస్తకముల రాసుల నడుమ దాఁగియుండవలెనని ప్రయత్నించెను. కాని ఈప్రయత్నమునకును అతని మనస్సున నుండు కోరికకును సంబంధము లేకుండెను. జీవన మనిన నెట్టిదో పశ్చిమము పోయి విశ్వేశ్వరుఁడు పోల్చుకొనెను—ఆరుచి యింటికి వచ్చిన తరువాతఁగూడ నతనిని వదలకున్నది. వరుసలువరుసలుగ పుస్తకములు పేర్చియున్న బీరువాలు బరువులు మోయుచున్న గాడిదలవలె నతని కంటికగపడెను. పూర్వమతని గదిలోనుండు ఉన్నావశక్తి ఎక్కడికో పోయినది. ఫ్యాక్టరీకి పోయి పని స్వయముగా చేయించుచుండవలెనని యతఁడు చేసిన ప్రయత్నము నిష్ఫలమాయెను. తన భూములను తానే చూచుకొనుచు వ్యవసాయము చేయించవలెనని ప్రయత్నించెను గాని దానిపైఁగూడ మనస్సుపోలేదు. ఏది చేయఁబోయినను రెండు రోజులలో చీకాకు పుట్టుచుండును. కనుక నేమియు పనిలేక నదీతీరమునను, మామిడితోఁటలలోను, అరఁటితోఁటలోను, బయలుమీఁదను, పొలము గట్లపైని ఉదాసీనుఁడగు పథికుని వలె నడుచుచుండును.

అప్పుడప్పు డతఁడు పిన్నియొద్దకు వచ్చి కూర్చుండియుండును. అన్నపూర్ణ మతిపోయిన దానివలె పడియుండును.

మునుపటివలె నెల్లప్పుడును వేళకోళము చేయుచు, ఉల్లాస-ముతో మాటలాడుచుండునది కాదు. పిన్ని మనస్సు నేదో బాధించుచున్నదని పోల్చుకొని విశ్వేశ్వరుఁడు మాటాడక సంకోచముతో దగ్గఱ కూర్చుండును. పిన్ని కుమారునితో నొకనాఁ డిట్లనెను.—"నీవేమియు భయపడకుము—నాకిన్నా-ళ్లును నేదో విధముగఁ గడచినది కదా, ఈనాలుగురోజులు-కూడ నట్లే గడచిపోవును. నీయంతట నీకెప్పుడు బుద్ధి పుట్టునో అప్పుడే పెండ్లి చేసికొనుము—ఆవిషయమై నీతో నొక్క-మా-టయైనను నేనిఁక నెన్నఁడు ననను."

విశ్వేశ్వరుఁ డూరక యుండెను. ఎన్నాళ్ళనుండియో పిన్నితో తాను చెప్పవలె ననుకొనుచున్నది చెప్పుటకు మంచి సమయము నేఁడు దొరకినదని విశ్వేశ్వరుఁ డనుకొనెను. పిన్ని తనతో మఱికొంత ప్రసంగించునని తలఁచెను. కాని అట్లు జరుగలేదు—పిన్ని మఱియేమియుననక పూజకొఱకు వత్తులు-చేయుచు నక్కడ కూర్చుండెను.

కనుక విశ్వేశ్వరుఁడే ప్రారంభించవలసివచ్చినది—"పిన్నీ, వారిసమాచారము నీ వేమైన నెఱుఁగుదువా?" అని తుదకు అడిగెను.

పిన్ని వత్తులు చేయుట ఆఁపి విశ్వేశ్వరుని వంక చూచుచు, "ఏసమాచారము?" అని యడిగినది.

"వారిప్పుడే విధముగ కాలక్షేపము చేయుచున్నారో ఆసమాచారము—"

"నాకు మతిపోలేదు—వారితో అంతనీచముగా ప్రవర్తించి, వారు కష్టములలో నుండఁగా చూచి సంతోషించుచు వారియింటికి పోయి మీ రెట్లున్నారని యడిగి రమ్మన్నావా?"

"వారియింటికి పోక పోయినను వా రే యవస్థలో నున్నారో యితరులనోట వినవచ్చునే?"

"ఇన్నాళ్లఁబట్టి వారినిచూచుచున్నను వా రెట్టివారో నీ వెఱుఁగవు కాని నేను బాగుగా నెఱుఁగుదును. చచ్చినను ఇతరులకడకు వచ్చి సహాయము చేయుమని చేయిచాచువారు వారుకారు. ఇతరులకడకువచ్చి తమయవస్థను చెప్పుకొనువారు కారు. హరి యప్పుడప్పుడు ఇంటికి వచ్చుచున్నాఁడని విన్నాను. అతఁడే యింటి సమాచార మిప్పుడు చూచుచున్న ట్లున్నది."

"హరిశంకరుఁడా? వాఁ డథోగతిపాలైనాఁడు. అతఁడును చాంద్ పూర్ జమీందారు 'నరేను'—అనఁగా మన-జమీందారుగారి అల్లుడునుకలిసి మన ఊరినడుమను గుఱ్ఱములను గ్యాలపువదలుచుపోవుచుండఁగా మొన్ననుచూచినాను. హరి వేసికొనిన జమీందారు వేషము అందఱునుచూచినారు—ఛీఛీ, వానికి సిగ్గైననులేదే!" అని మిగులదుఃఖముతో విశ్వేశ్వరుఁ డనెను.

"నాకేమి తెలియును నాయనా! వాని వేషముచూచియే-కాఁబోలు వారికొట్టి లోటును లేదని నలుగురు ననుకొనుచున్నారు."

"నీ వప్పుడప్పుడు వారియింటికి వెళ్లుచుండవచ్చునే పిన్నీ!".

అన్నపూర్ణ కొంచెము యూరకయుండి, ఉద్రేకముతో "నేనట్టిపని చేయలేను నాయనా, సతితల్లికి ముఖమును చూపించుసాహసము నాకులేదు. నీకు చేతనైన యెడల నీవు వారి సమాచారము కనుఁగొనుచుండ వచ్చును," అని యన్నది.

సులభమగు నుపాయమేదియు విశ్వేశ్వరునకు తోఁచలేదు. వారు కష్టములలో నున్నారనుట కెట్టి సందేహమును లేదుకాని వారికేవిధముగ సహాయము చేయవలెనో యతనికి తెలియకున్నది. కాళీపదుఁడు మిక్కిలి చిన్నవాఁడు. వానిమూలమున నేమైన చేయ ప్రయత్నించినయెడల సులభముగ బయలుపడిపోవుటయే కాని లాభముండదు. అనేకవిధముల యోచించి సతీసావిత్రులతో కలిసి యాలోచించి తాను చేయఁగలసాయము వారెట్లైన అంగీకరించునట్లు చేయవలెనని విశ్వేశ్వరుఁడు తుదకు నిశ్చయించుకొనెను.

ఇట్టిది సంకల్పము చేసికొనుట సులభముగాని సఫలము చేసికొనుట విశ్వేశ్వరునకు బహుకష్టమైనపని దీనికి మొదటి ప్రతిబంధకము తనలోనుండు సంకోచము. ఇదికాక సతీసావిత్రుల దర్శనము విశ్వేశ్వరునకు సులభముగా దొరకవలసినది కాదు.

పేదయింటి పిల్లలు వారు, మందభాగ్యులు; విశేషముగ ఇల్లువదలి బయటికి వచ్చుటలేదు. ఏటికి నీరు తెచ్చుటకై వచ్చునప్పుడెప్పుడో ఒకమాఱుసావిత్రి ఎవరికంటనైనను పడవచ్చును గాని,సతి యింటివెనుకనుండు చెఱువునకు స్నానమునకై వచ్చునప్పుడు తప్ప ఇల్లు విడుచునది కాదు. పల్లె యగుటచే మర్యాదస్థుల యింటి పిల్లలకైనను బయటికి వచ్చుట కెట్టి అభ్యంతరమును ఉండఁగూడదు. ఐనను వీరి దురవస్థయే వారి కడ్డువచ్చుచుండెను. సావిత్రి విషయమైకూడ నలుగురును అనుకొన సాగిరి. "ఈ అమ్మాయికూడ పెద్దదై పోవుచున్నది. పదునాలుగేండ్లు కావచ్చుచున్నవి. పాప మెట్లామెకు పెండ్లి యగునో కదా! ఆమెను పెండ్లిచేసికొను వా రెవరున్నారు?" అని సావిత్రి కంటపడఁగానే అనుచుండిరి. కాని దయార్ద్రహృదయు లగువారు "ఈమె యక్కకైనట్టి పెండ్లి యగుటకంటె ఇట్లుండుటయే మేలు—మనస్సున కే బాధయు నుండదు;" అనుచుందురు. సంఘసంరక్షణభారమునువహించి, న్యాయబుద్ధితో ప్రవర్తింపఁగోరువారి ధోరణిమాత్రము వేఱు—వీరు "ఇది యేమమ్మా, ఇది యెక్కడను చూడలేదు! ఇవియన్నియు వ్రాఁతనుబట్టి యుండును కదా అక్కా? నొసటవ్రాసియున్నది అయితీరును. పెండ్లిమానుకొని కూర్చుండినదెట్లు? జాతి యక్కఱలేదా?" అనుచుందురు.

బయటికి వచ్చినంతమాత్రాన ఇట్టిమాటలు ప్రారంభమగుచుండునని యెఱిఁగి సావిత్రి మిక్కిలి జాగ్రత్తగా

నుండును. త్రాఁగుటకు నీరు తెచ్చుకొనక వీలు లేదన్నప్పుడు, భోజనముచేసి మిట్టమధ్యాహ్న మందఱును నిద్రించువేళ-చూచి సావిత్రి రేవునకు పోవుచుండును.

సావిత్రి యిట్లుచేయుచుండుట విశ్వేశ్వరుఁ డొకనాఁడు కనిపెట్టి తనకోరిక సఫలముచేసికొనుటకు వీలగుమార్గ మొకటి చిక్కినదని తలఁచెను. ఇట్టిమార్గము నవలంబించుట ధర్మము-కాదేమో యను సందేహ మతనికి కలుగకపోలేదు. కాని వేఱుమార్గ మేదియు లేకుండెను. ఎన్నఁడును నోరు తెఱువని అద్భుతస్వభావము విశ్వేశ్వరునిది. కొంచెము పెద్దవాఁడై-నప్పటినుండి తమవీథినుండు వారియిండ్లకైనను పోయి యెఱుఁ-గడు. నేఁడు సతియింటికి పోయి జాహ్నవీ దేవియెదుట నెట్లు నిలిచియుండఁ గలఁడు? హఠాత్తుగ నతఁ డిట్లు వచ్చుట చూచి వా రేమి యనుకొనెదరో? ఆయింటికి పోవుటకు ఇతని కింత సఙ్కోచముగనుండుటకు తగినంత కారణము గూడ నున్నది. అతని వలన తమకు గలిగిన యవమాన మింకను వారికి జ్ఞాప-కముండవచ్చును.

నిస్తబ్ధమగు మధ్యాహ్నమున విశ్వేశ్వరుఁ డేటియొడ్డున పచారు చేయుచున్నాఁడు. ఉండి యుండి పరధ్యానముగ నచ్చటనుండు మఱ్ఱిచెట్టు క్రిందను నిలిచి దాని చిన్నయూడ-లను పట్టి లాగుచున్నాఁడు. అప్పుడే ప్రారంభమైన శీతకాలము ప్రకృతియందు కొంచెము కొంచెముగ గగుర్పాటు పుట్టించు

చున్నట్లున్నది. లక్ష్మీదేవియొక్క బంగారు చెంగువలె మార్గశిరమాసమున సస్యక్షేత్రములు బాటగారి కంచె ప్రక్కనుండి కనఁబడుచున్నవి. ఆవరణమధ్యమున తిన్నగ పైకిలేచియున్న కొబ్బరి చెట్టు కాయల బరువుచేత వంగిన ట్లున్నవి. పండ్లయాసచే అఁటితోఁటలో కూడియున్న పక్షిబృందము మహాకోలాహలము చేయుచున్నది. గ్రామములోనికి పోవు త్రోవ వంకతిరుగుచోట దారిపై నొరఁగు వెదురుపొదలుగాలికి పాడుచున్నవి. ఆనందమును పుట్టించుచుండు నాసుందరప్రదేశము చిత్రకారుఁ డెవఁడో కలలోఁగాంచిన చిత్రపటమువలె కనఁబడుచున్నది. ఎటుచూచినను లక్ష్మీదేవి ప్రసాదమే! కాని యెదుట, దూరమున మాత్రము పేదబాలిక యొకతె విశ్వేశ్వరుని దృష్టిపథమునఁ బడెను. ఆమె జుట్టు విరియఁబోసియున్నది. ఆమె కట్టుకొన్నవి ముఱికిబట్టలు. బిందె బరువుగా నుండుటవలన ప్రక్కకు వంగి మెల్లగా నడచుచున్నది. ఆమె కనఁబడగానే విశ్వేశ్వరుఁడు కనులనీరు పెట్టుకొనెను.

ఆబాలిక దగ్గఱ పడినది. కాని విశ్వేశ్వరుఁడు మతిలేనివానివలె నూరక నిలిచి యుండెను, పేరుపెట్టి ఆమెను పిలుచుటకు సాహసింపలేకుండెను. పిలుచుటకు సాహస మట్లుండ ఆబాలిక తనవైపు చూడకుండిన బ్రతుకుదు ననుకొనసాగెను. అట్టియవస్థలో తనకంటఁ బడినయెడల సావిత్రి సిగ్గుపడునేమో యని ఊహించి విశ్వేశ్వరుఁడు తానంత బుద్ధిమాలిన పని

చెయిఁ బూనుకొనినందుకు మిగుల దుఃఖింపసాగెను. కాని సావిత్రికి పాపము, సిగ్గు తప్పినది కాదు. ముఖ మెడమప్రక్కకు త్రిప్పఁగానే విశ్వేశ్వరుఁ డామె కంటఁబడెను. సావిత్రి మిగుల సిగ్గుఁ జెందినది. ఏమిచేయవలెనో తోఁచక సంకోచించుచు నచ్చట కొంచెము నిలిచియుండవలెనని తలఁచినది. కాని సిగ్గునతిక్రమించి తల మఱింత వాల్చుకొని మెల్లఁగా ముందుకు నడువసాగెను

ఇంత మంచి యవకాశము తప్పిపోయినయెడల మఱి యొకటిదొరకక పోవచ్చునని తలఁచి, విశ్వేశ్వరుఁడుతన సంకోచమును త్రొక్కిపెట్టి, చేయఁ గోరుచున్న పనిచేసితీరవలెనని నిశ్చయించుకొని,బహుకష్టముపై కొంచెము ముందుకు వచ్చి, "సావిత్రీ," అని పిలిచెను.

సావిత్రి ఆశ్చర్యపడి నిలిచినది కాని ప్రక్కకు తిరుగలేదు; "సీతో కొంచెము మాటలాడవలసియున్నది. వినిపొమ్ము," అని విశ్వేశ్వరుఁ డనెను.

సావిత్రి అతనివైపు తిరిగి అతని నొకమాఱు చూచి కనులు వాల్చి, "దేని విషయమై? చెప్పుఁడు" అని యన్నది. సంకోచము ద్విగుణమై విశ్వేశ్వరుఁడు తడఁబడుచు నిలిచెను. సావిత్రి కొంచెము తాళి నడువ నారంభించఁగానే మృదుకంఠముతో విశ్వేశ్వరుఁడు, "మీ యన్న, హరి, యింటికి వచ్చుచుండెను కదా?" అని యడిగెను.

"అప్పుడప్పుడు వచ్చుచుండును."

"అతఁ డిప్పుడే మైన చేయుచున్నాఁడా?"

సావిత్రి కుతూహలముతో నతని వంకచూచుచు, "ఏమి చేయుచున్నాఁ డనఁగా ఏమి?"

"పనిపాటేమైన నున్నదా? ఏదైన నుద్యోగము చేయు-చున్నాఁడా?"

"చేయుచుండవలెను."

"నీకు సరిగా తెలియదా?"

"తెలియదు." అని క్రిందికి చూచుచు సావిత్రి అన్నఁ మిగుల బాధఁజెందుచు విశ్వేశ్వరుఁడు, "అతఁడే కదా మీ సంసారమును గడపుచున్నాఁ డిప్పుడు?" అని మఱింత మృదు వైనస్వరముతో నడిగెను.

సావిత్రి యేమియు పలుకకుండుట చూచి ఆమె మన-స్సునకు నొప్పికలిగినదని విశ్వేశ్వరుఁడు పోల్చుకొనెను; సంకో-చమును విడిచి తొందరతొందరగా నిట్లనసాగెను—"నీవేమి-యు ననుకొనకూడదు. ఇరుగుపొరుగువారి సమాచారము, బంధువుల సమాచారము తెలిసికొనఁ గోరుచుందురు గదా ఎవరైన! కనుకనే నేను కూడ మీసమాచారము నడిగితిని. నీకు నొప్పి కలుగవలసినదేమియు నందు లేదు."

"ఔను, ఏమియు లేదు," అని సావిత్రి, మృదుస్వరముతో నన్నది.

"మీా అన్న డబ్బిచ్చుచుండునా? డబ్బులేనిచో సంసారము గడవదని అందఱు నెఱిఁగినసంగతి. కనుకనే నేను నిన్నావిషయమై యడుగుచున్నాను."

"ఆ, ఇచ్చుచుండు నప్పుడప్పుడు."

"అది అన్ని ఖర్చులకును సరిపోవుచున్నదా? ఎట్టి కష్టమును లేక మీాకు జరుగుచున్నదా?"

"జరుగుచున్నది," అన్నది సావిత్రి. ఈ సంభాషణ చేయుచుండుట సావిత్రికి కొంచెము కష్టముగనుండి "ఇఁక నన్ను పోనిండు," అన్నది.

"మఱికొంచె మాఁగుము. నీవు నాతో నిజము చెప్పుచుండుట లేదు. సంకోచించుచున్నావేల సావిత్రీ, నేను నీకు అన్నతో సమానుఁడనే కదా, నాతో చెప్పవేల?"

సావిత్రి ముఖమెత్తి పెద్దపెద్ద కనులు రెండిటితో విశ్వేశ్వరుని ముఖము చూచుచు కొంచెము రోషముతో ప్రత్యుత్తర మిచ్చినది—"మీాయింటి సమాచారము నలుగురితో చెప్పుచు తిరుగుచుందురా మీారు? నన్నేల యడుగుచున్నారు? అటువంటివన్నియు నెవ్వరితో చెప్పకూడనివి యని మీారెఱుఁగుదురు."

విశ్వేశ్వరుఁడు కలవరపడెను. కాని యూరకుండక, "అందఱితో చెప్పకూడదు నిజమే, కాని ఎవరైన నడిగినయెడల చెప్పుట తప్పా?" అని యనెను.

"తప్పేమి, సందేహ మేమి? చెప్పినమాత్రము బాధ మేమి? ఇంక నన్ను పోనిండు."

"నేఁ జెప్పునది వినుము సావిత్రీ—నేను పరుఁడనై నను మిమ్ములను చెల్లెండ్ర వలెనే భావించుచున్నాను. మీకు సిగ్గు తెప్పించుటకుఁ గాని, దుఃఖము తెప్పించుటకుఁ గాని ఈమాటలడుగ లేదు. తమవా రేవిధముగ నాతురతతో నడుగుదురో నేనుకూడ నావిధముగానే అడిగితిని. అందులో దోష మేమైన నున్నదా సావిత్రీ? నేను—నేను పరుఁడనైనప్పటికిని—"

ఇంతవఱకు సావిత్రి కొంచెము చీకాకుపడుచుండెను. ఆమెకు కొంచె మాశ్చర్యముగ నుండెను. కాని విశ్వేశ్వరుఁడు దుఃఖమొందుచుండెనని కనిపెట్టఁగానే ఆమె మనస్సు కరిగినది. విశ్వేశ్వరుని కనులు తడియగుచున్నట్లామెకు తోఁచి సిగ్గుజెంది, దుఃఖించుచు, క్షీణస్వరముతో, "నన్ను క్షమింపుఁడు," అన్నది.

"మేము కష్టములలో నున్నామా యని మీరడిగితిరి. కనుక నిజము చెప్పెదను వినుఁడు—చెప్పవలసినంత కష్టములేవియు మాకు లేదు—రోజులు కూర్చుండియుండవు గదా, ఏదోవిధముగ గడచిపోవుచునే యుండును."

విశ్వేశ్వరుఁడు చిఱునవ్వు నవ్వుచు, "అది నిజమే, రోజులందఱికిని గడచుచునే యుండును. కాని కొందఱికి అతి కష్టముగాను కొందఱికి అతిసుఖముగాను గడచుచుండును

కదా!" అని యనెను. అతని నవ్వున దుఃఖము వ్యక్తమగు-చుండెను.

"నేనును, అక్కయును అనేకవిధములగు పనులు చేయుచుందుము. అమ్మ యిప్పుడు విశేషముగా పనిచేయ-లేదు. దారుఢ్యము తక్కువైనది. అన్నయ్యకూడ నేమైన తెచ్చియిచ్చుచుండును. భరింపలేనంత కష్టముగా లేదు."

పుట్టినప్పటినుండి దుఃఖములో పెరుఁగుచున్న బాలికకు దేనికి దుఃఖమందురో బాగుగా తెలియదని విశ్వేశ్వరుఁడు పోల్చుకొనెను. రెండడుగులు ముందుకువచ్చి అతఁ డిట్లనెను-"మీ అన్న యిచ్చినయెడల మీరు పుచ్చుకొనుచున్నారు. నేను మీ అమ్మకు ప్రణామముచేసి ఏదైన నర్పించినయెడలఁ గాని చెల్లెండ్రని మీకేదైన కానుకగా నిచ్చినయెడలఁగాని వానిని మీ రెట్లు తిరుగఁగొట్టఁ గలరు?"

సావిత్రి మిక్కిలి యాశ్చర్యముఁ జెందుచు, మెల్లగా, "నాకది తెలియదు. అమ్మకు తెలియును. అక్కకు తెలియును." అని యన్నది.

"అట్లైన ప్రణామముచేసి నే నర్పించితి ననిచెప్పి ఈ కాగితము మీతల్లి పాదములకడ నుంచుము సావిత్రీ." అట్లనుచు విశ్వేశ్వరుఁడు సావిత్రికి దగ్గఱగా వచ్చి ఆమె చింకి చీరచెంగున కాగిత మొకటి కట్టసాగెను. "వద్దు వద్దు నాచేత-కాదది. మీరే అమ్మ యొద్దకు వచ్చి చెప్పవలసిన దేదో చెప్ప-

వచ్చెను. నన్ను చిక్కులోఁ బెట్టఁబోకుఁడు" అని సావిత్రి భయపడుచు గద్గదస్వరముతో వేఁడుకొన్నది.

ఇంతలో విశ్వేశ్వరుఁడు తన పని తాను ముగించి, "నీవు దానిని అమ్మ కీయవలెను. ఆమె నన్ను రమ్మనిన యెడల నేను వచ్చి అంతయు నామెకు విన్నవించెదను. నే నిట్లు చెప్పితినని చెప్పుము. ఇఁక నింటికి పొమ్ము సావిత్రీ. అంత పెద్ద-బిందె పట్టుకొని నిలిచియుండుట వలన పాపము, నీకెంతో కష్టముగా నున్నది" అని యనుచు హఠాత్తుగ నదృశ్యు-డాయెను. అచ్చటనుండి విశ్వేశ్వరుఁడు తిన్నగా నింటికి-వచ్చి లోనికి పోయి, "పిన్నీ" అని పిలిచెను.

పిన్ని భోజనము చేసి తీక్ష్ణము లేని శీతకాలపు టెండలో కంబళిపై పరుండి మహాభారతము చదువుచున్నది.

విశ్వేశ్వరుఁడు వచ్చి ఆకంబళి ప్రక్కను పరుండి "ఏమి చదువుచున్నావు పిన్నీ?" అని యడిగెను.

పిన్ని ముద్దుతో వాని వంక చూచుచు "సావిత్రి కథ చదువుచున్నాను. నీవు చదువలేదా మహాభారతము?" అని యడిగినది.

"ఆహా చదివితిని, సందేహమేల? కాని చాల చిన్నప్పుడు చదివితిని. మహాభారతములో నేదియు జ్ఞాపకము లేదు. రామాయణములోనివి పద్యములు మాత్ర మిప్పటికిని జ్ఞప్తిని యున్నవి." ఇట్లనుచు కొన్ని పద్యములు చదివి వినిపించెను.

అదివిని పిన్ని నవ్వుచు, "ఇవి యన్నియు జ్ఞప్తియున్నవి కాని మంచి మంచి వేవియు జ్ఞప్తిలేవా?" అని యడిగినది.

"ఏమి! నేను చదివినవి మంచివి కావా! నేను వల్లించు-చుండునప్పు డివియే అన్నిఁటికంటె మంచి వనిపించుచుండెను. కాని అది యటుండనిమ్ము పిన్నీ, నీవు చదువుచుండు సావిత్ర్యు-పాఖ్యానము మిక్కిలి మనోహరముగా నున్నది పిన్నీ, మఱికొంచెము చదువుము. వినవలెనని యున్నది."

పిల్లవానిలో కొంచెము ప్రఫుల్లత పుట్టుటవలన పిన్నికి ఆనందము కలిగినది. సావిత్రి కథ నామె మొదటినుండి చదువుట మొదలుపెట్టినది. విశ్వేశ్వరుఁడు తదేకధ్యాన-ముగ నది వినుచు కూర్చుండెను. కథ పూర్తికాఁగానే విశ్వేశ్వరుఁడు లేచుచుండుట చూచి పిన్ని, "ఎట్లున్నదిరా నాయనా ?" అని యడిగినది.

"చాల బాగుగనున్నది."

మఱునాఁ డుదయమే పిన్నితో నేదో చెప్పవలెనని విశ్వేశ్వరుఁడు వెళ్లఁగా పిన్నికి పూలిచ్చుటకు వచ్చిన సావిత్రి పజ్జెడుపూలతో నతనికంటఁబడినది. పిన్ని మిగుల ముద్దుతో నామెను పలుకరించినది. తనతో నేదో చెప్పుటకు వచ్చిన-దని విశ్వేశ్వరునకు ఎందుచేతనో గాని తోఁచినది. ఏమి చెప్పుటకు వచ్చియుండునో? ఇంటి కష్టములను గుఱించి చెప్పుటకై అయి యుండును—అది తప్ప మఱియేమి పనియుండఁగలదు? ఆనందము కలిగి, విశ్వేశ్వరుఁడు తన గదిలోనికి పోయి ఆమెరాక కెదురుచూచుచు అక్కడ కూర్చుండెను.

కొంచెము సేపైన తరువాత సావిత్రి నాలుగుపువ్వులు పట్టుకొని అతని గదివైపు వచ్చుచుండుట యతనికి కనఁబడినది. పుష్పము లతని నుల్లాస పఱచునని యెఱిఁగి పిన్ని ప్రతి-దినమును పువ్వులుతెచ్చి అతని గదిలో నుంచుచుండును. నేఁ డాపని సావిత్రిమూలమున నెఱవేర్చుచున్నదని విశ్వేశ్వ-రుఁడు తలఁచెను. పిన్ని ఆపని చేయుమనుట సావిత్రికికూడ మంచిదైనది. ఆ పూలు తీసికొనివచ్చి విశ్వేశ్వరుని గది-ద్వారము దగ్గఱ తడఁబడుచున్నట్లిటునటు కదలుచు సావిత్రి నిలఁబడినది. విశ్వేశ్వరుఁ డది చూచి మిగుల నాదరముతో, "రమ్ము సావిత్రీ," అన్నాఁడు.

సావిత్రి గదిలో ప్రవేశించి నాలుగు పువ్వులు టేబిలు-మీఁదను, నాలుగు పుస్తకములపైని ఉంచుచు, "మీా పిన్ని ఈ పువ్వులు మీాగదిలో నుంచి రమ్మన్నారు," అన్నది.

"అన్నియు నిచ్చటనే యుంచుము సావిత్రీ. పిన్నికి పూలిచ్చుటకు మాత్రమే వచ్చితివా, లేక చెప్పవలసినదికూడ నేమైన నున్నదా సావిత్రీ ?"

తెల్లఁబారియున్న సావిత్రి ముఖము సిగ్గువలన కొంచె మెఱ్ఱనైనది. తల వాల్చుకొని మృదుస్వరముతో నామె, "ఔను ఉన్నది. ఊరక యెట్లు రాఁగలనని తలఁచి నాలుగు-పువ్వులు తీసికొనివచ్చితిని." ఇట్లనుచు పైటచెంగు విప్పి చిన్న కాగిత మొకటి ఆ పువ్వుల ప్రక్క నుంచెను. విశ్వేశ్వరుఁడు "అది యేమి సావిత్రీ?" అని యాశ్చర్యపడుచు నడిగెను.

"ఆనాఁడు ఖర్చుపెట్టిన రూపాయలు. అక్క యీ రూపాయ లవసరములేదన్నది. మాకంటె నిరుపేద లున్నారు-వారి కీయుఁడు. వారెంతో ఆశీర్వదించెదరు. మాకు వీని-యవసరము లేదు."

విశ్వేశ్వరుఁడు నిశ్చేష్టుఁడై నిలిచి కొంతసేపైన తరువాత గొప్ప యపరాధము చేసినవానివలె మెల్లగా, "మీ అమ్మ-గారో? మీ అమ్మగారేమన్నారు ?" అని యడిగెను.

"అమ్మ మనస్సును బాధించునని అక్క అమ్మతో న న్నా మాట చెప్పనీయలేదు."

"బాధ కలుగునా లేదు లేదు. బాధ యేల? నేనే పోయి ఆమెతో చెప్పెదను. ఆమె తప్పక తీసికొనును"

"అట్లు చేయకుఁడు. అక్క చెప్పుదానిలో పొరపా-టుండదు—ఆమె యనున ట్లయితీఱును. అక్క అమ్మకోరిక ననుసరించియే సదా నడుచుకొనుచుండును—అమ్మను గుఱించి ఆమె సరిగా అంతయు నెఱుఁగును. మఱి యేవిధముగనైన చేయ మీరు ప్రయత్నించినచో మీ మనస్సునకు మఱింత కష్టము కలుగవచ్చును. ఈ రూపాయ లుంచుఁడు. నేను మీతో చెప్పియుంటిని—మేమంత చిక్కులలో లేము," అని సావిత్రి వేడుకొనుచు సన్నది.

సావిత్రి మహాభారతమున వర్ణించిన సన్న్యాసినియగు రాజకన్యవంటి గౌరవము కలది. ఆమె వెళ్లిపోఁగానే విశ్వేశ్వ-రుఁడు మతిపోయిన వానివలె అక్కడ సాగిలఁ బడిపోయెను.

## పదియవపరిచ్ఛేదము.

గొప్ప కుటుంబమువారు కాలవశమున దారిద్ర్యావస్థలోనికి వచ్చినయెడల వారికి లేమివలన కలుగు బాధకంటె గౌరవము తగ్గెననుకొనుటవలన కలుగుబాధ యధికము. మంచి యవస్థలో నున్నప్పుడు ఎట్టికష్టమును లేక యితరులు చేయుసహాయము నందుకొనఁగలవాఁడు స్థితి బాగుగ లేనప్పు డెంతో బాధ చెందనిదే అందుకొనలేఁడు. ఎచ్చట బాధ యధికమో అచ్చటికే మనస్సు పోవుచుండును. ఇది తెలిసికొనలేక లోకు లట్టిదానికి అహంకార మనుచుందురు. అట్టి యవస్థలో నుండువాని మనస్సున కోప ముండవచ్చును. కాని ఆ కోపము మనుష్యులపై కాదు. దేవునిపైని.

శీతసాయాహ్నమున తీవ్రతలేని సూర్యకిరణములు దరిద్రుల గృహాంగణమును మెల్లగా ప్రవేశించుచున్నవి. మరమ్మత్తులు లేకవంటయిల్లు వంట కుపయోగము లేనిదై పోయినది. లోనుండు అస్థిపంజరములను వెల్లడిచేయుచున్న ఇటికగోడలు మూర్తిభవించియున్న దారిద్ర్యమే అనున ట్లున్నవి. కాని అంగణము మాత్రము పరిశుభ్రముగా నున్నది. తులసికోటయు దానిచుట్టునుండు స్థలమును అలకఁబడి ముగ్గులతో నిండియున్నవి. చెట్టు మొక్కలు మంచి సంరక్షణము పొందుచున్నవి. దారిద్ర్యరాక్షసిని దాచియుంచుటకు జరుగుచున్న ప్రయత్నము అన్నివైపులను స్పష్ట మగుచున్నది.

కాళీపదుఁడు ఆటకై బయటికి పోయెను. సతి సోడావేసి యుడుకఁబెట్టిన బట్టలనుతికి తాడుపై నారవేయుచున్నది. సావిత్రి ఎండుపిడకలు నాలుగుతెచ్చి విరిచి నిప్పుచేయుచున్నది. అంగణము పొగతో నిండియున్నది. జాహ్నవి చిన్నప్రమిదలో దీపముపెట్టి దానిని తులసికోటయెదుటనుంచి ప్రణామము చేసినది. జాహ్నవి శరీరము మిక్కిలి క్షీణించియున్నది. చింతాజ్వర మామెను రేయింబవళ్లు దగ్ధముచేయుచున్నది. కొమార్తె లది యెఱుఁగికూడ తల్లికి జబ్బుచేసినదని యనుకొనుచుందురు; ఔషధముకొఱకై ప్రయత్నించుచుందురు. తల్లి యేమియుననక కూర్చుండును.

కాళీపదుఁడు పలుగెత్తి లోనికివచ్చి తల్లిపైఁబడి, "అమ్మా, నా పిప్పరమెంటు బిళ్లలేవీ?" అని యడిగెను. తల్లి యప్పుడు తులసికోటకు ప్రణామము చేయుచున్నది— పిల్లవానిని చేతితో ప్రక్కకు త్రోయుచు, "అక్కదగ్గఱకు వెళ్లి యడుగుము," అని యనెను. సావిత్రి వానిని పిలిచి, "అక్క అత్తమ్మతో నీకొఱకు పిప్పరమెంటులు తీసికొనిరమ్మని చెప్పినదిరా తమ్ముఁడూ, అత్త వచ్చువేళైనది," అని యనెను.

అక్క తమ్ముని ఎత్తుకొన్నది. ఎత్తుకొనఁగానే కాళీపదుఁడు "అక్కా, నేఁడు తీసుకరాకపోయిన పకుమందు నిన్ను కొట్టెద నక్కా," అనెను. అక్క తమ్ముని దేహమున నుండుధూళిని తుడుచుచు, "తెచ్చును. సందేహమేల? కానిచో క్కాతోడుగు కొనక తిరుగుచుందువేల నాయనా?" అని తమ్మునితో నన్నది.

“అంత చింకివానిని ఎవరైన తొడుగుకొందురా? అవిచూచి బిపిన్ వేళాకోళము చేయుచుండును. నే నవి మరితొడుగుకొనలేను.” “ఇదిగో, ఇది చూడుము? ఇదిమంచిది! అక్క కుట్టి సరిచేసి యిచ్చినది.”అని యనుచు సావిత్రి తమ్మునిచేతి కొక చొక్కా యిచ్చినది. పిల్లవాఁ డా చొక్కాను ఇటునటు త్రిప్పి పరీక్షచేసి దూరముగ విసరివైచుచు, “ఇదేనా మంచిది అనఁగా? కుట్టుట అనఁగా ఇదేనా? అది నేనెన్నఁడును తొడుగుకొనను,” అని యనెను.

“నాబంగారు తమ్ముఁడవు కావు నాయనా! చూడుమమ్మా కాళ్లెంత చల్లగ ఐపోయినవో—చలివేయుచుండుట లేదా? ఇప్పుడు బిపిన్ వచ్చి వేళాకోళము చేయలేఁడుగదా—ఇంటిలో నున్నప్పుడు ఎవరు చూచెదరు?”

పిల్లవాఁ డీమఱపింపులను లొంగక కాళ్లు చేతులు కొట్టుకొనుచు సావిత్రిని చీకాకుపెట్టుచుండెను. జాహ్నవి దగ్గఱకు వచ్చి కొమారుని సావిత్రియొద్దనుండి తీసికొని, పైటచెంగు వానిపై కప్పి ఇంటిలోనికి పోయినది. సావిత్రి కనులు తుడుచుకొనుచు వేఱేదో పనిచేయుటకై వెళ్లిపోయినది. సతి వ్రేలాడుచుండు బట్టలవెనుక మాటలాడక నిలిచియుండెను.

“శాంత” బాగ్దీలయింటి ఆడుపడుచు. ఫీరికిని ఆమెకును బహుమైత్రి. పీరువడికిన యజ్ఞోపవీతములు, త్రాళ్లు,

వీరు పండించిన కాయలు పండ్లు అమ్మి వానికిమాఱుగా ఇంటి కవసరమగు బియ్యము పప్పు ఉప్పు మొదలగు నవన్నియును ఈమె తెచ్చి యిచ్చుచుండును. భట్టాచార్యుల యింటిదుఃఖము ఈమెకు తనయింటి దుఃఖమే. వారెంత దీనావస్థలో నున్నారో అందఱికిని స్పష్టముకాకుండుటకు కొంతవఱకిదియే కారణము.

తలపై గంపనుంచుకొని శాంత, "అమ్మా, పతీ!" అని పిలుచుచు ఇంటిలో ప్రవేశించినది. శాంత కంఠము వినఁగానే కాళీపదుఁడు, "అత్తా, నాపిప్పరమెంటు లేవి? " అని బయటికి పఱుగెత్తి వచ్చెను.

"ఇదిగో నాయనా, పిప్పిరిబింటలు—లేకున్న బ్రతుకున్నదా? ఇవిగో తీసికొనుము"—ఇట్లనుచు శాంత కాగితము పొట్లమొకటి పిల్లవానిచేతిలో పెట్టినది. పిల్లవాఁడు మహానందముతో, "అమ్మా ఇదిగో చూడు, చూడు," అనుచు లోపలికి పఱుగెత్తెను.

సతి దగ్గఱకు వచ్చి నిలిచెను. శాంత గంప నేలనుంచి "చలికి కాళ్లు చేతులు తిమ్మిరు లెక్కినవి—అన్నట్లు, నిప్పుచేసితివే తల్లీ?"

"లేదు."

"అట్లైన దీపము తీసికొనిరమ్మమ్మా. సావీ? ఎక్కడవే అమ్మా? దీపము తెమ్ము."

సావిత్రి మెల్లగ వచ్చి, "చమురు తెచ్చితివా అత్తా? చమురు మొదట నిమ్ము. ప్రమిద వెలిఁగించి తీసికొని వచ్చెదను."

"నాదశకూడ ఆలాగుననే ఉన్నదమ్మా. నడువలేను— రాత్రి యైపోయినది. సంత దగ్గఱ కాదు కదా! ఇదిగో చూడుమమ్మా! నీవి పసికన్నులు, సంధ్యవేళే కాని నాకంతయు చీఁకటిగానే ఉన్నది. ఇదిగో అమ్మా, ఈనూనె అందుకొనుము. ఇది నాలుగు కానులు—అది చూచితివా? ఈ దేశములో మఱి ఉండలేము తల్లీ! బియ్య మెంత ప్రియమో నూనె- కూడ అంత ప్రియము. అన్ని పాడు నోళ్ల వెంటను ఒకటే మాటకదా!"

"పళ్లెమున కెంత ఇచ్చిరత్తా?" అని సతి సౌమ్యదిగా నడిగినది.

జవాబు చెప్పఁబోయి శాంత కంట నీళ్లు పెట్టు- కొన్నది. "ఆమాట మఱి యడుగకు మమ్మా, అడుగకుము. అంతపెద్ద పళ్లెము రూపాయకైనను అక్కఱలేదఁట. కొన్న- ప్పుడు మూఁడు రూపాయలు పుచ్చుకొన్నారు—దొంగలమ్మా, పచ్చి దొంగలు! బందిపోటులు!" "పళ్లెము పాతది కదత్తా!" అనుచు, సతి ఆమెనోదార్చి "అట్టైన ఎంత యిచ్చినారత్తా చివరకు?" అని యడిగినది.

"రూపాయకు తగ్గనీయలేదమ్మా. అర్ధరూపాయ పిల్ల- వాని కోసము తెచ్చిన ఈబట్టకైనది. అర్ధరూపాయకు పప్పు

బియ్యము, ఉప్పు తెచ్చినాను—చూడుమమ్మా, లెక్క సరిగా-
ఉన్నదో లేదో, నారకొని తెచ్చుటకు డబ్బుచాలినది కాదమ్మా.
క్రిందటిమాటు త్రాళ్లమ్మగారిదొరకిన ఎనిమిదణాలకు బియ్యము-
మాత్రమే తెచ్చియుంటిని. ఈమారైనను నారతెచ్చుట
కాలేదు. నారకొని, దూదికొని ఏమి లాభమమ్మా—ఇంటిలో-
నుండు పాత్రసామానంతయు ఇల్లే పోవుచున్నది!"

"ఇంక పాత్రసామాను మాత్రమేదీ? ఈనాలుగును లేని-
యెడల వంటజరుగు టెట్లు? ఏమి కానున్నదో కదా!"

సావిత్రి శాంత తెచ్చిన వస్తువులను తీసి లోపుననుంచి,
ఇంటిలోనుండి పండిన యరటిపండ్లు రెండుతెచ్చి శాంత-
కిచ్చుచు, "చెట్టున పండిన పండ్లత్తా," అని యనెను.

శాంత పుచ్చుకొనక, "ఉండనిమ్ము ఉండనిమ్మమ్మా,
అక్కకిమ్ము, అమ్మకిమ్ము దొడ్డమ్మకిమ్ము. బ్రాహ్మణులయింట వితం.
తువుల కేవియు నుండవు—ఇవియే కదా వారికాధారము,"
అని యన్నది.

"లేదత్తా నీవవి తీసికొనుము. ఇంకను ఇంటిలో
నున్నవి," అనుచు సతికూడ శాంతను బలవంత పెట్టెను.
శాంత ఆరెండు అరటిపండ్లను పుచ్చుకొని పిడకతో
కొంచెము నిప్పును తీసికొని యింటికి పోయినది.

కాళీపదుఁడు దయమే లేచి తోడిబాలుని యింటికి
పోయెను. ఆబాలుని యింట పులగము చూచి ఇంటికి
రాఁగానే తనకుకూడ పులగము కావలెనని గొప్ప గందర

గోలము మొదలుపెట్టెను. సావిత్రి తల్లియొద్దకు వచ్చి సంకోచముతో, "ఇంట పప్పులేదమ్మా," అన్నది.

సతి, "నీవూరకుండుము," అనుచు చెల్లెలిపై కోపపడి "నీకు ఫులగము వండిపెట్టెద నుండుమమ్మా కాళీ," అనుచు తమ్ముని నోదార్చినది.

భోజనమునకు కూర్చుండి పసుపురంగుగల అన్నమును చూచి పిల్లవాడు మొదట భ్రమపడెను. కాని చివరకు మోసమును గ్రహించి ఏడ్చి, గోలచేయుచు అన్నము నలుదిక్కుల విసరివైచెను. సతి మాటాడక ఒకమూలకు పోయి నిలిచెను. జాహ్నవి, గోడవైపు ముఖముత్రిప్పి భర్త పండుకొనుచుండు స్థలమున ముఖముపై చేయివేసికొని పరుండెను. సావిత్రి మాత్ర మా యల్లరిపిల్లవాని శాంతిపఱచుట కనేకవిధముల ప్రయత్నించినది. కాని ప్రయత్నము లన్నియు నిష్ఫల మాయెను.

పిల్లవాఁ డేడ్చియేడ్చి; చిట్టచివరకు అలసి పరుండఁబడిపోయెను. తెలివివచ్చినయెడల మఱల ఏడ్పారంభమగు నేమో యని భయపడి ఎవ్వరును వాని నాయరుగుపైనుండి లేవఁదీయ లేదు.

చాలసేపైనతరువాత సతి స్నానమునకు పోయి స్నానముచేసి వచ్చుచున్నది. సావిత్రి అంగణమున ఈమూలను ఆమూలను వెదకి ఆకు అలమును తెచ్చి కూర కేర్పాటు చేయుచున్నది. పెత్తల్లి హరినామస్మరణము పూర్తి-

చేసి ఆవులసాలకు పోయి ఆవులను పాలుపిదికి పాలను తెచ్చుచున్నది.

"సావీ,కుండలో బెల్లమేమైన నున్నదేమో చూడుము, పాలలో నాలుగు మెతుకులువేసి బెల్లముకలిపి పరమాన్నము-వలె చేసి ఉంచెదము. తమ్ముఁడేడ్చి యేడ్చి తిండి తినకయే పండుకొన్నాఁడు—పరమాన్నము చూచి సంతోషముతో కొంచెము తినునేమో," అని సావిత్రి కనఁబడగానే సతి యన్నది.

ఆమాటలు పెత్తల్లి చెవిని పడ్డది. "ప్రతి విషయ-ములో మీకు నబాబ్ గిరియే! నిరుపేదల కింత నబాబ్ గిరి-యేల? తినిన తిననిమ్ము. లేనిచో అట్లుండ నిమ్ము. కడుపు మాడినయెడల తానే కోరి తినును—అనవసరముగా బెల్లము పాడుచేయ నక్కఱ లేదు," అనుచు పెద్ద పెద్ద కేకలు వేసినది పెత్తల్లి.

పెత్తల్లితిట్ల కలవాటు పడియుండుటచే వారికామాటల-వలన నెట్టి యాందోళనమును కలుగలేదు. సావిత్రి కుండ చూచి, "బెల్లము లేదక్కా," అన్నది.

"ఎట్లుండఁ గలదు ? ఈయింట ఎట్టి సిరియైన నేల యుండును?" అని పెత్తల్లి యన్నది.

అసలే భరింపరాని కష్టములు, వానిపైని అనవసరముగ మాటలవలన కలుగు బాధ మణికాంచన సంయోగము వంటి దాయింటి యవస్థ. సతి వంట ముగించి అమ్మను భోజన-

మునకై పిలుచుటకు వచ్చుట పెత్తల్లి చూచి గొణుగుచు, తిట్టుచు కొంచెము బెల్లము సతి కిచ్చుచు ఇట్లన్నది—"ఇదిగో ఇది పుచ్చుకొనుము. లేనియెడల పిల్లవాఁడు బొత్తిగా తిన-లేఁడు. 'ఆహా! ఎటువంటి యిల్లు కదా! లేకున్నను లేదనుటకు వీలులేదు. ఆనాఁడు నీళ్లు త్రాగి బెల్లము ముక్క నూటిలో నుంచివేసితిని—ఏమి తినవలెనన్నను వీలులేదు గదా ఈ పాడుయింట!"

సతి తల్లియొద్దకు వెళ్లి, "అమ్మా, లెమ్ము; భోజనమునకు రమ్ము," అనుచు తల్లిని లేపినది. "నాకు నేఁడు జ్వరము వచ్చిన ట్లున్నదమ్మా, నీవు భోజనముచేయుము. దొడ్డమ్మను భోజనము చేయుమనుము. నేను నేఁ డన్నము తినలేనమ్మా," అని తల్లి మెల్లగ నన్నది.

"నీ కీవిధముగ జ్వరము ప్రతిదినమును వచ్చుచుండు నమ్మా. తిండిలేక ఎన్నాళ్లు బ్రతికియుండఁ గలవు? సహించి నంత తినవచ్చును లెమ్ము."

"లే దమ్మా, నేను తినలేను," అన్నది తల్లి.

"ఇటుపైని మన నొసట ఉపవాస ముండనే ఉన్నది. ఇప్పటినుండి యేల మాడుచుండవలెను," అని రుద్ధకంఠముతో సతి యనెను.

జాహ్నవి లేచి వచ్చి భోజనమునకు కూర్చుండినది. కనులు విప్పి చూడకున్నను జాహ్నవి యెఱుఁగని విషయ

మేదియు నుండునది కాదు. ఈ రీతిగనైన నిఁక ననేక-దినములు గడవవని ఆమెకు బోధపడినది. ఈభయంకరమగు చింతాజ్వరము వలననే ఆమెకు ప్రతిదినమును నిజముగా జ్వరము వచ్చుచున్నది.

ఇంట నేరవంత తినుబడి సామానుండెనో అవి రెండు రోజులలో అయిపోయినది. తినవలసినవా రింట నలుగురు; కాని ఆర్జించువాఁ డొక్కఁడైనను లేఁడు. కాళిపదుఁడుదయమే లేచి, "అమ్మా, ఆఁకలిగా నున్నది, తినుటకేమైన-నిమ్ము," అని యనెను.

"అమ్మా," అని యనుచున్నను కాళీపదుఁ డక్కదగ్గ-ఱకు పోయి నిలిచెను. సతికి లేచుటకు కాళ్లు రాలేదు; ఏమియు జవాబీయక అచ్చటనే కూర్చుండెను.

"అక్కా, లెమ్ము! వంటచేయవా?" అని అడుగు-చున్నను అక్క లేవకుండుట చూచి పిల్లవాఁడు ఫిర్యాదు-చేయుటకు అమ్మ యొద్దకు వెళ్లెను. సతి యప్పుడు "చూడు-మమ్మా చెల్లీ, బుట్టలో కొంచెమైనను ప్రత్తియున్నదేమో," అని సావిత్రితో మెల్లగా నన్నది.

"లేదక్కా."

"అట్లైన, నేఁడుపవాసమేనా సావీ? తమ్ముఁడేమి తినును నేఁడు? నేఁడు సంతరోజుకాదే! సంతరోజైనయెడల చెంబును అత్తచేతికిచ్చి సంతకు పంపియుందును. ఏమి చేయుదము సావీ?"

"ఈవిధముగ మఱియెన్నాళ్లు గడపఁగల మక్కా? దీని-కంటె విశుదాదా—" చెల్లిమాట పూర్తికాకమునుపే తటాలున లేచి సతి "ఛీ ఛీ! అంతకంటె కడుపుమాడి చచ్చుట మేలు," అని చెల్లి చీవాట్లుపెట్టుచు అతి తీవ్రముగ నన్నది.

సావిత్రి తలవాల్చుకొని కొంతసే పూరకయుండి, "తిండిలేక నేను చావవచ్చును; నీవు చావవచ్చును. కాని అమ్మమాట యేమి? తమ్మునిమాట యేమి? బిచ్చమెత్తి నైనను దారిద్ర్యఱిని కాపాడవద్దా అక్కా?" అని మెల్లగా తుదకనెను.

"బిచ్చమా? ఆహా బిచ్చమెత్తవచ్చును. కాని మఱి రెండురోజులు తాళుము, నిలువ నీడలేక చెట్టు క్రింద నేనాఁ-డుండవలసి వచ్చునో ఆనాఁడే సలుగుఱికడ కొంగుచాచ వచ్చును. ఆచెంబు తెచ్చియిమ్ము చెల్లీ, నే నొకమాఱు అత్త-దగ్గఱకు పోయివచ్చెదను."

అట్టి సమయమున సావిత్రి హఠాత్తుగ, "అన్నయ్య అక్కా; అన్నయ్యా!" అని కేకలు వేసినది.

చక్కఁగా తల దువ్వుకొని, ముస్తాబయి, చేతికఱ్ఱ ఆడించుకొనుచు, హరిశంకరుఁ డంగణములోనికి వచ్చి నిలిచియుండి, "ఏమి చేయుచున్నారే?" అని యనెను.

సావిత్రి, "అన్నయ్యా" అనుచు నేడ్వసాగినది. సతి కఱ్ఱకట్టి నేల కూర్చుండఁబడిపోయినది.

"ఏమి జరిగినది? ఏడ్చుచున్నావేల? అమ్మ క్షేమముగా ఉన్నదా?"

"అమ్మ విషయమై నీవొక్కమారైనను తలఁచుచుంటివా అన్నయ్యా? నీతమ్మునికి నేఁడు తిండిలేదు. అమ్మ ఎన్నాళ్లిట్లు దుఃఖించుచు బ్రతికి యుండఁగలదు? మాయవస్థను గుఱించి నీవొక్కమారైనను ఆలోచించవా?" అని సావిత్రి అశ్రురుద్ధకంఠముతో నడిగెను.

"నేనేమి చేయఁగలను? డబ్బు ఖర్చుచేసి నాన్న నాకు చదువు చెప్పించినాఁడా, మీయందఱిని నేను పోషించుటకు? కేవలము స్వప్రయత్నమువలన నేను నాపొట్ట పోషించుకొనఁగలుగుచున్నాను, అట్లుకాకున్న నేనుకూడ మీయవస్థలో నుండవలసినదే. ఇదిగో పదిరూపాయలనోటు నాయొద్ద నున్నది—ఇది పుచ్చుకొనుము. ఉంచుకొని లేదనవలసిన అన్నను కాను నేను."

సావిత్రి రూపాయలు పుచ్చుకొని, "నన్ను క్షమింపుమన్నయ్యా, నాబుద్ధి మంచిదికాదు, చాలచెడ్డదాననై పోయినాను," అని మెల్లగ ననుచు నేడ్వ మొదలుపెట్టినది.

"ఏడకు సావీ, వద్దు వద్దు, ఏడకు. నేనిఁక పోయెదను, వీలైన పైమాసములో నొకమాఱు వచ్చెదను. ఈయింట నెట్లుండఁగలను చెప్పుము," అని అన్నయనెను.

"అమ్మ నొకమాఱు చూచిపొమ్ము అన్నయ్యా."

"చూచి, యేమి ప్రయోజనము ? వచ్చి వెళ్లితినని చెప్పుము,"

హారి వెళ్లిపోయెను. "లెమ్మకా, * శాంత త్తగారిను పిలుచుకొనివచ్చి బజారుచేసికొని రమ్మని చెప్పుము," అని సావిత్రి సతితో నన్నది.

"ఇదిగో లేచుచున్నాను. చూచితివా సావీ, తమవారికంటె పైవారు మేలు, కాని పైవారనఁగానే సిగ్గు, తమవారిదగ్గఱ నెట్టి సిగ్గును లేదు."

కొన్నాళ్లవఱకు నిప్పుడు సతి నిశ్చింతగా నుండవచ్చును. కష్టములకు లక్ష్యపెట్టునది కాదు సతి. ప్రాణాంతక మగు కష్టములే సతికి కష్టములని తోఁచును. అన్నము, కూర, విరామములేని పరిశ్రమ—ఇవి యన్నియు నామె కంటికి ఒక్కజాతి వస్తువులే—వీనిలో నేదియైన సతి సులభముగా భరింపఁగలదు.

వారీమాఱు నార, దూది మొదలగునవి అధికముగ కొని, లేనిచో నెంతమాత్రము గడవ దనఁదగిన అత్యావశ్యకమగు భోజనసామగ్రి మాత్రము తీసికొనివచ్చిరి. కాలీపదుని చొక్కా మాత్రము మఱువలేదు—వానికొఱకొక చిన్న చొక్కా తెప్పించిరి. ఆ మఱునాఁటి యుదయము శాంత వచ్చి సతితో నిట్లనెను—"ప్రొద్దున లేచి కూర లమ్ముటకు జమీందారుగారి యింటికి వెళ్లితిని. వారియమ్మాయి కమల, అత్తవారి యింటినుండి వచ్చినది. నిన్నొకమాఱు

* 'శాంత' అత్త

తెప్పక రమ్మన్నది, రానియెడల మిగుల చింతించెదనని చెప్పివది.”

అట్లైన, కమల యిప్పటికిని సతిని మఱువలేదు. కాంతమాటలు విని సతి కొంచెము నవ్వినది—అది దుఃఖమువలన కలిగిననవ్వో, సుఖమువలన కలిగిననవ్వో చెప్పుట కష్టము. మధ్యాహ్నము వెళ్లినయెడల చాలసేపు కూర్చుండ వలసివచ్చును, సతి చేయవలసిన పనికికూడ భంగము కలుగును. కనుక నామె తల్లితో “అమ్మా నే నిప్పుడే కమల నొకమాఱు చూచి వచ్చెద” నని యనెను.

“వెళ్లు” మన్నది తల్లి.

సతిని చూడఁగానే పూర్వమువలె కమల యామెను కౌఁగిలించుకొని మిక్కిలి యానందముతో, “సతీ, నన్ను మఱువలేదు కదా? అప్పుడప్పుడు నేను జ్ఞప్తికి వచ్చుచుందునా?” అని యడిగెను.

సతి కమలను చూచి ఉలికిపడినది. ఈమె కమలయేనా? అంగములు సుఖసౌభాగ్యములతో నిండి రెండు సంవత్సరములకు పూర్వము పూర్ణశోభను పొందియున్న కమల కిట్టి శుష్కశరీరము, ఇట్టి మ్లానవదనము ఎట్లు వచ్చినవి? ఈమె ఆకమల కానట్లున్నదే! “ఇట్లైతి వేమి కమలా, నీ కేమి జబ్బు చేసినదా?” అని సతి యడిగినది.

“జబ్బా?” అనుచు కమల నవ్వినది; “నామాట అటుండ నిమ్ము. నీదశ యిట్లుండ నామాట అనుచున్నా వేమి

సతీ? నీ పెండ్లియైనను చూడకుండ, నిన్నీ దశలో చూచు-చున్నాను.”

“‘దశ’ యనునంత యేమున్నది? నాయవస్థలో నే నెప్పుడును ఎట్లుంటినో ఇప్పుడుకూడ నట్లే యున్నాను.”

“ఔను నీవన్నది అబద్ధము కాదు. పెండ్లినాడు తప్ప మఱియొక్క మాటైనను అతనిని నీవు చూడలేదని విన్నాను. ఐనను ఎంత దుఃఖకరమగు సంగతి!”

కమల మాటల కడ్డువచ్చి సతి, “నా మాట యటుండ-నిమ్ము. నీ కేమైనది చెప్పుము కమలా? మునుపటి నీనవ్వు-ముఖ మెక్కడికి పోయినది, కమలా?” అని యడిగినది.

“నీవు నామాటయే యెత్తుచున్నావు. నేను నీ ముఖము చూచుచున్నాను. సతీ, నీవు మునుపటివలెనే ఉన్నావు, నిజమే, కాని నీ వేషము చూచి నాకు కనులు మూసికొనవలెనని బుద్ధి పుట్టుచున్నది. ఏమిపాపము చేసితిమే చెల్లీ, మన కిట్టిదశ పట్టుటకు?”

కమల సతిభుజములపై రెండుచేతులను వేసి ఆమెను కౌఁగిలించుకొని ఆమెగుండెపై తనముఖము నుంచెను. సతి కదలక మెదలక రాతి విగ్రహమువలె కూర్చుండెను. కొంత సేపటికి మనస్సు స్థిమితముపడఁగా కమల మఱల ముఖమెత్తినది. సతి యప్పుడు, “పుష్య మాసమున నిన్నెట్లు రానిచ్చిరి కమలా?” అని కమల నడిగినది.

"వచ్చి రెండు సంవత్సరము లైనవి, ప్రాణము కొట్టుకొనుచుండెను. కనుక నొకమాఱు చూచి పోదమని వచ్చినాను. అవికాక, వచ్చిననేమి, పోయిననేమి—నన్ను వద్దను వా రెవరును లేరు."

"ఏమీ ? నీ భర్త ?"

కమల మఱల నవ్వినది. ఆనవ్వు చూచి సతి మనస్సు కరిగిపోయినది.

కమల నవ్వుచు, "భర్తయా?" అన్నది. "నే నతనికి ఎవతెను గనుక నన్ను వద్దనుటకు ? నేనెవతెను గనుక నాకొఱకు వెదుకుచుండుటకు ? స్త్రీ పూలహారముతో సమానమే చెల్లీ—ఒక్కనాడే మనము పొందు ఆదరణ, మఱునాడు మంటిలోపడి దొర్లవలసిన దే మనపని." సతి ముఖము క్రిందికి దించి కూర్చుండెను. కమల మాటలాడసాగెను—"నీవు దేనిరుచియు నెఱుఁగవే—ఒక విధముగ అది సుఖమే. నా యవస్థ మిగుల దుఃఖకరమైనది సతీ. నీదశయు నాదశయు చూచుటవలన నాకు బోధపడినదేమన స్త్రీజన్మ మెత్తుట దుఃఖమనుభవించుటకే యని. సుఖమనువస్తువు స్త్రీలకొఱకు పుట్టినది కాదు. స్త్రీలు దానికొఱకు కాశించుట కూడదని నాకోరిక."

ఒకనాఁ డెప్పుడో సతి బయటి ద్వారముదగ్గఱ నిలఁబడి ఏదో పనికై కాళీపదుని పిలుచుచుండెను. ఆ సమయమున జమీందారుగారి అబ్బాయి నరేన్‌భాదురీ గుఱ్ఱమెక్కి ఆ దారిని పోవుచుండెను. అది చూచి సతి ప్రక్కకు జరిగి-

పోయినది. కాని అతనికంట నొక పాడుచూపుండెను——ఆచూపు సతికి మిగుల నసహ్యామును కలిగించినది——ఆమాట సతికి నేఁడు జ్ఞప్తికి వచ్చి ఈజన్మమున కమలకు మఱి సుఖము లేదని తెలిసికొనినది. మఱి కొంతసే పిద్దఱును కలిసి మాటలాడిన పిదప, "ఇఁక నన్నీ మాటికి పోనిమ్మక్కా," అని సతి యన్నది.

"మఱి కొంచెము కూర్చుండవే చెల్లీ, ఎన్నఁడు మఱల మనము కలసికొనెదమో, లేక అసలు కలసికొనెదమో లేదో మనకే తెలియదు."

సతి దేహమున గగుర్పాటు పుట్టినది; "ఏమి యక్కా, అంత అశుభము సూచించుచు మాటలాడుచున్నావేమి; నీ విచ్చటికి వచ్చినంత మాత్రమున మనము కలసికొనవచ్చును కదా?" అని సతి యన్నది.

కమల నవ్వుచు నిట్లన్నది——"నాకు చావు వచ్చునని నేననలేదు చెల్లీ, అంత యదృష్టవంతురాలను కాను నేను. కాని యింటికి వచ్చి చూచుసరికి మీ నాన్న లేఁడు. నీవు విధవవు——ఈమాటలు వచ్చునప్పటికి ఇంకేమి జరిగియుండునో కదా?" ఆమాటలు విని, కమల యనినదానిలో, నెట్టి నిజము లేనట్లు నటించి సతి నిర్లక్ష్యముగ నవ్వినట్లు నవ్వినది.

మఱికొన్ని నిమిషములు కూర్చుండి సతి సెలవుతీసికొన్నది. కమలనుగుఱించి యాలోచించుచు మిగుల భారా

క్రాంతమగు మనస్సుతో సతి యింటికి వచ్చుచుండెను. ఎడమ-వైపున భక్తివారికంచె, దక్షిణమున వెదురుపొదలు—వీని నీడలోనుండి వచ్చుచున్నసతికి తీవ్రమగు శీతవాయువు తగులుచుండెను. క్రిందికి చూచుచు పరధ్యానముగ సతి నడుచుచున్నది. హఠాత్తుగ దారినడుమ నెవరో ఉలికిపడి నిలిచి ఆశ్చర్యపడుచు, "ఎవరిది, సతియా?" అని యనెను.

సతి. ముఖమెత్తి చూచినది, ఎదుట విశ్వేశ్వరుడు నిలిచియుండెను.

సతి తడబడుచు ముసుగు మఱికొంచెము క్రిందికి లాగుకొని ప్రక్కకు తప్పుకొనినది—తాను ప్రక్కకు తప్పుకొనినయెడల విశ్వేశ్వరుడు తనదారిని పోవునని అనుకొనెను, కాని యతడు సతికి దారిచేసి తా నక్కడనే నిలిచియుండి, కొంచెము తడబడుచు గొంతు సవరించుకొని, "సతీ నేను నీకు వరుసకు సోదరుడను, నీతో నిట్లు నిలిచి మాటలాడుట కూడనిపనియా?" అని యడిగెను.

సతి ప్రత్యుత్తర మీయలేదు. చీకాకు, బిడియము, భీతి మొదలగువానితో నామెమనస్సు ఆందోళిత మగు-చుండెను. "చెల్లెలితో మాటలాడిన తప్పేమి?" అని విశ్వేశ్వ-రుడు మరల నడిగెను.

సతి సాహసముచేసి, "ఏమి చెప్పెదరో చెప్పుడు త్వరగా," అని వడిగా నన్నది.

"మీ అమ్మకు ప్రణామముచేసి నే నర్పించినదానిని వీవేల తిరుగఁగొట్టితివి సతీ?" అని విశ్వేశ్వరుఁడు దీనముగ నడిగెను.

"అవసరములేక పంపివేసితిని."

"అవసరము లేక పోవచ్చును—అనురాగపూర్వకముగ నైననుగాని భక్తిపూర్వకముగ నైననుగాని ఎవరైన నిచ్చిన దానిని అనవసరమని మఱల వారికి పంపివేయవచ్చునా సతీ?"

సతి వెనుకకు తిరిగి కొంచెము సేపు నిలిచి తీవ్రకంఠముతో ఉత్తర మిచ్చినది—"పుచ్చుకొనుట కర్హులగువారు పుచ్చుకొనవచ్చును, వారి కెట్టి లేమియు నుండదు గనుక నట్టివారికి మీరు ప్రణామ మర్పింపరని కూడ నాయూహ. మేము నిరుపేదలమని తెలిసికొని మీ రావిధముగ మాకు సహాయముచేయఁ బూనుకొంటిరి. మేము పేదవారము నిజమే, కాని మాకసాధ్యము కానంతసేపు స్వప్రయత్నముపై నాధారపడక బిచ్చమేల యెత్తుకొనవలెనో మీరే. యోచించి చూడుఁడు."

విశ్వేశ్వరుఁ డేమియు ననక చాలసే పక్కడనే నిలిచియుండెను. సతి ముందుకు నడచుచుండుట చూచి రుద్ధకంఠముతో ప్రారంభించెను—"నన్ను క్షమింపుము సతీ, మీకు నేను బిచ్చ మీయఁగోరలేదు. నామాట నమ్ముము; నేను—నేను అనురాగముకొలది మీకు—"

విశ్వేశ్వరుని మాట పూర్తి చేయనీయక సతి ఇట్లనసాగెను—"మీరు కూడ, నన్ను క్షమింపవలెను. మీవంటి దయార్ద్రహృదయునితో కూడ నేనంత కఠినముగ మాటలాడితిని. కాని యోచించినయెడల మీకే బోధపడును—మీ కర్తవ్యము మీరాచరించితిరి, నాకర్తవ్యము నే నాచరించితిని. భగవంతునికృపవలన ఇప్పటికిని మాకు రోజులొకవిధముగ గడచుచున్నవి, అట్లుకూడ సాధ్యము కాదన్ననాఁడు. కేవలము మీకడనే కాక అందఱికడను కూడ చేయి చాచవలసి వచ్చును."

"నన్ను క్షమింపుము సతీ, మీరు నా చెల్లెండ్రే యనుకొనుచు నట్టిది చేసితిని."

"నే నది యెఱుఁగక పోలేదు."

నాలు గడుగులు ముందుకు పోయి సతి మఱల వెనుకకు తిరిగి బిగ్గఱగా మాటాడ సాగినది—"అప్పుడప్పుడు మీరు మాయవస్థను గుఱించి యాలోచించు చుందురేమో. కాని మీరు మనస్సును కలఁతఁజెందనీయకుఁడు. మొన్నను మా అన్నయ్య యింటికి వచ్చి యుండెను—అతఁ డిప్పుడేదో పనిలో నున్నాఁడని తలఁచెదను. అన్నయ్య బుద్ధిమంతుఁ డగుచో మాకెట్టి కష్టమును కలుగదు— అతఁడు బుద్ధిమంతుఁడు కావలెనని దీవింపుఁడు."

"మనఃపూర్తిగ దీవించుచున్నాను సతీ. అతఁడు బుద్ధిమంతుఁ డగుఁగాక, మీకష్టము లన్నియు నివారణ పొందును

గాక. అట్టైన మీ అన్నబుద్ధి ఇప్పుడు కొంచెము స్థిరపడిన దన్నమాట. వినుటకు మిగుల సంతోషముగ నున్నది. సతీ, ఎట్టికపటమును లేక చెప్పుచున్నాను—నీ ధోరణివలన నాకు కొంచెము దుఃఖము కలిగినది కాని అది మఱి నన్ను బాధింపదు. నీవు కూడ నేమియు మనస్సున నుంచుకొనకూడదు."

"లేదు, ఉంచుకొనను."



## పదునొకండవ పరిచ్ఛేదము.

జాహ్నవి మాఘమాస మంతయు నేదో విధముగ ఇటు-నటు మసలుచు గడపఁగలిగినది గాని ఫాల్గుణమాస ప్రారంభ-మున నే మంచము పట్టవలసివచ్చినది. చలికి లక్ష్యముచేయక జబ్బుశరీరముతో శీతకాలమంతయు తిరిగి చివరకు మఱిసాధ్య-ముకాక మంచ మెక్కవలసి వచ్చినది. తల్లి నిర్జీవముగ నట్లు పడియుండుటవలన సతికి నలుదిక్కుల నంధకారముగ నుం డెను.

దరిద్రులయింట మందులసందడి అంతగా నుండదు, ఐనను వారికి సాధ్యమైనంతవఱకు చికిత్స చేయుచునే యుం-డిరి. హరాణ్ డాక్టరు మందులకు వచ్చి చూచినందులకు బిల్ చేసి పంపించెను. ఎంతో ప్రయత్నముపైని చిక్కు-లన్నియు సరిచేసికొని అసాధ్యమగు కష్టములు లేకుండ ఇంటి వ్యవహారములన్నియు ఇన్నాళ్లవఱ కేదో యొక విధ-ముగ వారు దారిలో పెట్టుకొనఁగలిగిరి. డాక్టరుగారి బిల్ చెల్లించుటవలన ఈరవంత సుఖముకూడ మాయమైనది. దారిద్ర్య పిశాచము ఆసంసారమును మ్రింగుటకై మఱల నాయింట ప్రవేశించినది. జాహ్నవి, "నేను బాగు కాను-న్నచో ఏప్రయత్నము లేకయే బాగయ్యెదను, ఇట్టియవస్థలో మన మున్నప్పుడు అంత కర్చేల చేయుచున్నారమ్మా, ''

అనుచు పిల్లలను మాటిమాటికి నిరుత్సాహ పఱచుచుండెను. ఇంట నేదెట్లు జరుగుచున్నదియు జాహ్నవి కనుఁగొనుచుండెను. ఎవరెట్లు బాధఁ జెందుచున్నారో యని మాటి మాటికి అడుగుచుండును. సతి తల్లితో "అమ్మా నీవు అంతదిగులు చెందుచుండిన నీశరీర మెట్లు బాగుకాఁగలదు" అనుచుండును. "ఇంతకాల మెట్లుజరిగినదో అట్లేయిఁకముందుకూడ జరుగును. అన్న మఱల ఇంటికి రాఁగానే మనకెట్టిలోటును ఉండదు— ఏంతబాధపడినను ఈనాలుగు రోజులేకదా!"

"అట్లైన హరికి కబురు పంపుము," అని కొంచె మాలోచించి తల్లి యన్నది.

"పంపితిని రెండురోజులలో అన్న వచ్చును."

సతి అన్నకు కబురుపంపినది నిజమే, కాని హరి ఆపంపినవానిని నాలుగుతిట్లు తిట్టి పొమ్మనెను, సతి ఈమాట తల్లితో చెప్పలేకపోయినది. క్రమక్రమముగ అన్న అధోగతి పాలగుచుండెను—ఐనను మఱియొకమాఱన్నకు వార్తపంపి చూడవలెనని సతి నిశ్చయించుకొన్నది. మనస్సును కరఁగించుమాటలనేకము నేర్పి కొంతత్తను తోడిచ్చి కాళీపదుని చాంద్‌పూరునకు పంపినది. కొంతసేపటి కిద్దఱును తిరిగి వచ్చిరి— హరిబాబచ్చట లేఁడు, కలకత్తా వెళ్లినాఁడఁట. సతి మాటాడక కన్నీరు తుడుచుకొన్నది.

ఇంట నే నాలుగుసామానులు మిగిలియున్నవో వానినొక్కొక్కదానిని కొంత సంతకు తీసికొనిపోయి అమ్మి వచ్చు-

చుండెను. ఇంటికర్చులును, రోగిపథ్యపానములును దీనితో గొన్నాళ్లు గడిపిరి. ఇట్టిస్థితిలో నున్నప్పుడుకూడ వారెవరి-యెదుటను చేయి చాచలేదు, ఎవరిదగ్గఱను తమయవస్థను-గుఱించి చెప్పుకొనలేదు. అట్టిదురవస్థలో నుండుటవలన వారెవరియింటికిని పోవుచుండుట లేదు, కనుక నెవ్వరును వారియింటికి వచ్చుచుండుట లేదు. ఈ కారణమువలన వారియింటిసంగతి యెవ్వరు నంతగా నెఱుఁగకుండిరి.

సాధ్యమైనంత వఱకు కర్చులు తగ్గించి సతి సంసార-యాత్ర సాధించుచు వచ్చుచున్నది. కాలీపదునకు మిగుల కష్టము లేకుండునటుల చేయుచు అక్క-చెల్లెం డ్రిద్దఱును అర్థోపవాసములతో కాలము గడపుచుండిరి—ఇట్లు చేయు-చున్నను ఇఁక ననేకదినములు గడచినట్లు కనఁబడలేదు.

చైత్రమాస మాఖరగుచున్నది. జాహ్నవికి రోగము చాల భాగము తగ్గినను, తా మంత దురవస్థలో నున్నను సతికి ఆయంధకారమున తీరము కానవచ్చినది. కాని రోగము-నుండి విముక్తురాలయి తల్లి తుదకు ఆహారము లేక ప్రాణత్యా-గము చేయవలసి వచ్చునేమో యని యామె దిగులుచెంద నారంభించినది. సతి మిగుల దుఃఖించుచు చేతులు జోడించి భగవంతుని ప్రార్థించుచు చాలరాత్రియైనతరువాత అమ్మ పఱుపు ప్రక్కను పఱుండఁబడి పోయినది. తెలతెల్లవాఱుచుండు నప్పుడు "సతీ, సతీ, లెమ్ము," అని జాహ్నవి కేకవేసినది. సతి

ఉలికిపడి లేచి కూర్చుండి, కన్నులు నులుముకొనుచు "ఏమి యమ్మా, ఏమైనది?" అని కలతఁజెందుచు నడిగినది.

"ఏమియు లేదమ్మా. పాడుకల యొకటి వచ్చి మనస్సున భీతి పుట్టినది, ఒక్కమారు చేతితో గుండెపై రాయుము సతీ."

సతి తల్లిగుండెను చేతితో మెల్లగ రాయుచుండెను. సతిచప్పిడపుడలు, వాడిన ముఖము చూచి జానకి, "ఆపద సమయమున ధైర్యము విడువకు మమ్మా, భగవంతుఁడు మనల నెన్నఁటికిని ఈస్థితిలో నుంచఁడు, అతనినామము స్మరింపుము, అతఁడు తప్పక మనలను దరిఁజేర్చును."

"ఇప్పుడేల చెప్పుచున్నా వమ్మా అట్లు?" అని సతి డగ్గుత్తిక కంఠముతో ననెను.

"గుండె బితుకు బితుకు మనుచున్న దమ్మా, ఎందుకో కాని."

సావిత్రి లేచి తల్లికాళ్లకడ కొంచెమునేపు కూర్చుండి, లేచి, ఇంటిపని చూచుకొనుటకు పోయినది.

కాళీపదుఁడు ఆట ముగించి వచ్చి "అక్కా, తినుట కేమైన ఇమ్ము," అని యడిగెను.

ఇంటనున్న తినుబడి సామగ్రి యంతయు కర్చైపోయి నది. సతి వెనుకటిరాత్రి తన కాఁకలిలేదని భోజనము మాని, మిగిలియున్న చేరెడు బియ్యము తమ్మునికొఱకు నుంచినది. అవి

వేసియుంచి తమ్ముఁ డడుగగానే వానికి కొంచె ముప్పుఁడాసి గిన్నెలో వేసి యిచ్చినది. తమ్ముఁ డవి చేతిలో పట్టుకొని తినుచు ఆడుకొనుటకు బయటికి పోయెను. "అమ్మా, నీకు గొంతు ఎండి చుండుట లేదా?" అని సతి తల్లి నడిగినది.

"లేదు తల్లీ," అని జాహ్నవి యన్నది.

"ఆహా నిశ్చయముగా నీగొంతు ఆర్చుకొని పోవుచున్నది-లెమ్మమ్మా, లేచి ముఖము కడుగుకొని స్నానముచేసి రమ్ము. ఏమైనను నోటిలో వేసికొనెదవు.గాని."

జాహ్నవి సతివైపు చూచుచు మెల్లఁగా నన్నది— "అమ్మా, నే నెట్లైన బ్రతికియే యుందును. ఈ కఠినప్రాణము సులభముగ పోదు. కాని తమ్ముఁడును, మీరును నాకండ్ల-యెదుట తిండి తినక పూడకుఁడు—నేను తినకయున్నను బ్రతికియేయుందును."

సతి ఆమాట చెవిని పడనీయలేదు. తల్లిని ముఖము కడిగించి స్నానము చేయించినది. పెత్తల్లి పాలు పిదికి గొణుగు-కొనుచు గొణుగుకొనుచు ఏటికి స్నానమునకై బయలుదేఱి-నది. నేఁడు తలుపుతీసి బయటికి పోను అని సతి నిశ్చయించు-కొన్నది. కాని తల్లి మూలమున అది మఱి సాగలేదు. ఇంట పాడి యున్నంతకాలము తల్లి ప్రాణమునకు హాని కలుగనీయ-కూడదని సతి తలఁచి, "చెల్లీ, నీవు నిప్పు రాజపెట్టుమమ్మా,

నేనంతలో చెఱువులో మునిఁగి వచ్చెదను," అని సావిత్రితో నన్నది.

"నిప్పు రాఁజవెట్టి ఏమి ప్రయోజనము?" అని సావిత్రి మెల్లఁగా నన్నది.

"పాలు మఱిగించవచ్చును," అనుచు సతి బిందెయొకటి పట్టుకొని చెఱువునకు వెళ్లుటకు, వెనుక తలుపుతీసి బయలు-దేఱినది.

మడతలుపెట్టి త్రాడుతో ద్వారమునకు వ్రేలాడఁగట్టిన కాగితమొకటి తలుపు తీయఁగానే సతి కంటపడినది. ఏమి యీకాగితము? ఎవరో వ్రాసిన జాబువలె నున్నదే! సతి కుతూ-హలము కొలఁది దానిని విప్పి చూచినది. అది నిజముగా జాబే—తా నెఱిఁగిన దస్తూరికాదు. కాని ఆమె పేరే పైని వ్రాసియున్నది.

సతి మిగుల నాశ్చర్యమొందెను. కాని తల్లిమాట జ్ఞప్తికి తెచ్చుకొని, జాబును ఇటికల నడుమ గ్రుచ్చియుంచి స్నానమునకై వెళ్లెను. ఇంటికివచ్చి తడిబట్ట విప్పకుండఁగనే పాలు కాఁచి అందులో సగము అమ్మ కిచ్చినది. తల్లి అనేక-విధముల అభ్యంతరపఱచినది. కాని చివరకు సతి కనుల వెంట నీరు కాఱుచుండుట చూచి, కొంచెము పాలుమాత్రము వేఁడిగిన్నెలోనికి వంపి మిగిలినవి త్రాగినది.

సతి తడిబట్టతోనే మఱల పెరటిద్వారమువైపు వెళ్లినది ముందు రోజు ఉపవాసము చేసియుండుట వలన ఆమె దేహ-

మున మంట పుట్టుచుండెను. కనుక సతి తడిబట్టను విడువలేదు. బయటికివచ్చి ఇటికల సందులోనుండి జాబుతీసి మొదటి పఙ్క్తి చూడఁగానే ఆమె తల గిరగిర తిరుగుట మొదలుపెట్టినది. ఎంతో ప్రయత్నముపైని మనస్సును స్వాధీనపఱచుకొని ఆమె ఆజాబును చదివినది. నరేంద్రనాథ భాదురీ స్వయముగా తానే వ్రాసిన ఉత్తరమది—తన కమల భర్త యతఁడు. బహు హేయమగు మాటలు ప్రయోగించి అతిహేయమగు ప్రస్తావము ఆజాబులో చేసియున్నాఁడు. వారిప్పుడు పడుచుండు బాధలకై సానుభూతిని వ్యక్తపఱచుచు, తాను సూచించు మార్గమును సతి యంగీకరించిన యెడల వారిదుఃఖములన్నియు దూర మగునని జమీందారు ఆజాబులో వ్రాసియున్నాఁడు. దుఃఖము, కోపము, అసహ్యము ఆమె హృదయమున పుట్టినవి—ఆజాబును ముక్కలు ముక్కలుగచేసి సతి మఱల స్నానమునకై చెఱువునకు పోయినది. జాబుచదువుటవలన తాకకూడనిదేదో తాకినట్లామె కనిపించినది—పలుమాఱు నీటిలో మునిఁగి, చాలసేపటివఱకు నీటిలోనే యుండి తుద కామె యింటికి వచ్చినది.

"అక్కా, మఱల స్నానము చేసితివేల? దేనిమీఁదనైన అడుగు పడినదా ?" అని ఇంటికి రాఁగానే సావిత్రి యడిగినది.

"ఔను," నన్నది సతి. మఱి కొన్ని నిమిషములైన తరువాత, "నేఁడు నాదేహమున బాగుగాలేదు. కొంచెము పండుకొనెదను," అని యనెను.

"తమ్మున కేమి ఇమ్మన్నావక్కా-?" అని సావిత్రి శుష్క-కంఠముతో నడిగెను.

"పాలిమ్ము. నీవు కొంచెము త్రాగి వానికి కొంచెమిమ్ము." సతి బట్ట పిండి ఆరవేసి గదిలోనికి పోయి తలుపు వేసికొనినది. నిజముగా నామె శరీరమున బహుబాధగా నుండెను. అలసి-యుండుటచేత పరుండఁగానే సతికి నిద్రవచ్చినది; నిద్రపట్టుట-వలన బాధ కొంచెమునే పామెను వదలినది.

అన్నమునకు మాఱుగా పాలిచ్చుట వలన కాళీపదుఁడు కోపగించి పాలు పాఱఁబోసి యేడ్చుచున్నాఁడు. సతికి తెలివి వచ్చునప్పటికి కాళీపదుని ఏడ్పు వినఁబడుచున్నది. సావిత్రి-కూడ ఏడ్చుచున్నది. సతి ఆ యేడ్పులు వినలేక వ్రేళ్లతో-చెవులుమూసికొని కఱ్ఱబొమ్మవలె నచ్చటనే పడియుండెను.

మఱి రెండు నిమిషములు కాఁగానే, "అక్కా, అక్కా-లెమ్ము," అనుచు సావిత్రి తలుపుపై గ్రుద్దినది. సతి పలుకలేదు. సావిత్రి మఱల కేకవేసినది—"లెమ్మక్కా, విశుదాదా పిన్ని ఏమేమో అన్నియు పంపినది. ఒక మాఱు వచ్చి చూడుము."

సతి మెల్లఁగా లేచి తలుపుతీసి చూచినది. పుష్పచందన శోభితమై జలపూర్ణమగు కళసి ఒకప్రక్కను, పండ్లు, కూర-కాయలు అనేకవిధములగు మిఠాయి మొదలగునవి మఱియొక-ప్రక్కను గల కావడి పట్టుకొని వంటబ్రాహ్మణుఁ డొకఁడు గడపలో నిలిచియున్నాఁడు.

"ఇదియేమి? ఎందు కివియన్నియు?" అని సతి క్షీణకంఠ-ముతో నడిగినది.

"సంక్రాంతి నేఁడు, నేఁడు మా యమ్మగారి అన్నదాన-వ్రతము. బ్రాహ్మణగృహముల కిట్లు పంపవలెనఁట".

కావడి దింపి అన్నియు నచ్చట నుంచి బ్రాహ్మణుఁడు వెళ్లిపోయెను. మిఠాయియు, పండ్లును ఇచ్చి, సావిత్రి తమ్ముని శాంతింపఁ జేసినది. వానినుండి వంట వస్తువులు తీసి సతి వంట మొదలుపెట్టినది. ఆమె నేత్రములనుండి అశ్రుబిందువులు అగ్నిపై పడినవి—అవి యగ్నివలెనే కాలుచుండినవి. సతి భగ-వంతుని యూహించి కనుల నీరు పెట్టుకొన్నదో, లేక మనుష్యు-నెవని నైన నూహించి కంట నీరు పెట్టుకొన్నదో చెప్పుట కష్టము.

మెల్లఁగ మఱి రెండుమూఁడురోజులు గడచినవి. మొదటి స్థలములో సతికి మఱియొక జాబు కనఁబడినది. దీనిలోకూడ మొదటిదానిలోవలెనే అనేకవిధములగు ప్రలోభన ముండెను. సతి జాబును చించి పాఱవైచి ఏమియు-చేయక నూరకుండెను. సావిత్రికి ఈవార్త తెలిసినయెడల ఆమె భయపడునేమో యని తలఁచి ఆమెతో నేమియు నన లేదు.

ఈయేఁట వైశాఖమాసమున అన్నపూర్ణాదేవి అనేక-వ్రతములు చేయుచున్న ట్లున్నది. ఏదో యొక వ్రతసందర్భ-

మున ఏడెనిమిది రోజుల కొక మారు ఫలములు, కూరగాయలు, మిఠాయి మొదలగువానితో నిండియున్న కావడి జాహ్నవిగారి యింటికి వచ్చుచుండెను. దారిద్ర్యదశ కస్తూరివంటిది. ఎవరును చాటింపకయే బయలు పడుచుండును. ఇది యెఱిగికూడ సతి ఊరకుండెను—దుర్దాంతమగు దారిద్ర్యపిశాచముతో పోరాడి పోరాడి యలసి పడియున్నది. యుద్ధముచేయుటకు మఱి శక్తిలేదు. లేమివలన కలుగుబాధ కొంచెము దూరమయి కొద్దిదినములు హాయిగా గడచినవి. ఇన్నాళ్లకు మనస్సు చులకనయి సతి నాలుగు విషయములనుగుఱించి కొంచె మాలోచింపఁ గలుగుచుండెను. కాని యీరీతిగ ననేకదినములు హాయిగా నుండునటుల భాగ్యదేవత ప్రసాదింపఁ దలఁచుకొనలేదు. హఠాత్తుగ నొకనాఁడు తారాపూరునుండి అప్పులవారి యొద్దనుండి తమకు బాకీయున్న మూఁడుపందలరూపాయలును, వానికి వడ్డీ మూఁడుపందలును వెంటనే చెల్లించవలెనని నోటీసు పంపిరి. చెల్లింపనిపక్షమున తనఖాగా నుంచిన వారియింటిని అమ్మించి సొమ్ము రాఁబట్టుకొనక మానరఁట.

ఆనాఁడు జాహ్నవి పఱుపుపైనుండి లేవలేకుండెను. కాని తాను భోజనము చేయనియెడల పిల్లలుకూడ తిండియుండదని ఎఱిఁగి, లేచి పిడికెఁడన్నము తిని మఱల ప్రక్కపై పరుండఁబడినది. జాహ్నవిదేహము మనోవ్యథవలన అసలే బలహీనమై యున్నది. ఇప్పుడు జ్వరముకూడ వచ్చినది. సావిత్రి

కళలేని ముఖముతో తల్లి పఱుపుప్రక్కను కూర్చుండి-యుండెను. సతి సగము కూలియున్న మూలగదిలోనికి పోయి తలుపు మూసికొనినది—లోన నిద్రించుచుండెనా?

నేఁడు తాము పడుచుండుబాధ లన్నింటికిని మూలకారణ మెవరని సతి తనలో తాను యోచించుచుండెను. వారియప్పు ఉదరపోషణార్థమై చేసిన యప్పుకాదు. నేఁడు వారిట్టి దుర-వస్థలో నుండుటకు కారణము లేమివలన వారు చేయవలసి-వచ్చిన ప్రయత్నములు కావు. కేవలము సతి సుఖమునకై జరిగిన ప్రయత్న మొక్కటియే తమపై నిప్పుడు పడ సిద్ధముగ-నున్న విపత్తునకు మూలము. ఆహా, ఎంతదుఃఖము, ఎంతబాధ! ఇట్టియాపద సమయమున ఎవరు తమకు తోడ్పడఁగలరు? ఎవరు తమకు ఆశ్రయ మీయఁగలరు? "నాయనా, మేము దీనులము, నిరుపేదలము, మా కాలువందల రూపాయలు ఋణ మీయఁగలరా?" అని వా రెవరియొద్దకైనను పోయి అడుగఁగలరా? వా రడుగఁగలవా రెవరును లేరా? ఉండ-వచ్చును—బహుశః ఒక రున్నారు. కాని సిగ్గువిడిచి ఆయన-కడకు పోయి ఎవ రడుగఁగలరు?

ఇట్లనుకొనుచుండ, సతికి తా నూహించుచుండిన యాతఁడు తనయంత తానే వచ్చి సాయము చేయవచ్చును గాఁబోలు అని తోఁచినది. ఛీ ఛీ, ఎంత హేయమగు జీవ-నము నాది! బిచ్చపుదానివలె కేవల మితరుల దయాధర్మముల

నాధారము చేసికొని బ్రతికియుండవలసి వచ్చినది. వేఱు ఉపాయ మేదియు లేదా?

"అక్కా గాలివాన వచ్చుచున్నది. బట్టలు తీసియుంచుము. నేను వానిని ముట్టుకొనకూడదు," అనుచు బయటినుండి సావిత్రి కేకలు వినఁబడినవి.

సతి తలుపు తెఱచినది. తన మనస్సునకుండు ఆందోళనవలెనే మహావిప్లవ మొకటి సృష్టి నాక్రమించుచున్నట్లామెకు తోఁచినది. సతి బట్టలు తీసి గదిలో నుంచిన తరువాత ఇంటిలో నీళ్లులేవని హఠాత్తుగ నామెకు జ్ఞప్తికి వచ్చినది. మరమ్మత్తులు లేక పోవుటచే నూతిలో నీళ్లు లేకుండెను. తుపాను రాత్రి చల్లారునట్లు కానరాలేదు. నీళ్లు తెచ్చుటకు కుండపట్టుకొని సతి బయలుదేఱుచుండ సావిత్రి యామెను చూచి "ఇంట నీళ్లులేవు కాఁబోలక్కా! నేను పోయి తెచ్చెదను కడవ నాకిమ్ము," అని యన్నది.

"నీ వమ్మదగ్గఱ కూర్చుండి యుండుము. నే నొక్కపలుగు నపోయి నీళ్లు తెచ్చెదను," అని చెప్పుచు సతి వెళ్లినది.

సతి నీటిలోనికి దిగి కడవముంచి ఎత్తుకొనఁబోయి హఠాత్తుగ గట్టుపై నెవరో కనఁబడుటవలన భయముచే వణఁకుట మొదలుపెట్టినది. ఎవరది? సతి జాగ్రత్తగ చూచి పోల్చుకొన్నది—గట్టుపై నిలిచియున్నవాఁడు నరేంద్రుఁడు.

సతి భయము కొలఁది కేకలువేయఁబోయినది గాని గొంతు పెగుల లేదు. నీటిలోనే నిలిచియుండి వణఁకుట మొదలుపెట్టినది.

నరేంద్రుఁడు, నవ్వుచు, "భయమేల సుందరీ? నేను పులిని కాను, ఎలుఁగుబంటిని కాను," అన్నాఁడు. "నేను రెండుత్తరములు నీపేర వ్రాసితిని. ఒకదానికైనను జవాబిచ్చితివి కావే!"

సతి ధైర్యము తెచ్చుకొని క్షీణకంఠముతో పలికినది— "మంచి కోరువారగుచో పొండు. తత్క్షణమే పొండు. పోనియెడల నేను కేకలు వేసెదను."

"ఇదిగో! ఎంత బుద్ధిమాలిన తనము నీది! నీవు అతి-బుద్ధిశాలిని వేమో? చేతిలో పడుటకు సిద్ధముగానున్న సిరిని కాలితో తన్నుచున్నావేమి? ఇట్టిదశలో నున్న నీవు రాణి వయ్యెదవు మీయిల్లు జప్తు కాఁబోవుచున్నదని విన్నాను. మీకునిలువ నీడ ఉండదే! నేను చెప్పినదానికి అంగీకరించుచో, మీ తల్లికి, మీ తమ్మునకు, మీ చెల్లెలికి కష్టములన్నియు దూరమగును."

సతి నీటిలోనే నిలిచి వణఁకుచున్నది. యముఁడే నరేంద్రునివేషము వేసికొని వచ్చి ఎదుట నిలిచి యున్నట్లు సతికి తోఁచుచున్నది. ఆపాపాత్ముఁడు మఱల ప్రారంభించెను—"ఏమనెదవు? తల్లియు చెల్లెలును ఇంటింటికిఁ బోయి బిచ్చమెత్తుకొనుట మేలా? వారు తిండికి లేక ఒక్కొక్కరు

చచ్చుచుండుట మేలా? నేను చెప్పినదాని కంగీకరించుట మేలా?"

సతి కడవను వదలి రెండు చేతులతో కన్నులు మూసికొనినది. తన యౌషధము పనిచేసిన దనుకొని నరేంద్రుఁ డుత్సాహముతో నిట్లనసాగెను—"హరి మూలమున మీ సమాచారమంతయు నేను తెలిసికొనుచుందును. నీవు నాకంట పడిననాఁటినుండి నీనామము నేను జపము చేయనిరోజు లేదు. మంచి యవస్థలో నున్నయెడల ఎవ్వరిని లక్ష్యపెట్టవలసినవారు కారు మీరు. కనుక నింతకాలమును నాకు ధైర్యము లేకపోయినది. నీవు నాదాని వగుచో నీకిఁక నెట్టి కష్టములును ఉండవు—నీవేది కోరిన నది ఆక్షణమే పొందుదువు. నీవిప్పుడు కష్టములలో నున్నావు. ఎంతసొమ్ము కావలెనో చెప్పుము. ఇప్పుడే ఇచ్చెదను."

"పొమ్ము, నీవు పొమ్ము. పోనియెడల ఈక్షణమే నీటిలో మునిఁగి ప్రాణత్యాగము చేసెదను," అని సతి ఆర్తకంఠముతో పలికెను.

"సరే, అట్లైన నేనిప్పుడు పోయెదను—కాని రేపే వేళకు రమ్మనెదవా? వచ్చెదను, వద్దనకుము. వర్షము వచ్చుచున్నది. నీ విఁక నింటికి పొమ్ము."

"నీవు మొదట పొమ్ము. తరువాత నేను పైకి వచ్చెదను," అని సతి అన్నది.

"ఏమి, నేను పామునా, దగ్గఱకు వచ్చిన కఱచెదననుకొనుచున్నావు? —సరే, అట్లైన నేఁటికి సెలవు."

ఆపాపి నవ్వుచు వెళ్లిపోయెను. సతి వణఁకుచు నీటిలో చతికిలఁ బడిపోయినది. మానవునిలోనుండు కలుషవాంఛలు మూర్తీభవించి నలుదిక్కుల పాశము పన్నుటకు వచ్చినవని ఆమెకు తోఁచినది. వానిని నివారించుటకు సతిలో నేమున్నది? అంధకార రూపమును ధరించిన పిశాచదళ మామెదగ్గఱకు వచ్చి ఆచీఁకటిలో తాండవ మాడుచుండెను. ఊపిరితీయుట కైనను సాహసమ్ములేక సతి ఆనీటిలోనే పడియుండెను.

సతి దక్షిణమువైపు తల ఎత్తి చూచినది. గట్టుపై నెవరో పలుగెత్తుచు హఠాత్తుగ నిలిచి, నిశ్చేష్టుఁడై ఆమెవంక తేఱిచూచి, వడివడిగా నడచిపోయెను. అతఁడు విశ్వేశ్వరుఁడని సతి పోల్చుకొన్నది. నరేంద్రుఁడు గట్టు దిగుచుండఁగా విశ్వేశ్వరుఁడు చూచి యుండవలెను.

నీటిలో కూర్చుండియుండ తనపైకి నరేంద్రుఁ డుఱుకునేమో యని సతికి భయమగుచుండెను. కాని ఇప్పు డామె ధైర్యము తెచ్చుకొని లేచి యింటికి వచ్చినది. దృఢసంకల్పమొకటి ఆమె మనస్సున ప్రవేశించినది. సతిని చూచి సావిత్రి ఆతురతతో, "అక్కా ఇంత యాలస్యమేమి? ఆలస్యమైనదని నేనుకూడ చెఱువునొద్దకు రావలె ననుకొనుచుంటిని—బట్ట-

యంతయు తడిసిపోయిన దేమి అక్కా? నీటిలో పడిపోతివా!" అని యడిగినది.

"ఔను, పడిపోతిని."

జాహ్నవి ఈమాట విని గుండె బ్రద్దలగునట్లు నిట్టూర్పు విడిచెను.

మఱునాఁటి యుదయము జాహ్నవి సావిత్రితో, "రాత్రి గాలికి మామిడికాయలు చాల పడిపోయినవి. కొన్ని-మామిడికాయలును, మల్లెపూలును తీసికొని పోయి విశ్వేశ్వ-రుని పిన్నికిచ్చి రమ్మమ్మా," అని యనెను.

మామిడికాయ లిచ్చి వచ్చి తల్లితో సావిత్రి ఇట్లన్నది- "అమ్మా పిన్ని అక్షయ తృతీయకు గంగాస్నానమునకై నవ-ద్వీపమునకు పోవుచున్నదఁట. మీ అమ్మ కులాసాగా నున్న-యెడల, మీ అమ్మ, మీ అక్కయ్య నాతో రాఁగలరా అని అడిగినది. ఇంటికి వెళ్లినప్పుడెల్ల నామె ఎంతో యాదరించు-చుండు నమ్మా. నాకు మిక్కిలి సిగ్గుగానుండును__" జాహ్నవి యామాటలు విని ఊరకుండెను. సతి కండ్లు కొంచెము చిట్లిం-చెను.



## పండ్రెండవపరిచ్ఛేదము.

విశ్వేశ్వరుఁడు ఫ్యాక్టరీతో సంబంధము చాలకాలమై వదలుకొనెను. వంతుదారులకును తనకును గల అభిప్రాయభేదమే దీనికి కారణము. ఆపని విడిచిన తరువాత స్వయముగా తా నొక్కఁడే ధాన్యము డిపో ఒకటిపెట్టి వర్తక మారంభించెను. ఇది కాక, పెద్దస్థలములు కొని పండ్లతోఁటయు పూలతోఁటయు వేయించెను. * ఫరాశ్ డంగా ప్రాంతములనుండి సాలెవారిని కొందఱిని తెప్పించి, వారి కిండ్లు కట్టించి యిచ్చి, చక్కని బట్టలు వారిచే నేయింపించి ఆబట్టలను కలకత్తా పంపుచుండెను. ఈరీతిని సదా అనేక విధములగు పని చేయుచుండెను. ధనము కూడఁబెట్టుటకై అతఁడు పలువిధములగు ప్రయత్నములు చేయుచుండెను—విశేషముగ డబ్బు పోగుకానిదే పశ్చిమమునకు పోయి అచ్చట యథోచితముగ పని ప్రారంభించుటకు సాధ్యము కాదు.

స్వగ్రామమునసుండు దారిద్ర్యమును గుఱించి విశ్వేశ్వరున కెట్టి విచారమును లేకపోలేదు. కాని పల్లెటూరులలో అందఱు నేదో విధముగ జీవితములు గడపుకొనుచుందురు. ఇంతే కాక, కోరనిదే ఎవరికైనను సహాయము చేయఁ బోయినయెడల చివరకు తానెంత సిగ్గు పడవలసివచ్చునో సతి మూలమున తెలిసికొని, విశ్వేశ్వరుఁడు తన గ్రామస్థులతో నంతగా

---

* సాలెవాండ్ర వలన ఖ్యాతిగాంచినస్థలము.

సంబంధము కలుగఁజేసికొనకుండెను. కేవలము తన పనిలోను, తన యూహాలలోను మునిఁగియుండెను.

విశ్వేశ్వరుఁడు పిన్నిని నవద్వీపమునకు తీసికొనిపోయి గంగాస్నానము, దేవునిదర్శనము చేయించి నాలుగైదు దినములలో నింటికి తిరిగి వచ్చెను. ఇల్లు చేరునప్పటికి సాయంకాలమైనది. పిన్ని వంట మొదలుపెట్టినది. విశ్వేశ్వరుఁడు ధాన్యపు డిపోను, మగ్గముల సాలను చూచుటకు పోయెను. పని సరిగా జరుగుచున్నది. ఇంటికి వచ్చి విశ్వేశ్వరుఁడు భోజనమునకై కూర్చుండెను. అన్నపూర్ణ విచారముగ కూర్చుండి యుండుట చూచి పిన్ని మనస్సులో నేదో దుఃఖమున్నదని పోల్చుకొని విశ్వేశ్వరుఁడు, "అట్లున్నావేమి పిన్నీ?" అని యడిగెను.

"ఏమియు లేదే!" అనుచు పిన్ని నిట్టూర్పు విడిచినది. ఇట్టి నిట్టూర్పులు క్రొత్తవికావు. కనుక విశ్వేశ్వరుఁడు భోజనము చేయసాగెను. కొంచెమూరకుండి పిన్ని, "ఆహా చూచుటకు దుఃఖ మగుచున్నది," అని తనలో తాననుకొనుచున్నట్లున్నది.

"ఎవరిని చూచిన దుఃఖమగుచున్నది పిన్నీ?"

"భట్టాచార్యుల కొమార్తెను చూచిన—ఆమె నన్ను చూచుటకు వచ్చి ఇప్పుడే వెళ్లినది."

"సతియా! నిన్ను చూచుటకు వచ్చినదా! ఏల వచ్చినది?" ఇట్లని కండ్లు చిట్లించుచు విశ్వేశ్వరుఁడు పిన్ని వైపు-

చూచెను. "వచ్చిన తప్పేమి? నవద్వీపమునుండి వచ్చితిమని తెలిసికొని తల్లి చూచి రమ్మని పంపియుండవచ్చును," అని పిన్ని యన్నది.

విశ్వేశ్వరుఁ డేమియు నన లేదు. పరధ్యానముగ భోజనము ముగించి పడక గదిలోనికి పోయెను. దేనిని గుఱించియో ఆలోచించుచు విశ్వేశ్వరుఁ డిటునటు పచారు చేయుచుండెను.

"లాంపులో చమురు లేదు కాఁబోలు నాయనా. తీసికొని రమ్ము చమురు వేసెదను," అని పిన్ని బయటినుండి కేకవేసినది.

"ఇప్పుడే నిద్ర పోఁబోవుచున్నాను పిన్నీ, దీప మవసరము లేదు," అని యనుచు విశ్వేశ్వరుఁడు పరుండెను. విశ్వేశ్వరుఁడు తనలో తానేదో ఆలోచించుచు నిద్రింప ప్రయత్నించుటకై ప్రక్కకు తిరిగి ప్రక్కనుండు పెద్దబాలీసుపై కాలువేసికొని పరుండెను.

ఉదయమే లేచి ముఖము కడుగుకొని తా నప్పుడు చేయవలసిన పని యేమని విశ్వేశ్వరుఁ డాలోచించుచుండెను. అతఁ డెన్నిదినములఁబట్టియో చూడని పుస్తక రాశిపై అతని కనులు పడెను. మంచముపై కూర్చుండి పరధ్యానముగ తలవైపు చేయి చాచి గోడ బీరువాలో మొదటివరుసపై నుండు పుస్తకము తీసెను. అది ఇంగ్లీషు వేదాంతగ్రంథము—దానిని చూచి విశ్వేశ్వరుఁ డాశ్చర్యపడెను. అది దాని సరి

రైయున స్థలమున నుండక, సంస్కృత గ్రంథములపై నున్నది. తానది చేసియుండఁడు. పిన్ని కూడ ఆగదిలోనికి రాదు. పుస్తకముపై నుండు కాగితపు అట్ట పైకి ఉబ్బియుండుటవలన లోపున నేదో యున్నదని అతనికి తోఁచినది. విశ్వేశ్వరుఁ డట్ట విప్పిచూచెను. లోపున నొక ఉత్తరము కనఁబడినది— పైని ఆడువారి దస్తూరితో తన విలాసమే వ్రాసియున్నది.

ఏమీ యాశ్చర్యము! అది వ్రాసినవారెవరు? అతఁడు కవరు చించి జాబు మడత విప్పి చూచెను. ఆఖరు పుట త్రిప్పి-చూచి, మిగుల నాశ్చర్యముఁ జెంది జాబు మొదటినుండి చదువ నారంభించెను. కొంత చదువఁగా నతని యాశ్చర్య-మధికమై మనస్సు పరిపరివిధముల పోయినది. మనస్సును స్తిమితపఱచుకొని అతఁడు మఱల మొదటినుండి చదువ-సాగెను.

"...ఉత్తరము విప్పఁగానే ఇది వ్రాసిన దెవరని మీ-రాశ్చర్యపడుదురు, బహుశః పేరు తెలిసికొనుటకు ప్రయత్నించెద రేమో. కనుక ప్రారంభములోనే ఉత్తరము వ్రాయు-చున్నది సతి యని తెలియఁ జేయుచున్నాను.

మీ కనేక విషయములను గుఱించి వ్రాయవలెనని కూర్చుంటిని. కాని ఏమి వ్రాయవలెనో ఇప్పటికిని నిశ్చయించు-కొనలేదు. వ్రాయవలసినవి అనేక సంగతు లున్నవి. నిజమే, కాని ఎక్కడ ప్రారంభింపవలెనో తెలియకున్నది. ఒకటి

వ్రాయఁబోయి మఱియొకటి వ్రాయుదు నేమో యని భయ మగుచున్నది—కాని నా కిఁక లజ్జయేల? చేతికి వచ్చినట్లు వ్రాసికొని పోయెదను, ఏది మొదట నేది చివర అను నాలో-చనతో నాకు పనిలేదు.

నేను నేఁడు చేయఁబోవు పనిని మసిపూసి మారడి-కాయగా చేయు నవసరము నాకు లేదు, నేను నిర్దోషినని సప్రమాణముగ నే నెవ్వరికిని తెలియఁజేయఁ గోరలేదు, నేనీ-సమాచారమ్ము - మీతో చెప్పక వీలు లేదన్నంత సంబంధము మీకు మాసుఖదుఃఖములతో లేదు. ఐనను మీకిది యం-తయు తెలియఁజేయ కుండగ నేనేల పోలేకున్నానో నాకే తెలియకున్నది.

ఐదురోజుల క్రింపట గాలివాననాఁటి సాయంకాలము మా యింటి వెనుకనుండు చెఱువునొద్ద జరిగినది మీకు జ్ఞప్తియున్నదా? వెళ్లిపోవు చుండఁగా మీకు కనఁబడిన వాఁడు చాంద్ పూర్ జమీందారు, నరేంద్రభాదురీ, నీటిలో కూర్చుండి యున్నది నేను. మీరది నిశ్చయముగా పోల్చి-కొని యుందురు—కాని నే నక్కడేల యుంటినో మీరు యోచించ లేదేమో, లేక అట్టి దృశ్యములు కంటఁబడి నప్పు-డందఱు నెట్లూహింతురో మీరు కూడ నట్లే ఊహించితిరా? మంచి యింటి యాఁడుబిడ్డ లట్టిపని చేయఁగలరా యని యోచించి చూచితిరా?

నేను నిరపరాధి నని మీకు నమ్మకము పుట్టించుటకు నేనీ జాబు వ్రాయుట లేదు. నే నపరాధిని, ఆపాపాత్ముని

మాటలవలన పతితనై పోతిని. ఆ ప్రలోభనమునుండి నన్ను మఱలించుకొనుట నాకిప్పు డసాధ్యము. కాని నే నతనిని మోసపుచ్చితిని. అతఁడు కోరినదాని కనేకరెట్లిచ్చెదనని నే నొప్పుకొంటిని—అతఁడు నా దేహమును కోరెను, నేను నాయాత్మను సహితము దానము చేసితిని. అతఁడు నాజీవన-మును ఒక్క జన్మమున మాత్రమే అపవిత్రము చేసి యుం-డును, నాశనము చేసియుండును; కాని నేను నా యిహపర-ములను, నాసర్వమును నరక ద్వారపాలకుల పాదములకు సమర్పణము చేసితిని—అట్టి సందర్భమున నేను మోసపుచ్చితి-నని యనుట సరియైన మాట కాదేమో! స్పష్టముగ చెప్పె-దను గమనింపుము. అతఁడు నాకనేకముగ రూపాయ లీయఁ గోరెను. నీ కతఁడు కనఁబడిననాఁడు కాక మఱియొక-నాఁడు, అనఁగా అటు మొన్నను, మధ్యాహ్న మప్పుడు మఱల వచ్చెను. ఆనాఁటి యుదయమే అప్పులవారు మా-యింటి యెదుట చాటింపించిరి—మూఁడు రోజులలో మే-మిల్లు ఖాలీ చేయవలెను. అతఁడు వచ్చి వేయి రూపాయల నోటు నాపాదములయొద్ద నుంచెను. నే నా రూపాయలు తీసి-కొంటిని. ఈరాత్రి యతఁడు వచ్చి చెఱువుగట్టుపై నిలిచి-యుండును, నే నతనితో లేచి పోయెదనని మాటయిచ్చితిని. నేను పోవుచున్నాను—నిజముగా నేను. నేఁడు పోవు-చున్నాను, కాని అతని యొద్దకు కాదు, మఱియొకని యొద్దకు.

నే నెవరియొద్దకు పోవుచున్నానో అతఁడు ఈ ప్రపంచ-

మున నుండువారికంటె సదయుఁడో నిర్దయుఁడో నేను చెప్పలేను. అతఁడు నాకెట్టిశాస్తి నిచ్చునో నేను చెప్పలేను; అతఁ డేమి చేసినను, చేయనిమ్ము; అతఁడు నాపై నెట్టిశిక్ష విధించినను నేనది అందుకొనుటకు సంసిద్ధురాలను, కాని ఈ ప్రపంచమున నుండు ఏ మానవుఁడు విధించినను నేనంగీకరింపను. ఆపాపాత్ముఁడు నరేంద్రుఁడు, నాలో నిట్టియాశను పుట్టించి, నన్నీవిధముగ నరక ద్వారమునకు లాగుకొనివచ్చి, నేను బహుకష్టములలోఁబడి అపరిమితముగ బాధ నొందుచు మతి తప్పి యున్నప్పుడు నాకిట్టిదారి చూపించని యెడల నేనిప్పుడు ప్రాణత్యాగము చేయుటకు సాహసించి యుందునా? ఎంత మాత్రమును సాహసించి యుండను.

నాతల్లి, నాచెల్లెలు, నాతమ్ముఁడు, రేపు నిలువ నీడలేక వీధులఁబడి తిరుగుచు ముష్టి యెత్తుకొనుచుండవలసి వచ్చునేమో తిండికి లేక కడుపు మాడి చావవలసి యుండునేమో! అట్టిసందర్భమున కేవలము నాసుఖమునే కోరుచు నిట్టి సదుపాయము నేఁ డెట్లు పరిత్యజింపఁగలను? నాయాత్మ శాశ్వతకాలము బాధఁ జెందుచుండునేమో యని ఆత్మహత్యకు జడియుదాననా నేను? బాధను నేను శాశ్వత మిత్రముగ భావించుచున్నాను. రాఁబోవు కష్టము ఇప్పటిదానిని మించునా? మించినను మించునుగాక, దానివలన నేను భీతిఁజెందను. లోకులు నన్ను నిందింతురా? నిందించిన నిందింతురుగాక! నాతల్లి, నాచెల్లెలు, నాతమ్ముఁడు రేపు బాధనుండి విముక్తు-

లౌదురు, కొంతకాలము సుఖముగా జీవింతురు. అంతలో భగవంతుఁడు వారిపై ప్రసన్నుఁడు కావచ్చును. భగవంతుని ప్రసన్నత ననుభవించుయోగ్యత నాకు లేదు, అది నే నెఱుఁగుదును. కనుక, ఇంతకాలమునకు కొంచెము శాంతినొంది నిశ్చింతగా సెలవు తీసికొనుచున్నాను. ఆరూపాయ లొకచోట పడియుండఁగా నాకు దొరకినవని నేను సావిత్రితో చెప్పితిని—సరళస్వభావము సావిత్రిది, ఆమె నామాట నమ్మినది. ఆరూపాయ లుంచుకొనుటవలన తప్పు లేదని ఆమెచే నమ్మించితిని. మఱునాఁడు నెత్తిపైఁ పడఁబోవు నాపద తొలఁగుటను నాశవలన సావిత్రిముఖమున ఆనంద ముదయించినది. అట్టి ప్రఫుల్లత నాకు ఆమెముఖమున కనఁబడి చాలకాల మైనది. ఆరూపాయలు తన యక్కహృదయమున నుండురక్తమని సావిత్రి, పాప మెఱుఁగకుండెను. అక్క పొందుచున్న దుఃఖమామె కెన్నఁటికిని తెలియకుండునటుల నేను భగవంతుని ప్రార్థించుచున్నాను.

మా కష్టములను గుఱించి నీతో నే నేల చెప్పలేదని నీవనెదవేమో? అది నీవనఁదగిన మాటయే—నీవు మిగుల దయగలవాఁడవు—ఈయనాథులపై దయఁజూపుటకు పెక్కుమాఱులు నీవు వచ్చితివి, పెక్కుమాఱులు దయఁజూపితివి, కాని ఇఁక మఱి వద్దు, ఇప్పటికే అధికమైనది. నీ ప్రసాదము బాణమై నాగుండెను పొడుచుచున్నది. ఋణ మింతకు మించనీయఁజాలను.

నీతో చాల సంగతులు చెప్పెదనని వ్రాసితిని, చాల వ్రాసినాను, ఐనను మఱి రెండు మూఁడు మాటలున్నవి. అవి చెప్పనిదే నేను చెప్పవలసినది ముగియదు. ఒకమాఱు నీవు నాకు రూపాయ లిచ్చి దయచూప వచ్చితివి, జ్ఞప్తి యున్నదా? నేనా రూపాయలు పుచ్చుకొనలేదు. నిజముగా మాకప్పుడు రూపాయ లవసరము లేకుండె ననుకొనుచున్నావా? పుచ్చుకొనకుండుటకు కారణమది కాదు. నీవు మాకెవరవు, నీరూపాయలు మేము పుచ్చుకొనుటకు? నీవు కోరియున్నచో నాకు సర్వమును ఒకప్పుడు ఈయఁగలిగియుందువు—ఆసంగతి మఱచితివేమో! కాని నేఁడు బిచ్చపుదానిని చూచి దయగొని సహాయము చేయవచ్చితివి. అట్టి నీకరుణ నాకక్కఱలేదు. నేను గర్వముతో నీకొకమాట చెప్పవలసియున్నది—ఇదియే మొదటి మాఱది చెప్పుట, ఇదియే కడపటిసారి. నీభార్యనగుటకు నేను కేవల మయోగ్యురాలను కాను, ఐనను నీవు నన్ను భార్యగా నంగీకరింపకుంటివి. మఱియొకరి నెవరినైనను నీవు పెండ్లియాడినచో నీహృదయమున ప్రేమకు కొఱతలేదని నమ్మియుందును, కాని అట్లు జరుగలేదు. నీకు స్త్రీజాతియెడ మిగుల నిరాకరణమని ఊహించితిని. కనుక నేఁడు నేను మృతినొందు సమయమున, ఆ యధమమగు స్త్రీజాతినే నీవెప్పుడో 'యొకనాఁడు ప్రేమింతువని నిన్ను శపించిపోవుచున్నాను. అట్టి యధమజాతికి చెందిన స్త్రీహృదయమున మహాసముద్రమొకటి దాఁగియున్నది—ఇది నీవెప్పుడో పోల్చు

కొనెదవు. స్త్రీకి ప్రేమనిచ్చి ఆమె యిచ్చుప్రేమను పొందుట-కంటె శ్రేష్ఠమగు సుఖము ప్రపంచమున నుండదని ఆనాఁడే నీవు పోల్చుకొనెదవు.

ఇఁక నేను జాబు ముగించి సెలవు పుచ్చుకొను-చున్నాను, ఇదియే నా కడపటి సెలవు. నావ్యవహారము చూచి నీవు విసుగుఁ జెందుచున్నావేమో, నాది ఇంతది యంతగా చేయు స్వభావమనుకొనుచున్నావేమో? స్త్రీలు భరించుకష్టములు దుఃఖములు భరించుటకు నేను వెనుదీయ-లేదు. అన్ని దుఃఖములను అమ్లానవదనముతో భరించితిని. కాని నాదుఃఖములకు దరిలేదు. అంతములేదు, కనుక నాజీవన వ్రతము ముగింప నిశ్చయించితిని. చావు తప్ప నాకు వేఱు-మార్గ మేమున్నది? హేయమగువాని ప్రస్తావమునకు మాటలతోనైన నంగీకరింపవలసి వచ్చుటకు కారణము నా దురదృష్టమే. చెవిని పడఁబోవుచుండు నంతమాత్రమున మంచియిండ్లస్త్రీలు చెవులు మూసికొనునట్టి మాటలు, నిలిచి పూర్తిగా వింటిని, చివర కిట్టి యుక్తి పన్నితిని, అంతయు చేయఁగలిగితిని, చేయలేనిది—మఱి నేనేమి చెప్పఁ-గలను? ఆత్మహత్యతలంపు మిక్కిలి భయంకరమైనది. కాని ఆప్రస్తావము నెదుట నదియైనను మహాసుఖదాయకమగు పని-యని తోఁచుచున్నది. అందఱును నన్ను నిందింతురు—నిందిం-పనిమ్ము. కాని నీవు నన్ను నిందింపకుము. నీపాదములకడ నాకు స్థానము దొరకియుండినయెడల నాకు నేఁ డిట్టిదశ పట్టియుం-

డదు. నా తల్లిని, చెల్లెలిని, తమ్ముని విపద్విముక్తులుగఁ జేయుటకు నేఁడు నేను నాప్రాణములను దారపోయవలసిన యవసర ముండియుండదు.

వేఱొకరిచే పరిగ్రహింపఁబడి నప్పటికిని, విధవనై-యున్నప్పటికిని పరపురుషుని చింత మనస్సులోనికి రానిచ్చు-చున్నానని నీవనుకొనకుము. నేను హిందువుల యింటఁ బుట్టిన-పిల్లను. ఎంత కష్టముగనున్నను రెండురోజులలో నన్ను నా ప్రస్తుతావస్థలలో పూర్తిగా ముంచుకొని సర్వమును మఱువగలను. హిందూస్త్రీల కా శక్తి యున్నది. మీ పిన్ని-మాటలవలన నా హృదయమున నొక యాశ ఉదయించినది, కాని అది కొద్ది మాసములలో మఱల మాయమైనది. కమల-కువలె (కమలమాట నీకు జ్ఞప్తియున్నదా?) నాకు కూడ సుఖసంపదలు ప్రాప్తించియుండిన యెడల అంతయు మఱచి-యుందునేమో. కాని నా కాయదృష్టము కలుగలేదు. నాలో-నున్న నీదయాస్వరూపము దారిద్ర్యమనెడు పాషాణఫలక-మును భేదించుకొని పరిస్ఫుటము కాఁగోరుచుండెను, నేను దానిని అంధకారమున దాఁచియుంచుచుంటిని. నీసమ్ము-ఖమున నిజము చెప్పుచున్నాను నమ్ముము—ఆదయామూర్తిని ఎన్నఁడును బయటికి తీసి నేను చూడనైన లేదు, చూచుట కవకాశము కూడ నాకు లేకుండెను. నేఁడు అట్టి యవకాశము చిక్కినది, కాని ఇప్పుడు దాని ప్రయోజనము లేదు—నేఁడు

నేను విశ్రాంతి నొందుచున్నాను. కనుకనే కాఁబోలు నీవు వచ్చి నా సముఖమున నిలిచియున్నావు.

కోపముతో అనేకముగ కఠినమగుమాటలు నిన్ననవలెనని తలఁచితిని, కాని ఈఉత్తరము వ్రాయుచున్నకొలఁది అట్టి తలంపు దూరముకాసాగినది—ప్రపంచములో నెవరిపై నిహక్కున్నదని నమ్మి కోప ముంచుకొనలేదు, ఐనను నీపై నిట్టిభావముదయించి యుండుటకు కారణమేమో నాకు తెలియకున్నది.

నిజముగా చెప్పుచున్నాను నమ్ముము, నా మనస్సులో నీపై ఇప్పుడెట్టి కోపమును లేదు. నిన్ను సహాయము చేయుమని కోరకుండుట అన్యాయమని నా కిప్పుడు బోధపడినది. నీపై కోపగించుట నా కుచితమగు పనికాదు, కాని జరిగిన-దాని నిప్పుడు మార్చలేను కదా. మా అమ్మను చెల్లెలిని ఇఁక నీవు చూచుచుండవలెనని నాకోరిక—కాళీపదుని కూడ చూచుచుండుము. వారి కెట్టి యాపదయు రాకుండ కాపాడుము. చేతనైనయెడల అన్నను మంచిదారికి తీసికొనిరమ్ము. నేను పోఁగానే వారికష్టము లన్నియు దూరమగునని నాకేలనోగాని తోఁచుచున్నది. నన్నుగుఱించి నీవు దుఃఖింపకుము. నేను చావకతీరదు, ఆపాపాత్ముని రూపాయ లందుకొనిన తరువాత మృత్యువుతప్ప నాకు వేఱుదారి లేదు. నీకు సాధ్యమగుచో మంచివరుని చూచి సావిత్రికి వివాహము చేయుము. నాప్రణామ మందుకొమ్ము, నాకిఁక సెలవిమ్ము.

ఇట్లు,

స తి. ”

## పదుమూఁడవపరిచ్ఛేదము.

ఉత్తరము చదువుట పూర్తియైనది. విశ్వేశ్వరుఁడు చలనములేక రాతిబొమ్మవలె కూర్చుండియుండెను అతనికి యోచనశక్తికూడ లేకుండెను. ఉత్తరము చదువుచున్నంతసేపు ఈఁతరాక అగాధజలమున మునిఁగి తేలుచున్నవానియవస్థలో నతఁడుండెను. ఇప్పుడు పూర్తిగా మునిఁగిపోయెను, లోతంచని నీటిలో ప్రాణములు విడిచినవానివలె నుండెను. చేతు లాడకుండెను, లేచుటకు కాళ్లు రాకుండెను. కొంచెము కదలుటకైనను తగినబలము అతనికి లేకుండెను. కండ్లు పెద్దవిచేసెను, కాని ఏమియు కానరాకుండెను, ఊపిరితీయక నిర్జీవివలె నతఁడు కూర్చుండెను.

హఠాత్తుగ బయటినుండి అన్నపూర్ణ కంఠము వినఁబడినది—ఆమె ఆర్తకంఠముతో, "విశూ! విశ్వేశ్వరా!" అని పిలుచు చుండెను. విశ్వేశ్వరుఁడు ఉత్తర మీయలేకున్నాఁడు.

అన్నపూర్ణ గదిలో ప్రవేశించి, "గదిలో ఉన్నావురా నాయనా? ఊరిలోని సంగతులు విన్నావా?" అని యడిగెను.

"విన్నాను."

"అట్లైన ఇంకను కూర్చుండి యున్నావేమి? ఇప్పటికిని ఉపాయము లేకపోదు."

"దేనికి ఉపాయము?"

"అట్లైన నీవు విన్నదియేమి? రామశంకర భట్టాచార్యునియిల్లు అప్పులవాండ్రు స్వాధీనపఱచు కొనెదరఁట. మూఁడు రోజులక్రిందట నోటీసు ఇచ్చినారఁట. నేనిక్కడ లేకపోవుట యెంత దురదృష్టము! నిధితల్లి ఇప్పుడే చూచి వచ్చినది. అప్పులవాండ్ర మనుష్యులు, అమీను, ఇల్లు చుట్టడించి యున్నారఁట. బయటికి లాగుకొనివచ్చి అందఱిని రోడ్డుపై విడిచిపెట్టుదురు. వెళ్లుమమ్మా, త్వరగా వెళ్లుము. నేనుకూడ నిప్పుడే వచ్చెదను. నీవు ముందుగా వెళ్లి వారి నాఁపుచేయు మునాయనా."

పిన్ని సరిగా మాటలాడ లేక పోయినది. కన్నీరు ధారలై కాఱుచుండెను. విశ్వేశ్వరునకు కూడ ఏడ్పువచ్చినది. ఇప్పుడైన నేదో ఉపాయము చేయవచ్చునేమో యని విశ్వేశ్వరునకు తోఁచినది. సతి—సతి ప్రాణమునిలుపుట కిప్పటికిని వేళ మించిపోలేదేమో యని తోఁచి విశ్వేశ్వరుఁడు సతిగారి యింటికి పరుగెత్తెను.

భట్టాచార్యుని భగ్నద్వారము నెదుట ఇరుగు పొరుగులవారు గుంపు కూడి యున్నారు. అప్పులవాండ్రు కోర్టువాండ్రతో కలసి లోనికి ప్రవేశింపఁ బోవుచున్నారు. లోపలనుండి ఏడ్పులు వినఁబడుచున్నవి—ఆ యసహాయాక్రంద-

కులు విని ఇరుగుపొరుగులవారు మిగుల ఆమోదించుచు పలువిధములగు స్వాభిప్రాయములను వ్యక్తపఱచుచున్నారు— "ఇంత అహంభావ మున్నవారికి ఈదశపట్టక మఱి యేమౌను? మే మిరుగుపొరుగులవారముకదా, మాతో చెప్పనక్కఱలేదా? సహాయము చేయుమని మమ్ముల నడుగరాదా? నిరుపేదల కింత పౌరుషమేల?" విశ్వేశ్వరుని చూచి ఆగుంపులో నుండు నొకఁడు అతనితో ని ట్లనసాగెను— "నీ వేమియనెదవు నాయనా? మన మిప్పు డేమి చేయఁగలము? — ఏమి? ఆ పెద్దమనుష్యుఁడు మాత్రము తనకు రావలసిన రూపాయ లెట్లు వదులుకొనును? ఈపద్దు, ఇంత గందరగోళము లేకుండ నెమ్మదిగా బయటికివచ్చుట మేలు—కాదా?"

విశ్వేశ్వరుఁ డామాటలకు ప్రత్యుత్తర మీయలేదు. ఆపద్దు లతని మనస్సున వేలొకవిధమగు భావములను కల్పించిన ట్లుండెను. విశ్వేశ్వరుఁడు తొందరతొందరగా లోనికి పోఁబోవుచుండుట చూచి అప్పిచ్చిన పెద్దమనుష్యుఁడు ఆదరముతో నతనికి దారి విడిచెను—అమీను మొదలగువారుకూడ ప్రక్కకు జరిగి అతనిని లోనికి పోనిచ్చిరి.

ఏ గదినుండి • ఏడ్పు వచ్చుచుండెనో విశ్వేశ్వరుఁ డాగదివైపు పఱుగెత్తెను. పెత్తల్లి ద్వారముదగ్గఱ కూర్చుండి పెద్ద కేకలు వేయుచు నేడ్చుచున్నది. సావిత్రియు కాలీ-

పదుఁడును గదిలో నేల దొరలుచు నేడ్చుచున్నారు. జాహ్నవి ఎవరినో గట్టిగా పట్టుకొని ఇటునటు కొట్టుకొనుచు నేల పడియున్నది. విశ్వేశ్వరుఁ డామె ప్రక్కకు వచ్చి నిలిచి ఆర్త-కంఠముతో, "సతీ" అని పిలిచెను. అందరును కన్నులు విప్పి అతని వైపు చూచిరి. "విశూ బాబూ, అక్క——మాఅక్క!" అనుచు కాళీపదుఁ డేడ్వసాగెను. "ఏమైనది కాళీ?" అని విశ్వేశ్వరుఁడు వికృతకంఠముతో నడిగెను.

"ఏమైనదో తెలియదు, అక్క మాటలాడుట లేదు," అన్నాఁడు కాళి; "అక్క చచ్చిపోయినది," అన్నది పెత్తల్లి.

విశ్వేశ్వరుఁడు ముడుకులు విరిచి గొంతుకూర్చుండి జాహ్నవిని ప్రక్కకు త్రోసివేయుచుండ నామె నోట మాట పెగిలినది, ఆర్తస్వరముతో నామె "ఎవరురా నీవు, నీమనస్సు రాయియా? పొమ్ము, మఱియొక్క క్షణముండుము. నా-బంగారు తల్లిని, నాధనమును మఱికొంచెము నేపు కౌఁగి-లింపు కొననిమ్ము," అని యన్నది.

"అమ్మా నేను 'విశు'ను నన్నొకమాఱు చూడనిమ్ము, బ్రతికించఁగలమేమో——"అని విశు అనుచుండ జాహ్నవి కనులు తెఱచి చూచినది, ఆమె దుఃఖము ద్విగుణమైనది, మిగుల నార్తకంఠముతో, "ఎవరు నీవు, నాయనా? విశ్వేశ్వరుఁ-డా? నాసతిని నీ పాదముల యొద్దకు తీసికొనిపోవలెనని వచ్చితివినాయనా? నాసతికి నేఁడు పెండ్లియా? చావ సిద్ధముగ-నున్నముసలివాని కిచ్చి ఆమెకు పెండ్లి చేయలేదా? మాసతి

నిషముతిని చావలేదా? నేను కలగంటినా నాయనా? రమ్ము. తండ్రీ; రమ్ము," అని యన్నది.

విశ్వేశ్వరుఁ డతి కష్టముతో జాహ్నవిని ప్రక్కకు జరిపెను. చేతులపై ముఖము ముంచుకొని సతి బోరగిల పడియున్నది. చటాలున ఆమె నొత్తిగించుటకు విశ్వేశ్వరునకు ధైర్యము చాలలేదు. యోగ నిమగ్నమై యున్నవారి యోగమును భంగము చేయఁబోవుచున్నవానికి, అపరాధము చేసి భస్మమగుదునేమో యని భయమగుచుండును—విశ్వేశ్వరునిలో నట్టి సంకోచము కనిపెట్టి సావిత్రి మెల్లగ లేచి వచ్చి, రెండుచేతులతో సతిని ప్రక్కకు త్రిప్పుచు, రుద్ధ కంఠముతో, "చూడుఁడు, కాని చూడవలసినది మఱి యేమియు లేదు. ప్రాణముపోయి చాల సేపయినది," అని యనెను.

ఐనను సతి బ్రతికియున్నదా అని విశ్వేశ్వరున కనిపించినది. ఆమె ముక్కుదగ్గఱ చేయి ఉంచి నాలుగైదుమాఱులు చూచెను, చుట్టును నల్లని గుడ్డు లేర్పడియున్న ఆమె కనులను తెఱచి చూచెను. నోటిలో వ్రేలుపెట్టి నాలుక నేమైన వేడియున్నదా యని చూచెను—కాని అంతయును పూర్తి యైపోయినది—ఏమియును మిగిలియుండ లేదు.

"దేహ మంతయు చల్లఁబడిపోయినది."

"వ్యర్థప్రయత్న మేల చేసెదవు నాయనా, విశ్వేశ్వరా, నేషము వేయవలసినది కాదు నాసతి? ఇంతకాలమును బాధ.

నోర్చియున్నది, తనబాధ నెవరికిని ఒక్కమాత్రైనను తెలియనీయలేదు. ఇఁక భరించలేక నేఁడు వెళ్లిపోయినది—వెళ్లకుమమ్మా, ఉండుము, అని కోరుటకైన నెవరికిని అవకాశ మిచ్చినది కాదు. ఇఁక నన్ను కొంచెము విడువుఁడు నాయనా! నాతల్లి తపించి తపించి, ఇప్పుడు చక్కగ చల్లఁబడినది; దాని చల్లని దేహము, చల్లని హృదయము కొంచెము నాగుండెపైనుంచుకొనెదను నాయనా. ఇంత నిశ్చింతగా ఒక్కనాఁడైనను నాసతి నిద్రింపలేదు. మనస్తాపములు చల్లారి, దేహము స్వస్థతఁజెంది నాకూఁతురు నిద్రించుచున్నది తండ్రీ, మనసార నన్ను కొంచెము చూడనిము.”

క్రమక్రమముగ నిల్లు మనుష్యులతో నిండిపోయినది.

“ఎంతఘోరము, ఎంతఘోరము!” “ఇట్లు జరిగినదేమి?”

“ఎట్లు చనిపోయినది?” “ఏమి తిన్నది?” “విష మెక్కడదొరకినది?” విషమేల తిన్నది? “ఎవరైన నేమైన అన్నారా?” మొదలగు ప్రశ్నలతో ఇల్లు నిండినది. ఆకోలాహలమువలన, ఆయాందోళనమువలన పెత్తల్లికూడ నోరు మూసినది. పరోపకార బుద్ధిగల ఊరిపెద్దలు నిజము తెలియఁగోరుచు వాదనలు చేయుచున్నారు. వెదుకగా వెదుకగా సతి తలదగ్గఱ తైలము సీసా యొకటియు, చిన్న చీటి యొకటియు దొరకినవి. ఆచీటిలో సతి ఈవిధముగ వ్రాసినది. “నే నాత్మహత్య

చేసుకొనుచున్నాను. నాతల్లిగాని, చెల్లెలుగాని, మఱియే-బంధువులుగాని దీని విషయమై రవంతయైన నెఱుఁగరు. ఇట్లు, సతి."

అప్పులవారి మనుష్యుఁడు లోనికి వచ్చి, "బాబూ, నేఁటికి మేము పోవుచున్నాము, ఇంట నేదో విపత్తు సంభవించినది. కాని రేపువచ్చి మఱల నీవిధముగ వృథాగా పోము," అని కేకవేసెను.

ఎవ్వరును జవా బీయలేదు. విశ్వేశ్వరుఁడు ముఖమెత్తి చూచెను, అన్నపూర్ణ, దగ్గఱకూర్చుండి జాహ్నవి నోదార్చుచుండెను, నడుమ నడుమ సతి నొసటిపై చేయివేయుచుండెను. ఆమె విశ్వేశ్వరుని దగ్గఱకు పిలిచి చెంగునుండి నోట్లకట్ట యొకటి విప్పి కుమారుని చేతఁబెట్టి అతని చెవిలో, "వాండ్రను పంపివేయుము నాయనా, మఱి రేపు రానక్కఱలేదని చెప్పుము," అన్నది.

విశ్వేశ్వరుఁడు బయటికి వచ్చి అప్పువానితో కూర్చుండి బాకీ మొత్తము తేల్చి ఏడువందల రూపాయలపై చిల్లర వానిచేతిలో పెట్టి, తన ఖాపత్రముపై చెల్లు వ్రాయించి, ఆపత్రము పుచ్చుకొని మఱల నింటిలోనికి వచ్చెను.

విశ్వేశ్వరుఁ డింట ప్రవేశించఁగానే పలువిధములగు ప్రశ్న లారంభించుచుండుట చూచి, "మనుష్యుఁడు, పాపము, మిగుల మంచివాఁడు, కొన్నాళ్ళవఱకు జప్తు ఆఁపుచేయించుట కొప్పుకొని వెళ్లిపోయెను," అని యనుచు నతఁడందఱి యుత్సా-

హామును చల్లార్చెను. ఆసందర్భమున సందడికి తావు చిక్కక ప్రజలు రెండవ విషయమునుగూర్చి ప్రసంగము ప్రారంభించిరి. "ఇంక దీని సమాచార మేమగునో! పోలీసువారికి తెలియఁజేయకుండుటకు వీలులేదు కదా! ఇన్స్పెక్టరుగారికి కబురుపంపి చాలసేపైనది, అతఁడు వచ్చువేళయైనది, తారాపూర్ నుండి పెద్ద డాక్టర్ కూడ వచ్చు సమయమైనది," అని ఎవరో అన్నారు. విశ్వేశ్వరుఁ డేమియు ననక కాళ్లు ముడుచుకొని అరుగుపైఁ గూర్చుండెను.

డాక్టరు, ఇన్స్పెక్టరు—ఇద్దఱును కలసి వచ్చిరి. విశ్వేశ్వరుని చూచి ఆదరముతో ఇద్దఱును నమస్కారము చేసిరి, విశ్వేశ్వరుఁడు శుష్కవదనముతో వారికి నమస్కారములందుకొని వారితో కలసి ఇంటిలోనికి వెళ్లెను. డాక్టరు మృతదేహమును పరీక్ష చేయుచుండెను. ఇన్స్పెక్టరు తైలము సీసాయును, ఉత్తరమును, తీసి తనికీ చేయుచుండెను. శాంతముగ నున్న తనముఖము సతి సిగ్గువలనను, అసహ్యమువలనను నల్లగఁజేసికొనినదా యని విశ్వేశ్వరునకు తోఁచినది. తెల్లగా నున్న ఆమె నొసటిపై భయమువలన నల్లని గీత లేర్పడినట్లున్నవి, సిగ్గు నతిక్రమింపగలుగుటకై ఆమె లోలోపల భగవంతునిప్రార్థించుచున్నట్లున్నది—విశ్వేశ్వరుఁడా మెవంకచూచి, మఱి చూడలేక ముఖము మఱియొకప్రక్కకు త్రిప్పెను.

అన్నపూర్ణ విశ్వేశ్వరునియొద్దకు వచ్చి నెమ్మదిగా చాలసేపు మాటలాడినది. విశ్వేశ్వరుఁడు దేనికిని ప్రత్యుత్తర-

మీాయలేదు, మాటలాడుటకుఁ గాని తామిప్పుడు చేయవలసి-నది ఇది అది యని చెప్పుటకుఁగాని తగిన శక్తి వానిలో నిప్పుడు లేదు. డాక్టరు విశ్వేశ్వరుని పిలిచెను, విశ్వేశ్వరుఁ డతని దగ్గఱకు రాఁగానే డాక్టరిట్లనెను.

"ఆమె చనిపోయి చాలసేపైనది. బెలడోనా కలిసి-యున్న తైలమామె చావునకు కారణము—ఇది ఆత్మహత్య-యని స్పష్టము."

"ఈ తైలమే డాక్టరుగారి ఆసుపత్రినుండి వచ్చినది—ఓహో, నాగ్ డాక్టరు గారి ఔషధాలయము నుండియా—ఎట్లిచ్చటికి వచ్చినదో?" అని ఇన్‌స్పెక్టరు అడిగెను.

ఏడ్చుచు పెత్తల్లి జబాబు చెప్పినది—"మా తోడి-కోడల నడుమునొప్పి నిమిత్తము తీసికొని వచ్చితిమి. నొప్పి త్వరగా బాగైపోవుటచేత రమారమి అంతయు మిగిలి-పోయినది."

విశ్వేశ్వరున కంతయు బోధపడినది. డాక్టరుగారి వంకను, ఇన్‌స్పెక్టరుగారి వంకను చూచుచు అతఁ డచ్చటనే నిలిచియుండెను. "ఈ సందర్భములో శవమును ఆసుపత్రికి తీసికొనిపోవుట నాకర్తవ్యము—మీా అభిప్రాయమేమి విశ్వే-శ్వర బాబూ?" అని డాక్టరడిగెను.

విశ్వేశ్వరుని దేహమున వణకు పుట్టినది; "వేఱుపాయ-మేదైన నున్నయెడల చెప్పుఁడు, నాకు సాధ్య మగునంతవఱకు నేను మిమ్ములను సంతోషపఱచెదను.

అన్న—13

ఇదె మాయింట జరిగినదనియే మీరు భావింపవలెను—— ఇట్టి యాపదలో మీరు నాకు సహాయము చేయరా?" అని మృదుస్వరముతో విశ్వేశ్వరుఁ డనెను.

"నాకెట్టి యభ్యంతరమును లేదు, సహజముగ వచ్చిన చావని నేనిప్పుడే వ్రాసి యీయఁగలను, మీరు ఇన్స్పెక్టరుగారిని కొంచెము లోఁబఱచుకొనుఁడు."

ఇన్స్పెక్టరును హస్తగతము చేసికొనుటకు చాల సేపు పట్టలేదు. ఆరోజులలో నచ్చట కలరా ప్రబలముగా నుండుటచే, కలరా వలన సంభవించిన మృత్యువది యని వ్రాసి డాక్టరుగారును ఇన్స్పెక్టరుగారును, సెలవుతీసికొనిరి. అంతయు నింతసులభముగా ముగియుట చూచి గ్రామస్థులకు మిక్కిలి అసంతుష్టి కలిగి అనేకవిధముల మాటలనుచు ఎవరియింటికి వారు పోయిరి.

కొందఱు తమసాధుత్వమును తెలియఁజేయుచు నతిదీనముగా విశ్వేశ్వరునితో మాటలాడుచు, అతనిని స్తోత్రముచేసిరి. తమ చేతులలో నిప్పుడేమియు లేదనుటకు అనేకప్రమాణములు చూపసాగిరి, ఉండిన యెడల వారింతవఱకూరకుండ వలసినవారా? ఇన్స్పెక్టరును, డాక్టరును సంతోషపఱచి అప్పుడే పంపివేసియుందురు——ఈ యింటిలో జరిగినదానిని గుఱించి ఎవ్వరికి తెలియకమునుపే అన్ని యేర్పాట్లును జరుపఁ గలిగి యుందురు. అక్కడి వారిలో కొందఱు, "ఈకర్చులన్నియు అతని పిన్ని చేతివి, ఈ గడుసబ్బాయి చేయ-

వలసిన దేమియు లేకుండెను, అతని పిన్ని చాల మంచి యామె," అని యన్నారు. మఱికొందఱు తమలో తామేమో ఆలోచించుచు, తల లూచుకొని, ఇఁక నక్కడ నుండిన యెడల శవమునెత్తవలసి వచ్చునేమోయని జడిసిరి కాఁబోలు, ఇండ్లకు పోవసాగిరి.

విశ్వేశ్వరుఁడు తన గుమాస్తాల నిద్దఱిని, చాలకాలము-నుండి అతనివలన సహాయముపొంది,అతనిమాటను మన్నించు-స్నేహితు నొకనిని పిలిపించి—ఈముగ్గురిని తీసికొనివచ్చి అంగణములో నిల్చుండఁబెట్టి తాను, గదిలో ప్రవేశించి, పిన్నిముఖము చూచుచు నొక ప్రక్కను నిలిచెను. అన్న-పూర్ణ ఏడ్చుచు మెల్లగా జాహ్నవితో నిట్లనెను—"వదినా మీా సతిని నాన్నగారియొడిలో నుంచి రావలెను, లెమ్ము. ఆమె కష్టములను మన మొక్కనాఁటికైనను నివారింపలేక-పోతిమి, కనుక ఆమె నాన్నయొద్దకు పోవుచున్నది. ఆఁడు-పిల్ల లితరులయిండ్లకు పోవలసినవారే కదా వదినా, మీాసతిని, భర్తగృహమునకు—"

"అట్లనకుమమ్మా, అట్లనకుము," అని జాహ్నవి యన్నది. "మాసతికి పెండ్లి యైనదనుకొనుచున్నావా? చితిపైనుండి-తెచ్చిన ఆముసలిశవము మాసతి మగఁడనుకొనుచున్నావా! కాఁదమ్మా కాఁదు. పెండ్లికాని కన్యక, నాసతి, తన నాన్న-గారి దగ్గఱకుపోవుచున్నది. ఆమల్లు పంచె విప్పించి చిన్నప్పుడు కట్టుకొనుచుండు ఢానిసీలాంబరిచీర కట్టించుము వదినా.

ఆచీరకట్టుకొని తండ్రిచేయి పట్టుకొని చిన్నప్పుడు ఇటునటు ప్రతిదిన మతనితో తిరుగుచుండెను. నల్లనిగాజులు తొడి-గించుము వదినా, నాసతిని విధవ వేషముతో పోనీయను— తండ్రి చూచిన యెడల నన్నేమనును ?"

అట్టి సమయమున జాహ్నవికి బుద్ధిచెప్పుట నిష్ప్రయో-జనమని యెఱిఁగి, అన్నపూర్ణ సావిత్రితో, "వచ్చి అమ్మకొక-మాఱు పట్టుకొనుమమ్మా," అన్నది. సావిత్రి తటాలున లేచివచ్చి సతి మృతదేహమును కౌఁగిలించుకొని, "అట్లనకు-మత్తయ్యా, మాఅక్క ఎన్నఁడు నెక్కడికిని పోలేదు, నేఁ డెక్కడికి పోవు నత్తయ్యా ? నేఁడు మమ్ముల నందఱిని విడిచి పోనేల?" అని యనుచు నేడ్వసాగినది.

చాలసేపటివఱ కేమియుననక చివర కన్నపూర్ణ జాహ్న-వితో నన్నది—"పోయినవారు పోఁగా, మిగిలియున్నవారిని చూచుకొన నక్కఱలేదా వదినా? లెమ్ము, వారు బ్రతికియుండు మార్గము చూడుము."

జాహ్నవి లేచి కూర్చుండి, ముసుఁగు ముందుకు లాగు-కొని సావిత్రిని ప్రక్కకు తొలఁగించినది; సతిని ఒడిలోనికి లాగుకొని ఆమె ముఖమును కొంచెముసేపు చూచి ముద్దు-పెట్టుకొని ఇట్లన్నది—"ఇఁక పొమ్మమ్మా సతీ, నాయొద్దను నీకు కష్టము తప్ప మఱియేమియు లేదు. నాన్నగారియొద్దకు పోయి, మఱల చిన్ననాఁటి సతివై అతనియొడిలో పరుండుము.

ఒక్కమాఱు "అమ్మా" అనఁగలవు తల్లీ? నిన్న రాత్రి నాకాళ్ల-దగ్గఱ పరుండి నాకాళ్లను నీవు తడుముచున్నప్పుడు నీవు నాయొద్ద సెలవు పుచ్చుకొనుచున్నావని నే నెఱుఁగకుంటిని, ఎఱిఁగియున్నచో "అమ్మా" అని ఒక్కమాఱనుమనియుందును తల్లీ. నేఁడు నిజముగా పోవుచున్నావమ్మా? ఇదిగో బాబూ విశ్వేశ్వరా, సతిని అందుకొనుము."

జాహ్నవి. నిజముగా సతిని విశ్వేశ్వరున కర్పించు-చున్నట్లు ఆమె క్షీణదేహమును తనచేతులపై నెత్తినది. అచ్చటనుండు ముగ్గురు బ్రాహ్మణు లాదేహమునందుకొని బయటికి తీసికొనివచ్చిరి. విశ్వేశ్వరుఁడు ముఖము వాల్చుకొని వారి వెనుకవచ్చెను. సావిత్రి పిచ్చిదానివలె పఱుగెత్తుకొని-వచ్చి విశ్వేశ్వరునికాళ్ళదగ్గఱపడి, ఏడ్చుచు, "విశూ దాదా, నీ కాళ్లు పట్టుకొనుచున్నాను, మాఅక్కను తీసికొని పోవద్దు, నాఅక్కను నాకిచ్చివేయుము—అక్కను నాకిమ్ము, ఇమ్ము, ఇమ్ము." అని యడుగసాగెను.

విశ్వేశ్వరుఁ డేడ్చుచు పిన్నిని పిలిచెను.

అన్నపూర్ణ బయటికి వచ్చి సావిత్రిని పట్టుకొని బలవం-తముగా లోనికి తీసికొని పోయెను. సావిత్రిని తల్లియొడిలో నుంచి, "ఈమెను కొంచెము చూడుము వదినా, ఆమెతోనీమె కూడ పోఁగలదు—నోటినుండి చొంగ వచ్చుచున్నది చూచి-తివా? పెద్దవదినా కొంచెము నీళ్లు తీసికొనిరమ్ము, కాళ విసనకఱ్ఱ

తీసికొని రమ్ము నాయనా" అని యనెను. జాహ్నవి సావిత్రిని పట్టుకొని, "సావీ, తల్లీ, సావీ!" అని పిలిచినది.

సావిత్రి, "అమ్మా—అక్కా—అక్కా—అక్కా!" అనుచు నేడ్వ సాగినది.

కాళీపదుని తోడ్చుకొని శవముతో విశ్వేశ్వరుఁడు ఏటియొడ్డునకు పోయెను. దేహము మిగుల కృశించి యుండుటచే సతిని ఇద్దఱు మోసికొని పోఁగలిగిరి. శవమునకు స్నానము చేయించి క్రొత్తబట్ట కట్టించి చితిపైనుంచి కాళీపదునిచే చేయించవలసినది చేయించిరి. అప్పుడు కాళీపదుని దూరముగ తీసికొనిపోయి మంచి మాటలతో నోదార్చిరి. విశ్వేశ్వరుఁడొక చెట్టున చేరఁబడి చూచుచుండెను. సతి వక్షఃపంజరమునుండి జ్వాలలు హూంకారము చేయుచు లేచుచున్నవి.



## పదునాల్గవపరిచ్ఛేదము.

జాహ్నవిని అన్నపూర్ణ తనయింటికి వచ్చి కొన్నాళ్లుండుమని చాల బలవంత పఱచినది. జాహ్నవి వినలేదు. "'ఆయన' ఈయింటిలోనే చనిపోయినారు, నాసతి ఈయింటిలోనే పోయినది—సతి యొక్క తెయే ఇంటిలో పడి యుండి, 'అమ్మా అమ్మా,' అని ఏడ్చుచుండ దానిని విడిచి నేను రాలేను వదినా," అని జాహ్నవి యన్నది.

ఎన్నాళ్ల క్రిందటనో మఱచిన అక్కకొడుకు మాట జ్ఞప్తికి వచ్చి పెత్తల్లి అతనియింటికి వెళ్లినది, కనుక కొన్నాళ్ల వఱకు అన్నపూర్ణ ఈయింటికి వచ్చి పండుకొనవలసి వచ్చినది. ప్రాణముల యెదుట మానాభిమానము లన్నియు నెగిరిపోవును కదా—ఈ యింట పండుకొనిన యెడల రాత్రి సతి వచ్చి పీక పిసుకునని పెత్తల్లికి భయమఁట. సతి దయ్యమయి ఈయింటికి రాదని బ్రహ్మ వచ్చి చెప్పినను పెత్తల్లికి నమ్మకము పుట్టదు. చిరస్నేహితురాలగు శాంతకూడ నీయింటికి వచ్చి ఇక్కడనే యుండి వారికి అన్ని పనులలో తోడ్పడుచుండెను.

నాల్గవనాఁటినుండి యథావిధిని కాళీపదునిచే కర్మ చేయించుట మొదలుపెట్టిరి. జాహ్నవి కోరిన ప్రకారము సతి సవతి కొడుకున కీసమాచారము తెలియఁజేయుచు కొంత సొమ్ముకూడ పంపి, విశ్వేశ్వరుఁడు కాళీపదుని మూలముగ,

శ్రాద్ధము పెట్టించెను. ఇట్లు చేసినగాని సతి తృప్తినొందదని జాహ్నవికి తోఁచినది.

విశ్వేశ్వరుఁడు పిచ్చివానివలె దినములు గడపుచుం-డెను. ఎన్నఁడు నూహింపని విపత్తు హఠాత్తుగ వచ్చి మీఁద పడునప్పుడు మన స్సేరీతిగ కలఁతఁజెందునో, విశ్వేశ్వరుని హృ-దయమీదుర్ఘటనవలన నారీతిగ కలఁతఁజెందినది. సతి హృద-యరక్తముతో నిండియున్న ఆ నోట్లను సావిత్రియొద్ద పుచ్చు కొని ఆ పాపాత్మునకు మఱల నిచ్చివేయవలెనని విశ్వేశ్వరునకు కోరిక పుట్టినది. ఆ హేయమగు వస్తువు సావిత్రి కడ చాల-రోజు లుండకూడదు. ఆరూపాయల విలువ సావిత్రి యెఱుఁ-గదు.

విశ్వేశ్వరుఁ డొకనాఁడు నదీతీరమునకుఁ బోయెను. దూరమునసుండు శ్మశానముపై అతని దృష్టిపడెను. నిర్వా-ణము పొందక ఆవైశ్వానర మప్పటివఱకు హూంకారము చేయుచున్న ట్లుండెను. ఆచితిలో కాలుచు సతి యింకను నిట్టూర్పులు విడుచుచున్న ట్లుండెను.

విశ్వేశ్వరుఁడు భయముఁజెంది గ్రామములోనికి మఱ-లెను. చాలసేపటివఱకు గ్రామ పథముల నిటునటు సంచా-రము చేసెను.

జమీందారుల యుద్యానవనమున గోష్ఠి సభ కూడి-యున్నది. జమీందారులు దశమినాఁటి వెన్నెలలో పుష్ప-సౌరభముతో నిండియున్న వాయువు, నారగించుచు తెల్లరాతి

మండపముపై కూర్చుండి, తబలా, హార్మోనియము, ఫిడేలు మొదలగువానితో గాన సభ జరుపుచున్నారు. విశ్వేశ్వరుని దృష్టి అటువెళ్లినది. అది చూడఁగా చూడఁగా పృథ్వి ఇంత-సౌందర్యమయ మైనదై యుండి కూడ దానిపై నుండు మానవులలో కొందఱి కింత దుఃఖమేల? కొందఱు సుఖసము-ద్రమున ఈఁతలుకొట్టుచుండ కొందఱాహారములేక ప్రాణ-ములు విడుచుచుండుటయేల? ఒకరి విషయమై ఒకరికి అక్కఱ లేకుండుటయేమి? ఒకరి దుఃఖమును గుఱించి ఒకరు తెలిసి-కొనకుండుటయేమి? అట్టిన నీయానందము, ఉల్లాసము, శోభ, ఐశ్వర్యము—ఇవియన్నియు పైశాచిక హాసమా? లోపుననుండు దైన్యమును దాఁచుచుండు కృత్రిమశోభయా ఇది యంతయు? ఆసంగీత మతనిమనస్సు నాకర్షించి యుంచలేక-పోయినది. అతఁ డక్కడనుండి తిరిగిపోయెను. ఆఘోర-మగు గానము వినఁబడకుండునట్టి దూరముగనుండు నొకతావు నతఁడు చేరఁగానే కరుణారస భరితమగు గానమొకటి అతి-మధురమగు ఫిడేలు వాద్యముతో కలసి అతని చెవినిపడెను. విశ్వేశ్వరుఁ డాగి అతిశ్రద్ధతో ఆపాటను వినుచు మిగుల ఆనందింపసాగెను.

జననీ రమ్మా! శరణంబిమ్మా!
అద్దరిజేర్చి న్నా కాశ్రయమిమ్మా!
కామితంబులవి సిద్ధింపక నే,
యాశోఘంబులవి ఫలమందక నే,

నాదుజీవమిల ముగియఁగనున్నది—
సర్వంబును నంతంబగుచున్నది!

విశ్వేశ్వరునితల తిరుగుట మొదలుపెట్టినది. జాలి-పుట్టించుచుండు ఈపాట ఈయుత్సవదినమున నెవరు పాడు-చున్నారు? ఆపాటలో శరీర విముక్తులైన ఆత్మలెన్నియో కలిసి తమదుఃఖమును వ్యక్తపఱచుచున్నవని పాటపాడు-చుండినవాఁ డెఱుఁగునో లేదో?

పృథ్వినెవరునను ప్రేమింపరు, యీ
పృథ్వికి ప్రేమము తెలియదు, తల్లీ!
ప్రణయనిలయమగు తావకకౌఁగిలి
జేరగనాహృది తత్తరపడియెడు!

విశ్వేశ్వరుఁడు కనుల నీరు పెట్టుకొనెను. కరుణాహీనమగు ఈపృథ్విపై ప్రేమ యనునది నిజముగా నున్నదా? ఎవరు తమ-జీవనములను ఎవరిపాదములకు సమర్పించి అంతర్ధాన మగు-చున్నారో ఎవరైన తెలిసికొనఁ గోరుచున్నారా? సతి ఈరీతిగ తనప్రాణముల నర్పించెనని విశ్వేశ్వరుఁ డెఱిఁగియుండెనా? ఆమె యతనిని నమస్కరించి పృథ్విని విడిచి వెడలినది— ఆమెయాత్మకు వాంఛిత వస్తువు దొరకినదా? అతని హృదయ-మున నిప్పుడు పొంగి పొరలుచుండు అనుభూతి, ప్రేమ— ఇవియా ఆమెకోరినది—ప్రేమయనున దిదియేనా? ప్రపంచ-మున నట్టిసుశీలత, సహనము, సౌందర్యముగల బాలిక యెవరైన మఱియొకతె, తిండికి లేక కష్టపడుచు రాత్రిం-

బగళ్లు విచారగ్రస్తురాలై పాపాత్ముఁ డెవఁడో చేయు దుష్కృ-త్యములకై బాధచెందుచు ఎవరో ఒకనిని తనలో తాను ప్రేమించుచు ప్రాణత్యాగముచేసిన యెడల, దానినిగుఱించి ఎఱిఁగియుండికూడ విశ్వేశ్వరునిలో నిప్పుడు పుట్టుచుండునట్లు-వలె నేడ్పు పుట్టకయుండునా? భరింపరాని బాధ అతని హృదయమున నిప్పటివలె నుండకపోవునా? సామాన్యమగు పుస్త-కము చదివి అందు వర్ణించియున్న ఘటన దుఃఖముఁజెందుచున్నము. నిజముగాజరిగిన యిట్టిఘటనవలన మనస్సు కరఁగకుండునంత నిర్దయుఁ డెవ్వఁడైన నీప్రపంచములో నుండునా?

కోరికలన్నిటి నేఁ ద్యజియించితి,
కామితంబులవి కల్లలెంచితి
దుఃఖపూర్ణ హృద్భాండము వగులగ
మీరరాని పరితాపము నొందితి
ప్రణయసీమ, జననీ! యిటుగనుమా.
ఒక్కసారి యీ ధాత్రికి రమ్మా,
దుర్భరమగు నీదుఃఖభారమున
క్రుంగిననను నీయొడి నిడుకొనుమా!

విశ్వేశ్వరుఁ డస్ఫుటకంఠముతో "మంచిపని చేసితివి సతీ! ఈప్రపంచము తప్పించుకొని పాఱిపోతివి!" అని యనెను.

పాట ఆగినదే కాని దానిలోనుండు రోదన మాత్ర మాగక గాలియందు సంచారము చేయుచున్న ట్లుండెను.

అక్కడ నిలిచియుండుట కష్ట మనిపించి విశ్వేశ్వరుఁడు మెల్ల-మెల్లగ ముందుకు పోవసాగెను.

విశ్వేశ్వరుఁడు కొంతదూరము రాఁగానే నిండు వెన్నె-లను, కూలిపడుటకు సిద్ధముగ నున్న భట్టాచార్యుల యింటి-ద్వార మతని కంటఁబడెను. సిరిలేని ఆయంగణమున నది విధవవలె నతనికి కనఁబడెను. విశ్వేశ్వరుఁడు మెల్లగా అంగణ-మున ప్రవేశించెను. తులసికోట యెదుట, దీపము పెట్టి చేతులు జోడించుకొని మోకాళ్లపై వ్రాలి ఎవరో ప్రణా-మము చేయుచున్నారు. ఎవరది? సతియా? సతివలెనే యున్నది—ఆవిరియఁబోసియున్న జుట్టు, సన్నని దేహము, చిరిగియున్న చీర, వాల్చియున్న తెల్లని ముఖము—ఏది చూచినను సతివలెనే తోఁచి, ఒక్కమాఱు "సతీ" అని పిలువ వలెనని విశ్వేశ్వరునకు బుద్ధి పుట్టినది, కాని కంఠములోనుండి మాట బయటికిరాలేదు. అతఁడు నిశ్చేష్టుఁడై నిలుచుండి యుండెను.

తులసికోట యెదుట వ్రాలియున్న యామె నెమ్మదిగా లేచినది, లేవఁగానే విశ్వేశ్వరుఁ డామెకంటఁ బడెను—ఆశ్చర్యమొంది మెల్లగా, "ఎవరది?" అని ఆమె యడిగినది.

విశ్వేశ్వరుఁడు కంఠము పోల్చుకొని, "సావిత్రీ?" అని పిలిచెను.

"ఎవరు? విశుదాదాయా? మీరా వచ్చినారు, అమ్మను పిలువనా?"

సావిత్రి కంఠము వినఁగానే విశ్వేశ్వరుని హృదయము కరిగి కన్నీరు కాలుట మొదలుపెట్టినది; విశ్వేశ్వరుఁడు నెమ్మదిగా నామెతో, "వద్దు సావిత్రీ, నీతో నొకమాట చెప్పవలసియున్నది, వినుము," అని యనెను.

సావిత్రి అతని వైపు చూచుచు నిలుచుండెను.

"అక్క నీ చేతి కేమైన నిచ్చిపోయినదా సావిత్రీ?"

"ఇచ్చినది, చాలనో కొలక్కడనో అక్కకు దొరకినవి, వాని నామె నాచేతి కిచ్చినవి."

"అవి అన్నియు నున్నవా, ఒక్కటైనను కర్చు చేయలేదా?"

"ఒక్కటైన ఖర్చు చేయలేదు."

"అవి తెచ్చి నా కిమ్ము."

సావిత్రి గదిలోనికి పోయి రెండు నిమిషములలో మాటల బయటికి వచ్చి విశ్వేశ్వరునిచేతిలో నోట్లకట్ట యొకటి పెట్టినది. అవి పుచ్చుకొనఁబోవ విశ్వేశ్వరుని హృదయమున నాందోళన పుట్టినది, కాని అది పోల్చుకొననియెడల సతి ఏమనుకొనునో యని ఊహించి యతఁడు మనస్సును స్తిమితపఱచుకొని ఆనోట్ల నందుకొనుచు, "మీఅమ్మ వీని సమాచార మేమైన నెఱుఁగునా?" అని యడిగెను.

"ఎఱుఁగదు, ఒకనాఁ డెప్పుడో చెప్పవలెనని అనుకొన్నాను."

"తెలియదంటివి కావా? అట్లైన నీకు చెప్పకుము. ఎవరి రూపాయలు మీ అక్కకు దొరకినవో వారికి ఆరూపాయలు మఱల నిచ్చెదను."

సావిత్రి మెల్లగా తలయూఁపి సమ్మతిని తెలియఁజేసినది. సావిత్రి మిగుల దుఃఖించుచున్న దనియు, లేచి ఇటునటు తిరుగుచుండ లేదనియు, తిండి తినుచుండ లేదనియు, ఎవరితోను మాటలాడుచుండదనియు విశ్వేశ్వరుఁడు పిన్ని చెప్పఁగా విన్నాఁడు. జాహ్నవి ఆమె మనస్సును త్రిప్పుటకు చేసిన ప్రయత్నము లన్నియు నిష్ఫలము లైనవఁట. సావిత్రిని కొంచెమోదార్చుటకై రెండుమాట లాడవలెనని విశ్వేశ్వరునికి కోరికకలిగి "అక్కడ కూర్చుండి నీవేమి చేయుచుంటివి సావిత్రీ?" అని యతఁ డడిగెను.

"తులసికోటయొద్ద దీపముంచుటకు పోతిని."

"చేతులు జోడించి ఏమో అనుచుంటివి?"

సావిత్రి తలవాల్చుకొని నెమ్మదిగా ప్రత్యుత్తర మీయసాగెను——"ఆత్మహత్య చేసికొనినవారికి సద్గతి లభింపదని విన్నాను, కనుక తులసికోట యెదుట దీపముంచి ఇంతవఱకు——"అని మఱియేమియు ననలేక పోయినది.

బాలిక నేత్రములనుండి యేవిధముగ నశ్రుధారలు ప్రారంభమైనవో విశ్వేశ్వరుని నేత్రములనుండి కూడ నదియేవిధముగ ప్రవహించినవి. చాలసేపటివఱకు కట్లూరక నిలిచి

చివరకు విశ్వేశ్వరుఁడు కంఠము సవరించుకొని, "మీయక్క స్వర్గమున నున్నది సావిత్రీ, ఆమెవంటి పుణ్యాత్మురాలు దుర్గతి పొందఁగలదా? నీవట్టి మాటను నమ్మఁగలవా సావిత్రీ?" అని యడిగెను.

"అక్క స్వర్గమునకు వెళ్లినదని మీ రనుచున్నారా? ఆమె అక్కడ క్షేమముగ నున్నదా?"

"ఆహా, క్షేమముగ నున్నది."

సావిత్రి ముడుకులపై వ్రాలి విశ్వేశ్వరునిపాదములకు ప్రణామము చేసినది. తరువాత నెమ్మదిగా, "అట్లైన నేను మఱి యేడ్వను; అక్క మమ్ముల నందఱను విడిచిపెట్టి పోయినది, మమ్ములను మఱచి పోవచ్చును—అందులో దుఃఖింపవలసిన దంతగా లేదు. ఆమె సుఖముగా నున్నది—అంతే చాలును," అని యన్నది.

ముత్యములధారవలె సావిత్రి నేత్రములనుండి అశ్రుబిందువులు పడసాగెను. విశ్వేశ్వరుఁడు సావిత్రిని అట్టియవస్థలో విడిచి వెళ్లలేక పోయెను, సావిత్రి అచ్చటనే పడి యేడ్చుచుండునేమో యని భయపడెను. కొంతసే పాలోచించి, "అమ్మ యెక్కడ? కాశీ ఎక్కడ?" అని యడిగెను.

"అమ్మ కాశీని పరుండఁబెట్టుచున్నది, వాఁడు రాత్రింబగళ్లు, 'అక్కా, అక్కా' అని యేడ్చుచుండును, ఎంత యోదార్చినను ఊరకుండఁడు."

"నీవు కూడ చాల ఏడ్చుచున్నావు సావిత్రీ, ఏడ్చుట-వలన నేమి ప్రయోజనము, అక్క తిరిగి వచ్చునా? దానివలన అమ్మకు దుఃఖ మధికమగుచుండుట తప్ప వేఱు లాభము లేదు." సావిత్రి తలవాల్చి వెక్కి వెక్కి యేడ్చుచు, "నేనెప్పుడును అక్కను విడిచి యుండలేదు," అన్నది.

"శాశ్వత మిత్రులనుకూడ మఱువవలసి వచ్చుచుండును; ఇదియే లోకమున జరుగుచుండు క్రమము."

"ఇంత త్వరగా నేనెట్లు మఱవఁగలను? అక్క స్నేహి-తురాలు 'కమల' నేఁడు వచ్చినది, ఆమె యక్కను విడిచి చాలకాల మైనది, ఐనను అక్కమాట చెప్పుచు ఏడ్చి యేడ్చి జీర్ణించిపోయినది—ఆమెయే అక్కను మఱవలేకున్నప్పుడు నేనెట్లు మఱవఁగలను?"

"ఎవరు వచ్చియుండిరంటివి? నరేన్ భాదురీ భార్యయా? ఆమె చాల కష్టపడుచున్నదని విన్నాను, నిజమే" అని విశ్వే-శ్వరుఁ డడిగెను.

నరేంద్రుని పేరు చెప్పఁగానే అతనిపైనే కాక, అతనితో బాంధవ్యముగలవారందఱిపైనిఁగూడ విశ్వేశ్వరునకు కోప-మువచ్చినది. కాని సావిత్రి అనినమాటలు విని అతని మనస్సు కరిగినది—సావిత్రీ, "కమలక్క భర్త మంచివాఁడు కాఁడని విన్నాను, ఆమెను చాల బాధపెట్టుచుండునఁట. కమలక్క మాట యనుచు అక్క తలఁచుగా కనుల నీరు పెట్టుకొను-

చుండెను. కమలక్కయెడల అక్కకు మిగుల ప్రేమ," అని యనినది. సావిత్రి మాటలు విశ్వేశ్వరునకు అనేక దినములక్రిందట నొకనాడు జరిగిన సమాచారము జ్ఞప్తికి తెచ్చినది— తాను కమలను పెండ్లియాడ వలెనను విషయమును గురించి పతికిని తనకును సంభాషణ జరిగినది. ఆమాటలు నేఁ డతని హృదయమున బాధ కలిగించినవి.

జాహ్నవి గది తలుపునొద్దకు వచ్చి, "సావిత్రీ, ఎవరితోనమ్మా మాటలాడుచున్నావు?" అని యడిగెను.

"విశు దాదాతో," అని సావిత్రి ప్రత్యుత్తరమిచ్చెను.

"విశ్వేశ్వర్ ! ఇంటిలోనికి రమ్ము నాయనా."

విశ్వేశ్వరుఁడు మెల్లఁగా నామె దగ్గఱకువచ్చి ఆమెకు నమస్కరించెను. జాహ్నవి యెదుట ఊపిరి నిలిచిపోయినంతకష్టముగ నుండి, అతఁ డామెయొద్ద సెలవు తీసికొని త్వరలో వెడలెను.

మఱునాఁడు తెల్లవాఱు జామున నే లేచి విశ్వేశ్వరుఁడు చాంద్ పూరునకు బయలు దేఱెను. నరేంద్రుఁ డుదయము వాయు సేవనమునకు బయలుదేరుటకు పూర్వమే అతనిని కలసికొనవలెనని విశ్వేశ్వరుని యుద్దేశము.

కొద్ది నిమిషములలో జమీందారుగారి హృదయహీనమగు పాషాణసౌధము విశ్వేశ్వరుని కంటఁ బడినది. విశ్వేశ్వరుఁడు తలవంచుకొని గేటునొద్దకు వచ్చెను. జమీం-

దారుగారు బయటి యుద్యానవనమున నొక బెంచిపైఁ-
గూర్చుండి గాలి సేవించుచుండిరి. మనస్సున నేదో దుఃఖ-
మున్నట్లు అతని ముఖము మిగుల కళాహీనముగ నుండెను.
విశ్వేశ్వరుఁడు లోనికివచ్చి అతని యెదుట నిలిచెను. జమీం-
దారుగా రాశ్చర్యమొంది "ఎవరు మీరు?" అని యడిగిరి.

"నాపేరు విశ్వేశ్వర మైత్రేయుఁడు. నే నుండునది
మజుత్ పూర్."

"మిమ్ములను నే నెచ్చటనో చూచినట్లున్నది; కూర్చుం-
డుఁడు."

"చూచి యుండవచ్చును. అందులో నాశ్చర్య మేమి-
యున్నది. మీరు మజుత్ పూరు షికారుగా తఱచుగా
వచ్చుచుందురు—ఎప్పుడో నేను మీకంటఁబడి యుండ-
వచ్చును."

నరేంద్రుఁడు కొంచెము తడఁబడుచు, "ఏపని మీఁద
వచ్చినారు?" అని యడిగెను.

"పని యున్నది, రహస్యమగు స్థలమునకు పోయి చెప్ప-
వలెను."

"ఈస్థల మట్టిదే, ఏమి చెప్పవలసియున్నను చెప్ప-
వచ్చును."

విశ్వేశ్వరుఁడు మఱియేమియు ననక జేబులోనుండి
నోట్లకట్ట యొకటి తీసి నరేంద్రుని చేతి కిచ్చుచు, "మీ-

నోట్లివి, లెక్కచేయుడు, అవి వేయిరూపాయలు," అని యనెను.

నరేంద్రుడు తెల్లబోతి నిశ్చేష్టుడై విశ్వేశ్వరుని వంక చూడసాగెను. విశ్వేశ్వరుడు మఱియొకవైపు ముఖము త్రిప్పి యుండెను. కొంతసే పూరకుండి నరేంద్రుడు, "మీరు వేఱువిధముగ భావింపనిచో మీ కొకమాట యడుగవలెనని యున్నది," అని యనెను.

"అడుగ వచ్చును," అని విశ్వేశ్వరు డనెను.

"ఈనోట్లు మీ కెక్కడ దొరకినవి?"

"మీ రెవరి కిచ్చితిరో ఆమె నాచేతి కిచ్చినది. ఆమెను మాకుటుంబములోనిదానిగ నేను జూచుచుంటిని."

"ఆమెయా? ఆమె మీ కిచ్చినదా! ఆమె చనిపోయిన-దని విన్నాను?"

"చనిపోయిన దనుట సరియైన వార్తకాదు—ఆమె ఆత్మహత్య చేసికొనినది."

"ఔనౌను, వదంతికూడ నదియే—ఆ యాత్మహత్యకు కారణము మీ రెఱుగుదురా?"

"ఆహా, ఎఱుగుదును, మీకు సందేహమేల? దానికి కారణమిదిగో, ఈనోట్లు; మీచేతనున్న నోట్లే ఆమె మరణ-మునకు కారణము. మీయొద్ద నివి పుచ్చుకొనవలసి వచ్చినది; పుచ్చుకొని మీచేతులలోనుండి యీరీతిగ తప్పించుకొనినది."

"అట్లైన మీకు చాలసంగతులు తెలియును, మీతో దాఁగుడుమూఁతలాడి లాభము లేదు. కాని నాపై మీరన్యాయముగ దోషారోపణము చేయుచున్నారు. ఆమె నోట్లు పుచ్చుకొనని యెడల నాబల మేమిచేయఁగలదు? నేను— నేను బలము ప్రయోగించలేదు, ఆమె—"

"నోరు మూయుము, నోరు మూయుము, పాపీ నోరెట్లు వచ్చుచున్నదఁ మాటలాడుటకు. నీహృదయమున కంపము పుట్టుటలేదా? నీజాలమున వేసికొనుటకై ఎన్నిమారులు లామెకొలకు పోతివో జ్ఞప్తిలేదా? గొప్పయింటి పిల్లవాఁడవు కదా నీవు! లంజెలతో కాలము గడపుచున్నావు నిజమే, కాని, నీ అక్కచెల్లెండ్రు, నీతల్లి, నీభార్య సుఖములుకూడ నీకంటఁబడుచుండుటలేదా? కులవంతుల యింటి యాఁడుబిడ్డ ఇట్టి పాపకృత్యమునకు సమ్మతింపదని నీ వెఱుఁగవా? సమ్మతించువారు భరింపరాని దుఃఖమున నున్నప్పుడు సమ్మతింతురు. ఆమె తన తల్లి, తమ్ముని, చెల్లెలి, ప్రాణములను నిలుపుటకై నీరూపాయలు పుచ్చుకొనుట కంగీకరించినది. కాని ఆమెది అట్టిపుట్టుక కాదు. కనుక తప్పించుకొని స్వర్గమునకు పాఱిపోయినది. ఇదిగో నీసొమ్ము నీవు తీసికొనుము—దుఃఖితుల దుఃఖమును తొలఁగింపఁగల ధనము, ప్రాణములేనివారికి ప్రాణమీయఁగల ధనము నీచేతిలోపడి అమూయికయగు నొక సాధ్వీమణి ప్రాణమును అకాలమున హరించినది. ఛీఛీ పాపాత్ముఁడా, నీకంటె నధముఁ డెవ డుండునురా, నీవాంఛల-

కంటె హేయమగు వాంఛ లెవరికుండునురా? కాని జ్ఞప్తి. యుంచుకొనుము — పాపవాంఛలపాలై స్త్రీహత్య చేసితివి. ఈజన్మమున నీకిఁక శాంతిలేదు. నీపాపము సదా నీవెనుకఁ-దిరుగుచు నిన్ను నరకమునకు ఈడ్చుకొనిపోవును."

నరేంద్రుఁడు స్తంభితుఁడై కూర్చుండెను; అతనికి దేహమంతటను చెమట క్రమ్మెను. ఆపాపి నాలుగువైపు-లను చూచి భయపడుచు మెల్లఁగా నిట్లనెను—"నే నంత తప్పేమి చేసితిని? నన్నేమి చేయుమన్నారు? ఇట్టిది జరుగ వచ్చునని యూహింపఁ గలిగినచో నే నెన్నఁడైన నట్లు చేసి-యుందునా?"

"కులవంతుల గృహమునఁబుట్టి కులవంతుల గృహమున నుండు స్త్రీల స్వభావ మెఱుఁగనివాఁడు మనుష్యుఁ డనిపించు-కొనఁబగునా. తల్లికొఱకు, చెల్లెలకొఱకు, తమ్మునికొఱకు— ఈవిధముగ ప్రాణత్యాగము చేయఁగలవారు నీకంటె నెంత ఉచ్చమైన తరగతికిఁ జెందినవారో యోచించిచూడుము. ఎట్టి పాపము నెఱుఁగని నారీమణిని చంపిన నీకు, ఈజన్మమున సద్గతి లభించునను నాశ ఉన్నదా నరేంద్రా? ఎంత పాపాత్ముఁడవు నీవు!"

నరేంద్రుఁ డేమియు పలుకలేదు. అతఁడు మోసపోతి-నని పోల్చుకొనిన, కొద్దిరోజులకు సతి మరణమును గుఱించి విని కొంచె మనుతపించెను. ఆ యనుతాప మిప్పుడు పూర్తి-యైనది. కొంతసేపైన తరువాత విశ్వేశ్వరుఁ డిట్లనెను—"హరి

మీయింటచేరి బాబుగిరి నేర్చుకొనుచున్నాఁడని విన్నాను, వాని నొకమాఱు పిలువుము."

నరేంద్రుఁడు మరబొమ్మవలె అతని యాజ్ఞను పాలించెను. తనయింటిలో జరిగిన దుర్ఘటనను గుఱించి నలుగురు ననుకొనుచుండఁగా హరి విన్నాఁడు; దుఃఖభరితమగు ముఖముతో నతఁడచ్చటకు వచ్చి నిలిచెను.

విశ్వేశ్వరుఁడతనిని ప్రేలితో చూపించుచు నరేంద్రునితో నిట్లనెను—"ఇతఁడా మీనాటకములలో స్త్రీవేషము వేయువాఁడు? ఇతనిని నీవిఁక విడిచిపెట్టవలెను. తల్లియు, చెల్లెలును, ఇతని కొఱకై ఇప్పటికిని కనుల నీరు పెట్టుకొనుచున్నారు. ఆ కన్నీరు నిన్ను మఱింత త్వరగా నాశనము చేయును. ఇప్పుడే ఇతనిని మీయింటనుండి పంపివేయుము."

"తీసికొని పొండు, అతనిని మీతోనే తీసికొనిపొండు. నేనిఁక నాటకము లాడించను, నాటకశాల మఱియుంచను. ఈనాటకములే నన్నీదశలోనికి తీసికొనివచ్చినవి. లేకున్న నేను చెడ్డవాఁడను కాను, మీ రెఱిఁగియే యుందురు."

"నే నెఱుఁగుదును. నీభార్య కమలయు, సతియు, అట్టిబాలికలు మఱికొందఱును నాకు చెల్లెండ్ర వంటివారు. గుణవతియగు నీభార్య నీ వ్యవహారమును చూచి మిగుల దుఃఖించుచున్నదని వినుచున్నాను—ఆమెకూడ నేఁడో రేపో ఆత్మహత్య చేసికొని నీ పాపమును రెండింతలు చేయును.

నరేంద్రుఁడు ముఖము వాల్చి నిలుచుండెను. విశ్వేశ్వరుఁడు హరివైపు చూచుచు, "నీవు నాతో నింటికి రావలెను," అని యనెను.

హరి మిగుల దీన నయనములతో నరేంద్రుని వైపు తిరిగి యిట్లనసాగెను. "నరేన్ బాబుగారూ, మీరు నన్ను—" అతనిని మాట పూర్తి చేయనీయక నరేంద్రుఁడు ప్రత్యుత్తర మిచ్చెను—"ఆహా, వెళ్లుము. మీరందఱును నన్ను మఱింత పాడుచేసితిరి. మీరు చేసినది చాలును, నాకిఁక నాటకము లక్కఱలేదు. నాయింటినుండి పొమ్మిఁక."

అవమానము పొంది ముఖమెఱ్ఱఁగఁ జేసికొని హరి జమీందారుగారి యిల్లువదలి మెల్లఁగా బయటికి వచ్చెను. విశ్వేశ్వరుఁడు కూడ లేచి, "నరేన్ నేను పోవుచున్నాను. నీతో నేను చెప్పవలసినది మఱి యేమున్నది? నీవు చంపిన సతికిని నీభార్య కమలకును నొక్కటేప్రాణము—అంత యన్యోన్యానురాగముండెను. వారిలో క్షమింపమని నీవిప్పుడు సతినిఁ గోరుచున్నచో కమల దుఃఖమును తొలఁగింపుము—ఇంతే నేను చెప్పవలసినది." అని యనెను.

విశ్వేశ్వరుఁడు బయటికి వచ్చి, "నీ వెక్కడికిఁ బోవుచున్నావు హరీ?" అని హరి నడిగెను.

మఱి యెక్కడికి పోయెదను! గొప్పవారి యాశ్రయము నాకిఁక నక్కఱలేదు! అతని నాటక సమాజాభివృద్ధికొఱకు నేనెంతో పాటుపడితిని. దానికి ప్రతిఫలముగా నాకెట్టి యవ-

మానము దొరకినదో మీరు చూచితిరి. ఒక్కమా రింటికి పోయి అమ్మను చూచి కండ్ల కేదారి కనఁబడునో ఆదారినే నడిచి పోయెదను."

"నీవట్లు పో నక్కఱలేదు. అమ్మను సుఖపెట్టుచు నీగ్రామములోనే పౌరుషముతో తలయెత్తుకొని తిరుగుచు నుండవచ్చును. ముఖస్తుతి చేయుచు వీనివెంట, వానివెంట తిరుగుట మాని మంచి యింటఁ బుట్టినవానివలె పనిపాటులు చేసికొనుచుండిన నీకు తోడ్పడువా రనేకు లుందురు."



## పదునైదవపరిచ్ఛేదము.

భట్టాచార్యుని ప్రాతయింటి మరమ్మత్తు మెల్లమెల్లగా పూర్తియైనది. ఈయిల్లు భట్టాచార్యుల వంశమువారి చేతులలోనికి వచ్చినతరువాత రామశంకరుని తండ్రికాలమున ఈయింటికి ఒకమ్మాఱు సున్నము వేయుట జరిగినది. అప్పటినుండి ఇంటిపై నేపనివాని చేతులును పడలేదు—కనుక ఈమరమ్మత్తులో నది చాల సామగ్రి మ్రింగినది. జాహ్నవి విశ్వేశ్వరుని వారించినది. విశ్వేశ్వరుఁ డేమియు ననలేదు, కాని, అన్నపూర్ణ జాహ్నవికి ఉత్తర మిచ్చినది—"అట్లైన మీ రీయింట నుండకూడదు; ఈయి ల్లేనాఁడో కూలిపడును; అందఱమును మనయింటికి పోదము రండు." ఈమాటలు విని జాహ్నవి ఊరకుండవలసి వచ్చినది.

భట్టాచార్యులవారి యింటి సిరి పెంపొందుట చూచి పేటవారి మనస్సులలో నీర్ష్యజ్వాలలు పుట్టినవి. వారియిల్లు క్రొత్తదైనది. వారికి రోజు లెట్టికష్టము నెఱుఁగక గడచుచున్నవి. హరికూడ మఱల నింటికి వచ్చెను. అతఁడు బుద్ధిగా ప్రవర్తించుచు విశ్వేశ్వరుని పనిపాటులలో తోడ్పడుచున్నాఁడు, హరినిగుఱించి మాటలాడుట యను మిషపైనైనను జాహ్నవికి దుఃఖము కలిగించుటకు మునుపటివలె నవకాశము ఇరుగుపొరుగుల వారికి చిక్కకున్నది. అట్టి-

వారి చేతిలో నిప్పటికిని గల యుపాయములు రెండే—
చనిపోయిన సతిపేరెత్తి ఏదో ప్రేలుచుండుట లేక బ్రతికి-
యున్న సావిత్రిపై నేదో యపవాదములు సృష్టించుట.
"విశ్వేశ్వరుఁడు ఇంటికి అల్లుఁడు కాఁబోవు చున్నాఁడు,
కనుకనే ఈయింటికిని అతనికిని అంత యాకర్షణ," అని
కొంద ఱనుచుండిరి. "పైకి చాటించుచు అందఱు నెఱుఁగు-
నట్లుగా అల్లుఁడగుట మేలు, రహస్యముగ నల్లుఁ డగుటవలన
వచ్చుచిక్కు లనేకములు," అని వారిలో తెలివితేటలు గల-
వా డొకఁడు కండ్లు చికిలించుచు ననెను. ఇట్లుండ విశ్వేశ్వ-
రుఁడు సావిత్రికొఱకై మంచివరుని చూచుచున్నాఁ డనియు
రాఁబోవు శ్రావణమాసమున సావిత్రి వివాహమనియు
తెలియఁగానే అందఱి యామోదమునకును భంగము కలిగినది.

ఉత్సాహహీనమగు విశ్వేశ్వరుని మనస్సున కొంచెము
వేఁడి పుట్టింపఁ గోరుచు అన్నపూర్ణాదేవి విశ్వేశ్వరునితో
ని ట్లనెను—"ఇంకను నాలస్యము కానీయకు మమ్మా విశూ,"
చూచుచుండఁగనే సావిత్రికి పదునైదేండ్లు వచ్చినవి.
పిల్లనోటితో నేమియు ననదు. కాని లోలోపున క్రుంగి-
పోవుచున్నది. "వరునికొఱకు గట్టిప్రయత్న మొకటి
చేయుము."

"నేను ప్రయత్నము చేయుచుండుట లేదా పిన్నీ?
కాని మంచి వరుఁడు కావలెనుకదా. ఎంతో వెనుకగా వెదుకగా
నేఁడొకఁడు దొరకెను. అతనియొద్దనుండి జాబొకటి ఇప్పుడే

వచ్చినది. అతఁడు విద్వాంసుఁడు, రెండుమూఁడు పెద్దపరీక్షలు ప్యాసైనాఁడు, మంచివంశము, స్థితిగతులు మంచివి. పిల్లవాని-తండ్రి బ్రతికియున్నాఁడు—ఏమి పిన్నీ, అట్టివాఁడు తగిన వరుఁడేనా?"

"నీవు చెప్పినదానినిఁ బట్టిచూచిన మంచి సంబంధము-వలెనే తోఁచుచున్నది. కాని సరియైన సమాచారము సంపా-దింపనిదే ఏమియు నిశ్చయింపకుము. తొందరపడి తరువాత విచారింపఁగూడదు."

"నీవు భయపడకుము పిన్నీ, నేను జాగ్రత్తగానే యుందును."

"అట్లైన సరియే, కాని వరుఁ డెంతకట్నము కావలె-ననును విశూ?"

విశ్వేశ్వరుఁడు నవ్వుచు జవా బిచ్చెను. "అట్టివరుఁడు రూపాయలీయక దొరకునా? డబ్బు ధారాళముగ కర్చుచేయ-వలసి యుండును పిన్నీ, సందేహమేల? కాని దానిని గుఱించి ఇప్పటినుండి యోచనయేల, పెండ్లినాఁడు వినెదవు గాని, నీ రూపాయల పెట్టె మాత్రము నా చేతి కొప్పఁజెప్పుము పిన్నీ."

పిన్ని కోపగించుచు, "పో! అన్ని విషయములలోను నీకు కుఱ్ఱతనమే. సరే, ఏది యెట్లైన ఆలస్యము మాత్రము కానీయకుము."

నిధితల్లి అన్నపూర్ణ దగ్గఱ కూర్చుండి మామిడిపండ్లు వరుసగా పేర్చుచుండెను. నడుమను పని యాపి, "ఔనమ్మా.

అట్టైన బాబుకు ఎప్పుడు పెండ్లి యగును? బాబు పెండ్లి చేసి-కొననే చేసికొనండా?" అని అన్నపూర్ణ నడిగినది.

అన్నపూర్ణ విశ్వేశ్వరుని వైపొకమాఱు చూచి తల-వంచి, "నాకేమి తెలియునమ్మా! ఆసంగతి భగవంతునికి తెలియ-వలెను. బాబుకు తెలియవలెను," అని యన్నది.

నిధి తల్లి మిగుల నాశ్చర్యముం జెంది, "ఇది యెచ్చటను చూడలేదమ్మా! పెద్దవారి పద్ధతులు వేరు నిజమే. కాని ఇప్పుడు అబ్బాయికి వయస్సేమి తక్కువా!" అని యన్నది.

నిధి తల్లిని ఎగతాళి చేయవలెనని విశ్వేశ్వరుఁ డను-కొనెను గాని హఠాత్తుగ పిన్ని ముఖమున దుఃఖ మతనికి కనఁబడుటవలన అతఁ డూరకుండవలసి వచ్చినది. పెండ్లి-మాట వచ్చి విశ్వేశ్వరుని గుఱించి జాలిపడుచు మును పెవరైన నేమి యన్నను, లేక జాలిపడుచు అతని వైపు చూచినను అతని మనస్సు మెత్తఁబడునది కాదు. కాని నేఁడు అతని-మనస్సు కరిగినది. పిన్ని దుఃఖము చూచి నేఁ డతనికి హఠా-త్తుగ బాధ కలిగినది. 'సామాన్యమగు నిట్టి విషయమును-గూర్చి మాతృసమానురాలైన పిన్నిహృదయమున కెంత-దుఃఖము కలిగించుచున్నాను, ఎంతదుఃఖము నిప్పటివఱకు కలిగించుచుంటిని!' అని విశ్వేశ్వరుఁడు తనలో తా ననుకొనెను. ఈయాటవలన అతనికిమాత్ర మేమి సుఖము గలిగినది, పిన్ని మనస్సునకు కష్టము కలుగుచుండెనని విశ్వేశ్వరుఁ డెన్నఁ-డును దుఃఖింపనైనను లేదు. అతని యవివేకఫల మెంత

శోచనీయమైన దాయెను! ప్రపంచమంతయు ఏనియమముల నాచరించి వచ్చుచున్నదో ఆనియమములనే తానుగూడ నాచరించుచు నడుచుకొనుచుండవలె ననియు, తల వెండ్రుక వాసి ఇటుగాని యటుగాని జరిగినచో కాలచక్రము మిగుల నిర్దయతో నలిపివేయుననియు నేఁడకస్మాత్తుగ విశ్వేశ్వరునకు బోధపడినది.

కాని యిప్పుడు దానినిగుఱించి చింతించుచు కూర్చుండుటవలన లాభము లేదు. చేయి జాఱిన తరువాత పాచికలు మఱల చేతిలోనికి రావు కదా! విశ్వేశ్వరుఁ డిప్పుడు చేయఁగలది తన వెనుకటి యాట ననుసరించి పోవుచుండుటయే. ఇప్పుడు తిరుగుబాటు కనపఱచుటవలన ప్రయోజన మేమియు లేదు. సతి శాపము విశ్వేశ్వరునికి జ్ఞప్తికి వచ్చినది. ఆమె వ్రాసిన జాబులోని ప్రతియక్షరమును అతని హృదయములో ముద్రితమై యున్నది. అతఁడొక రమణిని భార్యగా గ్రహించుననియు, ఆమెను హృదయపూర్వకముగ ప్రేమించుననియు, సుఖముపొంది స్వానుభవమువలన అట్టి ప్రేమ నిచ్చుట పుచ్చుకొనుటకంటె శ్రేష్ఠమగుసుఖము ప్రపంచమున వేఱేదియు లేదని తెలిసికొనుననియు సతి శపించినది. కాని అ ట్లెన్నటికిని జరుగదు. సతి పెట్టిన శాప మెన్నటికిని ఫలింపదు. ఎట్టి యాందోళనము పుట్టినను, ఎంత దుఃఖము కలిగినను విశ్వేశ్వరుఁడు తన ప్రతిజ్ఞను త్యజింపకూడదు. అతని చాపల్యముచూచి యెగతాళి చేయుచు నవ్వుటకు

స్వర్గముననుండు సతికి అవకాశ మీయకూడదు. ఆమె శాపమును వ్యర్థము చేయవలెను.

కొద్ది దినములలో వరుని పక్షము వారితో మాటలు-జరిగి అంతయు స్థిరమైనది—అన్నపూర్ణ అప్పు డన్నది— "ఇంక నాలస్యము చేయకూడదు బాబూ. పైవారము మంచి-తిథి యొకటి యున్నది. ఆనాఁడే ముహూర్తము నిశ్చ-యింపుము."

"వారముదినములలో నన్నియు నెట్లు సిద్ధపఱుపఁ-గలము పిన్నీ?"

"అతి యనాయాసముగ చేయవచ్చును. నేను చెప్పిన-ట్లన్ని యేర్పాట్లును చేయుచుండుము—ఏల సిద్ధముకావేమో చూతము?"

విశ్వేశ్వరుఁడు నడుము బిగించుకొని సిద్ధపడెను. భట్టా-చార్యుల యింటికి వెనుక వైపున పెద్ద పురియిల్లొకటి లేచి-నది. విశ్వేశ్వరుఁడు అంగణము చక్కఁజేసి రెండుప్రక్కల గడ్డిపాకలు కట్టించుచుండెను. వర్షము వచ్చినచో అవసర-ముండునని నడుమను దట్టమైన కప్పువేసి పందిరి వేయించెను. అన్నపూర్ణ సాక్షాత్తు అన్నపూర్ణాదేవియై భోజనములకు సమృద్ధిగ నేర్పాట్లు చేయసాగెను. జాహ్నవి యొక్క మర-బొమ్మయై అన్నపూర్ణ యాదేశములను పాలనచేయుచు అంత-యు చూచుచుండెను. సావిత్రి కన్నీరు కార్చుచు తులసీ-కోటను సంరక్షించుచుండినది. వేళకు తల్లికిని తమ్మునకును

భోజనము పెట్టి రాత్రి ప్రొద్దుపోవువఱకు అన్నపూర్ణాదేవితో కలసి తన పెండ్లి పనులు చేయుచుండెను. చూడ వచ్చినవారు సావిత్రిని వేళాకోళము చేయుచుండినను ఆమె దానికి లక్ష్య-పెట్టునది కాదు. ఇప్పు డింటిలో పనిచేయుటకు మనుష్యుల లోటులేదు. పేట వా రందఱును వచ్చి పోవుచుండిరి. ఏదో సంబంధము కలిపి పనిలో సహాయపడుచుండిరి. పెత్తల్లికూడ మఱల వచ్చినది.

పెండ్లి దగ్గఱ పడ్డది. ఆచారానుసారము సావిత్రికి పసుపురాసి స్నానము చేయించిరి. ఇరుగు పొరుగుల వారొక్కొక్కరు అవివాహితావస్థలో నుండు సావిత్రికి కడపటి-విందునకై పిలువసాగిరి. * పెండ్లికి ముందు రోజు కాక, ఆముందు రోజున అన్నపూర్ణ సావిత్రిని తనయింటికి విందు-నకై తీసికొనిపోయినది—ఆనాఁడు అన్నపూర్ణ, సావిత్రి—ఇద్దఱును కలిసి వంటచేయసాగిరి. విశ్వేశ్వరుఁ డది చూచి ఆశ్చర్యపడుచు, "నేఁడు మీరిక్కడ నున్నారేమి పిన్నీ?" అని యడిగెను.

"సావిత్రిని విందునకు తీసికొని వచ్చితిని. బనారాసు చీర కట్టుకొని తమ్మెట్లు పెట్టుకొనిన సావిత్రి నీకంటి కెట్లున్నదో చూచి చెప్పుము విశూ."

విశ్వేశ్వరుఁడు సావిత్రి వంకఁ జూచెను. ఆమె ముస్తా-బామె కందమీయలేదని విశ్వేశ్వరునకు తోఁచినది. ముఱికి

* ఇది బంగాళీదేశము నుండు ఆచారము.

చింకిబట్ట కట్టుకొని జుట్టు విరయఁబోసికొని యున్నప్పుడే సావిత్రి అతని కంటికి ఇంతకంటె నందముగ నుండెను. విశ్వేశ్వరుఁ డేమో తనలో తా ననుకొనుచు గదిలోనికి పోయెను.

వేళ ప్రకారము విశ్వేశ్వరునకు భోజనమునకు రమ్మని పిన్ని పిలిచినది. అతఁడు భోజనమునకు కూర్చుండఁగా పిన్ని ప్రారంభించినది, "సావిత్రికి విందునకు నేఁడు పిలిచితిని, విందు-వంట తానే చేసినది—ఇంతకంటె పిచ్చిదాని నెక్కడనైన చూచితివిరా బాబూ? వంట నేఁ డెట్లున్నదిరా నాయనా?"

"చక్కఁగా నున్నది." విశ్వేశ్వరుఁడు మఱి యేమియు-ననక భోజనము ముగించి లేచిపోయెను. సావిత్రి చేత భోజనము చేయించి అన్నపూర్ణ, "నీవు కొంచెము పరుండు-మమ్మా, నేను కూడ నాలుఁగు మెతుకు లుడుకఁబెట్టుకొని పని పూర్తిచేసికొని వచ్చెదను," అని యన్నది.

సావిత్రి విసనకఱ్ఱ చేతఁబుచ్చుకొని అన్నపూర్ణ వంట-దగ్గఱ కూర్చుండెను. అన్నపూర్ణ కొంచెము చీకాకు పడుచు సావిత్రితో నిట్లనెను—"నేఁడు నీవిట్టి తిండిచూడకూడదమ్మా. నా గదిలోనికి పోయి నీవు కొంచెము పరుండుము. నిన్నేట్లైన మీయింటికి పోనీయను, నా భోజన మిప్పుడే ముగించి వచ్చెదను." సావిత్రి లేచి అన్నపూర్ణ గదిలోనికి వెళ్లి, తా నిప్పుడు కట్టుకొని యున్న బట్టలు విప్పి తన మామూలు-బట్టలు కట్టుకొనినది. తమ్మెట్లు తీసి బాలీసుపై నుంచినది.

తరువాత నేమి చేయుటకును తోఁచక [illegible] పట్టు[illegible]
పడియుండు మహాభారతము తీసి పట్టుకొని [illegible]త్తఁగా,
ఎదుట నిలుచుండి యుండు విశ్వేశ్వరుఁ డామెకంటఁబడెను.

విశ్వేశ్వరుఁడు దగ్గఱకు వచ్చి పఱుపుపై నొక ప్రక్కను కూర్చుండి, "ఏమి చూచుచుంటివి, మహాభారతమా?" అని యడిగెను.

సావిత్రి కొంచెము దూరముగ జరిగి నిలుచుండి "ఔ"ననుచు తల యూఁచినది.

"ని న్నొకప్రశ్న యడుగవలసి యున్నది సావిత్రీ, జవాబు చెప్పెదవా?"

సమ్మతిని తెలియఁజేయుచు సావిత్రి మఱియొకమాఱు తల యూఁచినది.

"నా దగ్గఱ సిగ్గుపడకుము సావిత్రీ—నా దగ్గఱ సిగ్గుపడ నవసరము లేదు. నేను నీకు వరునిగ నిశ్చయించినవాఁడు మిక్కిలి మంచివాఁడు, అతనిని పెండ్లియాడుటకు నీ కసమ్మతి లేదు కదా?"

సావిత్రి ముఖము దించి క్రిందికి చూచుచు నేమియు ననక నిలిచి యుండెను. విశ్వేశ్వరుఁడు మఱల నడిగెను— "చెప్పుము, అవసరమైన యెడల వేఱొక ప్రయత్న మేదైన చేసెదను. ఈ వివాహము నీ కనిష్టమా?"

సావిత్రి మృదుస్వరముతో నుత్తర మిచ్చెను—"నా కనిష్టమా? అట్లను చున్నారేమి?"

"ఏమో చెప్పలేను కాని, నిర్ణోకమా అడుగుట మంచి-దని నాకు తోఁచినది. ఈ వివాహమువలన నీకు సుఖము కలుగునని నా నమ్మకము. నీ యభిప్రాయ మేమి సావిత్రీ?"

"నన్నడుగు చున్నా రేమి? మీ రనిన తరువాత అన్య-విధముగ కానేరదు."

"నే ననుచున్నా నని నీవును అట్లనుచున్నావా, సావిత్రీ? నీకును అట్లు తోఁచుచుండుట లేదా?"

"ఆహా మీ రెప్పుడు నిశ్చయించితిరో, అది నిజముగా నా మంచికొఱకే, నా కెట్టి సందేహమును లేదు."

"నిజమే సావిత్రీ, నీకు దేనివలన సుఖము కలుగునని నేను రాత్రింబగ ళ్లాలోచించుచున్నాను, కేవలము నీ——"

విశ్వేశ్వరునివాక్యము పూర్తికానీయక సావిత్రి "అది నే నెఱుఁగుదును. మీరు దేవతయని నానమ్మకము," అని యనుచు విశ్వేశ్వరునకు సాష్టాంగ నమస్కారము చేసి-నది. విశ్వేశ్వరుఁడు తడబడుచు "ఏమి సావిత్రీ నీవు చేయు-చున్నది?" అని లేచి నిలుచుండెను. ముఖము గంభీరముగ చేసికొని విశ్వేశ్వరుఁడు తరువాత ఇట్లనెను—"నీవు నన్నెఱుఁ-గవు సావిత్రీ, కనుక నే అట్లంటివి. నీ వూహించుదానికి కేవలము వ్యతిరేకము నాయవస్థ. నేను దేవతనుకాను, మను-ష్యులలో నతి బలహీనుఁడను." ఇట్లని దుఃఖముతో కొంచెము నవ్వెను. మఱికొంత సేపైన తరువాత తేలవాల్చి యుండు

సావిత్రితో నతఁడు, "నీవు చెప్పవలసిన దేమైన నున్నయెడల చెప్పుము సావిత్రీ," అని యనెను.

సావిత్రి విశ్వేశ్వరునిపై పోకమాఱు చూచి మఱల క్రిందికి చూచుచు మృదుకంఠముతో నిట్లనెను— "మిమ్ముల నొకమాట యడుగవలెనని యున్నది—పెండ్లియైన తరువాత వారు నన్ను తీసికొని పోవుదురా ?"

"ఆహా, తప్పక తీసికొనిపోయెదరు. అట్లడుగుచున్నా-వేమి, సావిత్రీ? పెండ్లి చేసికొని అందఱును భర్తగృహమునకే-కదా పోవుదురు?"

"అట్లైన అమ్మదగ్గఱ నెవరుందురు? ఈ యాలోచన నాప్రశ్నకు కారణము. అక్క లేదు. నేనుకూడ లేకున్న అమ్మను, కాళీని ఎవరు చూచుచుందురు? పెండ్లియైన తరువాత వారు నన్నిక్కడ నుండనీయరా? కొద్దికాలమైన నన్నుంచ-లేరా?"

విశ్వేశ్వరుఁడు కొంచెము నవ్వెను. సావిత్రి సిగ్గులేక యిట్లడుగుట ఆనవ్వునకు కొంతవఱకు కారణమై యుండ-వచ్చును. విసుగుచెంది నవ్వియుండవచ్చును కొంతవఱకు. విశ్వేశ్వరుఁడు నవ్వుచు, "అట్లెన్నఁడైన కాఁగలదా, సావిత్రీ? అట్టికోరిక నెవరు మన్నింపఁగలరు?" అని యనెను.

సావిత్రి కొంచె మాలోచించి నిట్టూర్పువిడిచి, "నేను భయపడ నక్కఱలేదు, మీరిక్కడనే యుందురుకదా. ఇప్పు డన్నయ్యకూడ అమ్మమాట వినుచున్నాఁడు. మీరే అమ్మను

చూచుచుందురు, నే నావిషయమై చింతించుట అనవసరము, చెప్పుట అంతకంటె అనవసరము," అని యన్నది.

"పెండ్లి యనిన నీకు సిగ్గువేయలేదు కాఁబోలు," అని విశ్వేశ్వరుఁడు మఱల నవ్వుచు ననెను.

సావిత్రి లేదనుచు తలయూఁచినది.

"అందఱును సిగ్గుపడుచుందురు కదా, నీకు సిగ్గు లేకుండుటకు కారణమేమి సావిత్రీ?" అని విశ్వేశ్వరుఁ డడిగెను.

"సిగ్గుపడుచుందురు, నిజమే, కాని వారు నావలె తమ తల్లిదండ్రుల దుఃఖమునకు కారణముకారు, వారి తలిదండ్రుల గుండెలలోని రక్తము విచారమువలన గడ్డకట్టదు."

"అట్లనకుము సావిత్రీ, నీవు మాకు బరువా?"

"బరువుకానా? నాకొఱకు మీరెంత కష్టపడుచున్నారో, ఎంత వెదుకవలసివచ్చినదో నే నెఱుఁగనా?"

"అదియొక కష్టముకాదు సావిత్రీ, ఎట్లైన నీవు సుఖించెదవనియే సదా నే నాలోచించుచుండునది. నీవు సుఖించునప్పుడే నేను సుఖము పొందఁగలను. నే నిప్పుడు నిశ్చయించిన సంబంధము నీ కిష్టములేకున్న చెప్పుము, ఇంతకంటె మంచిసంబంధమునకై ప్రయత్నించెదను. నీకిష్టములేదా? చెప్పుము."

"అట్లింతమాత్రమును తలంచకుఁడు. సంబంధము మంచిదికాదని యెఱిఁగి మీరు నాకు పెండ్లిచేసినను నేను సుఖించెదను—ఆమాట మీరు తెలిసికొనుఁడు. అట్లైనను

మీరు నాకు దేవతయే—మీరు మాయమ్మను గొప్పబాధనుండి విముక్తురాలనుగ చేసినవారవుదురు. మీచేతికి అక్కమ్ముల నొప్పఁజెప్పి వెళ్లినది."

సావిత్రిహృదయము భక్తితో నిండినది, తలవాల్చుకొని యామె మెల్లఁగా నచ్చటినుండి వెళ్లిపోయినది. ఆదేవతలను వీరు మర్త్యలోకమున కేల వచ్చిరని విశ్వేశ్వరుఁడు స్తంభితుఁడై తనలో-తా ననుకొనెను. కేవలము దుఃఖ మనుభవించుటకు వచ్చిరా? పాషాణ హృదయులగు మానవుల పాదములకడ తమ్ము బలిగా నిచ్చుటకు వచ్చిరా? లేదు లేదు, అట్లనిన భగవంతుని యవమానపఱచినవార మాదుము. సతి సావిత్రిని దీవించి పోయినది, ఆయాశీర్వాద మామె తలపై నున్నది, సావిత్రి నిశ్చయముగా సుఖ మొందును.

విశ్వేశ్వరుఁడు మఱల పెండ్లియింటికి పోయి నడుము-బిగించి పని చేసిచేసి రాత్రి ప్రొద్దుపోయిన తరువాత ఇంటికి వచ్చి పరుండెను. మఱునాఁడు మధ్యాహ్నము పెండ్లివారు వచ్చిరి. విశ్వేశ్వరుఁడు విడిది సిద్ధముచేసి యుంచెను. వారు రాఁగానే వారి నాదరముతో అందులో దించెను. వరుని యాకారము అతని సౌందర్యము చూచి విశ్వేశ్వరుఁ డానందించెను. కాని పెండ్లిపెద్ద నడవడి, అతని యహంకారము, అతని ధనకాంక్షలవలన సంతసించ లేకుండెను. ఎట్లైననేమి ఆరాత్రి గడచినది. మఱునాఁ డుదయమే లేచి విశ్వేశ్వరుఁడు కండ్లు నులుముకొ

నుచు పెండ్లియింటికి వచ్చెను. భూపాలరాగముపైని పాడు-చుండు సనాయిపాట పందిరిలోనుండి వినఁబడుచున్నది.

సావిత్రి తులసికోటకు ప్రణామము చేసి నిలిచినది. అప్పటి కింట నింకెవరును లేవలేదు. అందఱికంటె పెండ్లికూఁతురు ముందుగ లేచినదని యెగతాళిచేయుచు నేమైన ననవలెనని విశ్వేశ్వరునకు బుద్ధి పుట్టినది కాని నోట హాస్యపుమాట లేవియు రాకుండెను. కదలక మెదలక నిలిచియుండు ఆమె-మూర్తిని చూచుచు నూరక అతఁడు నిలఁబడెను. ఆయువతి ఎట్టి ధ్యానమున నిమగ్నురాలై యున్నదో కదా! బయటి సడి చప్పుడు లామెను తాఁకలేకున్నవి. ఆకన్యక ఎట్టియారాధ-నలో మునిఁగియున్నదో కదా!



## పదునాఱవపరిచ్ఛేదము.

---

సాయంకాలము కావచ్చుచున్నది! ఇల్లు మనుష్యులతో నిండియున్నది. ఎటువైపుచూచినను, సందడి, గందరగోళము, కేకలు, గ్రామమున నుండువా రందఱును ఆహ్వానింపఁబడిరి; అందఱును వచ్చి తమతమ తెలివితేటలను కనఁబఱచుచున్నారు. చీఁకటిపడక మునుపే దీపములన్నియు వెలుఁగుట మొదలు పెట్టినవి—రాత్రి ప్రారంభముననే వివాహలగ్నము. విశ్వేశ్వరుఁడు నానావిధములగు ఏర్పాట్లు చేయుచు, అన్నియును సరిగా జరుగుచుండునటుల చూచుచుండెను. అంతఃపురములోని ఏర్పాటులన్నియు అన్నపూర్ణ చూచుచుండెను. నేఁడు జాహ్నవి ఎవరికంటికిని కనఁబడక సతి మరణమునొందిన స్థలమున కప్పుకొని పరుండి యుండెను. దీపములు పెట్టిన కొంతసేపటికి సావిత్రి పెండ్లి ముస్తాబుతో వచ్చి తల్లిదగ్గఱ కూర్చుండెను. జాహ్నవి ఉలికిపడి లేచి రుద్ధకంఠముతో, "నీవిచ్చుటకు వచ్చితివేలమ్మా? పీటలపై కూర్చుండువేళ అయినది, వెళ్లుమమ్మా, వెళ్లుము," అని యన్నది.

"వెళ్లెదనమ్మా, నీయొద్ద కొంచెము కూర్చుండి వెళ్లెదను."

అన్నపూర్ణ సావిత్రిని కానక జాహ్నవి పరుండియుండు గదిలోనికి పఱుగెత్తి వచ్చినది. సావిత్రి నక్కడ చూచి తల్లికి

చీవాట్లుపెట్టినది. జాహ్నవి మెల్లమెల్లఁగా లేచి సావిత్రిని చేయిపట్టి తీసికొని పోయి పీటపై కూర్చుండఁబెట్టి వచ్చినది. విశ్వేశ్వరుఁడు వరుని కిచ్చుటకు జరీచాపాకటి, బంగారు-గొలుసు, వాచీ, వజ్రము తాచిన ఉంగరము మొదలగునవి పిన్నియొద్ద పుచ్చుకొని ద్వారముకడ నిలిచి యుండెను. ఆడువారు చేయుచుండు సందడివలనను, అత్యుత్సాహ-ముతో నాద్యము ప్రారంభమగుటవలనను, బయట గొప్ప కో-లాహలముపుట్టినది. ఎవరో పెద్దమనుష్యుఁడొకఁడు హఠాత్తుగ వచ్చి, "ఏమండీ, వరుఁడు వచ్చి గడప యెదుట నిలిచియుండఁగా మీరిచ్చుట సున్నారేమి? ఇవి యన్నియు తరువాత చేసికొన-కూడదా! ఈపనులలో నిప్పుడు కూర్చుండి ఈకుట్టుతరహా——! రండు, రండు," అని విశ్వేశ్వరునితో ననెను.

"ఇదిగో వచ్చుచున్నాను," అనుచు విశ్వేశ్వరుఁడొకమాఱు గదిలోనికిఁ దొంగిచూచెను. పెండ్లి ముసుఁగు వేసికొని తలపై కిరీటము* పెట్టుకొనియున్న సావిత్రిముఖ మతనికి కానరాకుండెను. ఆమె ముఖము దించుకొని పూజ-చేయుచుండెను. విశ్వేశ్వరుఁడు మెల్లఁగా సభవైపునకువచ్చెను. ఏదోయొక ఎఱుఁగరాని భయమువలన విశ్వేశ్వరునికాళ్లు చేతులు నిజముగా వణఁకుచుండెను.

వరుఁడు సభలోనికి వచ్చి కూర్చుండి యుండెను. వరుని పక్షమువారికిని పధువుపక్షమువారికిని అతి తీవ్రమగు వా-

---

*జరీపని చేసిన జిలుగు కిరీటము పెట్టుకొనుట బంగాళీదేశమున నాచారము.

డానువాదము జరుగుచు సభ ఆందోళనతో నిండినది. వరుఁడు ముఖము గంభీరముగ చేసికొని మాటాడక కూర్చుండెను. విశ్వేశ్వరుఁ డచ్చటికి వచ్చి ఒకప్రక్కను నిలిచియుండి వరునివైపొకమాఱు చూచెను. మగపెండ్లిపెద్ద తానంత స్వల్పకట్నమున కొప్పుకొని పెండ్లిలోనికి దిగినందునకు మిగుల అనుతాపముఁజెందుచు మాట లనుచుండ ఊరిపెద్ద లతనిచుట్టునుఁ జేరి మంచిమాటలతో నతనిని బోధించుచుండిరి.

“ఇఁక నాలస్యమేల, లోపున అంతయు సిద్ధమైయున్నది,” అని ఎవరో వచ్చి అనిరి. విశ్వేశ్వరుఁడు హరిని పిలిపించి అతఁ డేమేమి యనవలెనో అతనికి నేర్పెను. హరి చేతులు జోడించి నిలిచియుండి, “ఇఁక కన్యాదానము కావచ్చునని సెలవీయుఁడు,” అని యనెను.

“ఆహా, అవశ్యముగా, అవశ్యముగ!” అను కేకలు వినఁబడినవి. కాని వానితోపాటు “మొదట కట్నము రూపాయలు తీసికొనిరండు, తరువాత నది కావచ్చును,” అను మాటలు ఢంకాశబ్దమువలె మగపెండ్లిపెద్దనోటినుండి వెలువడెను.

“ఆహా సందేహమేల? సంచి నందుకొనుఁడు—ఇదిగో. వరుని ఇఁక తీసుకొని పోవచ్చునా?”

పెండ్లిపెద్ద రూపాయలు లెక్కించుచు కూర్చుండి, వారి నాగుమని ఎడమచేతితో సంజ్ఞచేసెను. విశ్వేశ్వరుఁడును హరియును మిగుల విసుగుఁజెంది మాటాడక నిలిచియుండిరి. పెండ్లిపెద్ద రూపాయలు లెక్కించి, “మూఁడువేలు రూపాయ-

లున్నవి సరే, కట్నమురూపాయలు సరిగానున్నవి, ఇఁక పెండ్లి-కొమార్తె యాభరణములు చూడవలెను. అంతయు కానిచ్చి, చివరకు గొడవ చేయవలసినవాఁడను కాను నేను. పెండ్లి-కొమార్తెను సభలోనికి తీసికొనిరండు—మా పెండ్లి యాచార-మదియే," అని యనెను.

విశ్వేశ్వరునకు కొంచెము కోపమువచ్చినది, "మమ్ముల నంత తక్కువవారిగా తలఁపకుఁడు. పిల్లను సభలోనికి తీసికొని వచ్చుట జరగని పని. లోనికి వచ్చి అచ్చటనే చూడవలెను," అని అతఁ డనెను.

"కోపగించ వలసిన దిందులో నేమియులేదు బాబు, కొంచెమిచ్చి పుచ్చుకొనుబుద్ధి యుండవలెను. పిల్లను సభలోనికి తీసికొని వచ్చిన నేమితప్పు? అదియే మా దేశాచారము." మగ-పెండ్లి పెద్దయాడిన ఈమాటలను సభలో ననేకులామోదించిరి.

విశ్వేశ్వరుఁడెట్టి చలనమునులేని కంఠముతో, "మీ యాచారము లిక్కడ పనికిరావు, పిల్లనిక్కడికి తీసికొని రాము," అని యనెను. సభ్యులలో కొందఱు "దీనివిషయమై వివాద-పడుటవలన లాభములేదు, లోనికి పోయి జరుపవలసిన దచ్చ-టనే జరుపుఁడు," అని యనిరి.

మగపెండ్లిపెద్దయును అతని పక్షములోని వారు-కొందఱును, వధువు పక్షములోనివారు కొందఱును కలసి అంతఃపురములోనికి పోయిరి. మగపెండ్లిపెద్ద గార్దభకంఠము వంటి కంఠముతో, "పిల్లను తీసికొనిరండు," అని యనెను.

"లోపున జరుగవలసిన పూజలు మొదలైనవి మొదట కావలెను, తరువాత వివాహము," అని స్త్రీదళము లోపలనుండి కేకలు వేసెను.

హరి యరుగెక్కి వారిని చీవాట్లు పెట్టుచు, "మీ ఆచారము లటుండనీయుఁడు. మొదలు పిల్లను వారు చూడనిండు. పెండ్లిచేసివేయుటకు తీసుకొనిపోలేదు, సరుకు నచ్చునో లేదో చూచుకొనుచున్నారు," అని కేకలు వేసెను.

హరి ముసుఁగు వేసికొని తలవంచియున్న సావిత్రిని నడిపించుకొని వచ్చి మగపెండ్లిపెద్ద ఎదుట కూర్చుండఁబెట్టెను. పెండ్లి పెద్ద పిల్లయాభరణముల నొక్కొక్కదానిని చూచి ప్రసన్నుఁడై, నిలుచుండి, ఇట్లనెను—"పిల్లను మఱల ఇంటిలోనికి తీసికొనిపోక మీ స్త్రీ లాంఛనములు ప్రారంభము కానిండు—అన్నట్టు, కన్యాదానము చేయువారెరీ?" హరి విశ్వేశ్వరుని వైపుచూచెను, విశ్వేశ్వరుఁడు హరిని చూపించుచు, "కన్యాదానము చేయువాఁ డితఁడు, ఇతఁడు పెండ్లికొమార్తె యన్నగారు," అని యనెను.

"అనఁగా—అట్లైన—నేను చెప్పున దేమనగా—మీరామాట మొదటనే చెప్పవలసి యుండెను—అట్లైన నే నిందులోనికి దిగియుందునా? ఇప్పుడు మీరు మఱియొక వేయి రూపాయ లిచ్చినఁగాని నే నీ పెండ్లి కొప్పుకొనను—మీరు మంచివారు, మీజాతి పోఁగొట్టుట నా కిష్టము లేదు," అని మగపెండ్లి పెద్ద అన్నాఁడు.

అతఁ డింకను నేమో మాటలాడఁబోవుచుండుట చూచి, విశ్వేశ్వరుఁ డతనికి అడ్డు వచ్చి, "మఱియొక వేయి యెందుకీయవలెనయ్యా? అవసరము లేని ప్రసంగము లెత్తుచున్నారు మీరు, మీకు పెండ్లి చేసికొనవలెనని లేదా?" అని యడిగెను.

"ఓహో నీ వెవరయ్యా మధ్యను? నేను ఆ డు పెండ్లి పెద్దతో మాటలాడుచుండఁగా—"

హరి మిగుల దుఃఖితుఁడగుచు, "ఆయనయే పెండ్లిపెద్ద, చెప్పవలసినవి ఆయనతోనే చెప్పుఁడు," అని యనెను.

"బోధపడుచున్నదయ్యా, మీ రనేక విద్యలు నేర్చియున్నట్టున్నారు. ఎవరు పెద్దయో అదియే నిశ్చయము కాలేదు. మీకుల మెంత పవిత్రమైనదో మీ మోసముకూడ నంత యుక్తిగలది. ఇట్టి యింట పెండ్లి చేసికొనుట కెవరైన వత్తురా?"

విశ్వేశ్వరుఁ డతి కష్టముతో కోప మణఁచుకొనుచు, "చెప్పఁగోరున దేదో చెప్పుఁడు, నేనే పెద్దను," అని యనెను.

"అట్లనా! అట్లైన ఇంతసేపును మోసపుచ్చుచుండు టేల? మఱియొక వేయిరూపాయ లీయనిదే మేము పెండ్లి చేసికొనము."

"ఏల? వరతు ప్రకారము రూపాయలు మీకు ముట్టినవే? మీరే లెక్కపెట్టుకొని తీసికొన్నారు?"

"మీది యింత పవిత్రమగు కులమని నేను మొదట ఎఱిఁగియుంటినా? పిల్ల యక్క నడవడి మంచిది కాదని విన్నాను—ఆమె విషము తిని చచ్చిపోయినదఁట?"

"జాగ్రత, జాగ్రత! కొంచె మాలోచించి మఱి మాటలాడుఁడు," అని గర్జనచేయుచు విశ్వేశ్వరుఁ డనెను.

"ఆలోచనయేల? అట్లైన నేను పెండ్లి చేయనే చేయను; మీరేమి చేయఁగలరో నేనును చూచెదను! లెమ్ము వరేంద్రా, బయటికి నడుపుము." వరుఁడు వరాసనమునుండి లేచి నిలిచెను. హాఁ హాఁ అని నివారించుచు వరుని నలుగురును పట్టుకొనిరి. కొంతమంది పెండ్లి పెద్దలు దగ్గఱకు వచ్చి, "ఏమండీ, మీరు చేయునది? తొందర పడకుఁడు, అంతయు మేము సరిచేసెదము, తొందర పడవద్దు, ఇట్టి పని చేయరాదు," అనుచు నతనిని శాంతపఱుప ప్రయత్నించిరి.

"పిల్లకు పెండ్లి చేయఁగోరువారి కింత పౌరుషము, మాట తీవ్రత ఏల? పిల్ల కెట్లు పెండ్లి యగునో నేనును చూచెదను."

"ఓర్చి యుండుఁడు, ఓర్చి యుండుఁడు."

పరుల హితమును కోరు పెద్ద మనుష్యు లిద్దఱు వచ్చి కఱ్ఱబొమ్మవలె నిలిచియున్న విశ్వేశ్వరుని వీపుపై మెల్లఁగా చేతితో తట్టుచు నిట్లనిరి—"ఇంత చేసిన తరువాత ఈ స్వల్పమునకై ఇంత గడబిడయేల బాబూ! వేయిరూపాయలు మాత్రమే కదా,' ఇచ్చి వేయుము నాయనా. కావలెనన్న

మేము చందా ఎత్తి నీ కా వేయియును వెనుకనుండి యిచ్చె-దము. వెళ్లుము బాబూ, రూపాయ లతనికిచ్చి అంతయు చక్కఁజేసి వేయుము, లేని యెడల పెండ్లి తప్పిపోవును."

అరుగుపై నుండు నారీబృందము కఱ్ఱబొమ్మలవలె నిలఁబడి పోయినవి, గాజుల చప్పుడైనను లేదు, మాటలు లేవు. విశ్వేశ్వరుఁ డటువైపు ముఖము త్రిప్పగా ఎవరో మూర్ఛఁజెంది అచ్చట పడియున్న ట్లతనికి కనఁబడినవి. అన్న-పూర్ణ ఆమె దగ్గఱ కూర్చుండి, విశ్వేశ్వరుఁ డటువైపు తిరుగఁగానే, "వచ్చి రూపాయలు తీసికొని పొమ్ము, లగ్నము మించి పోఁగలదు, ఆలస్యము కానీయకుము," అని కేక వేసినది.

నేల పడియున్న స్త్రీ జాహ్నవియని విశ్వేశ్వరుఁడు పోల్చుకొనెను. హరి భయపడుచు దగ్గఱ నిలిచి ఆమెవైపు చూచుచుండెను. సావిత్రి ఆ ముసుఁగుతోనే క్రిందికి చూచుచు నిలిచి యుండెను. విశ్వేశ్వరుఁడు స్థిరకంఠముతో "నేను చివరమాట యొక్కటి చెప్పుచున్నాను, వినుఁడు!— పిల్లయక్క దేవతా తుల్యమైనది, ఆమె యిప్పుడు స్వర్గమున నున్నది. నే నెంత మాత్రమును రూపాయలు మఱి యీయఁ-దలఁచుకొనలేదు. మీ కిష్టమున్నపని చేసికొన వచ్చును." అని యనెను.

"అది యేమి విశ్వేశ్వర్!" "వద్దు వద్దు విశ్వేశ్వర్!" అని నాలుగు వైపులనుండి నివారించుచు కేకలు లేచినవి.

హారికూడ దిగులుఁ జెందుచు, "అట్లను చున్నారేమి విశు బాబూ?" అని యనెను. విశ్వేశ్వరుఁ డెట్టి సంకోచమును లేని కంఠముతో, "నీ పూరకుండుము హారీ," అని యనెను. ఇట్లనుచు సభవారి వంక తిరిగి, "నేను మఱియొక రూపాయయైన నిచ్చెదనని మీ రెన్నఁటికిని ఆశింపకుఁడు. కాని వరునితో నేను చెప్పవలసిన దొక్కమాట యున్నది—నే నతనికి నేఁడర్పింప వచ్చిన రత్నము విలువ అతఁడు పోల్చుకొనఁ గలిగిన యెడల తా నత్యదృష్టవంతుఁడనని అతఁడు నిశ్చయముగా తెలిసికొని యుండును. ఈవస్తు వేవెల కమ్మకమౌనో చూచెదరా?" అని యనెను.

విశ్వేశ్వరుఁడు సావిత్రి యొద్దకు వచ్చి ఆమె కిరీటము నటు పారవైచి, ముసుఁగుతీసి, సావిత్రి ముఖము వరుని వైపు త్రిప్పి, "ఇటు చూడుఁడు, ఈరత్నము విలువ పోల్చుకొనఁగల రేమో?" అని యనెను.

వరుఁడు ముఖము గంభీరముగ చేసి, "నాన్నగారుండఁగా నన్నడిగి ప్రయోజనములేదు," అని ఉత్తరమిచ్చెను.

"రారా నాయనా, వారికి పెండ్లి చేయవలె నని లేదు; సిగ్గుమాలినతన మిదియంతయు—రమ్ము, మనము పోదము." అని తండ్రి యనెను.

యథార్థముగ హితమును కోరుచు ఒకరిద్దఱు "వద్దుబాబూ, విశూ, ఇప్పుడైనను తెలివి తెచ్చుకొనుము," అని యుపదేశించిరి.

"తెలిసికొనక నేనేమియు చేయుచుండలేదు," అని విశ్వేశ్వరుఁ డన్నాఁడు.

"పోనిండు, వేయక్కఱలేదు, ఐదువంద లీయుఁడు," అని వరపక్షమువా రన్నారు.

"మఱియొక్క దమ్మిడి యైన నీయను," అన్నాఁడు విశు-

విచక్షణగలవారిద్దఱు వచ్చి కండ్లతో సంజ్ఞ చేయుచు తండ్రికి సలహాయిచ్చిరి—"మఱి ప్రయోజనము లేదు, తరుణము మించినది. వచ్చినదే లాభమని తలఁచి మొదటి షరతు ప్రకార మొప్పుకొనుఁడు." ఇట్లతని చెవిలో చెప్పి నలుగురును వినునట్లు బిగ్గఱగా నిట్లనిరి—"మీరు తొందర పడకుఁడు, మే మంతయు సరిచేసెదము. కొంచెము నష్టమునకైన నొప్పుకొని మీరు మొదటి షరతుల ప్రకారము నడచుకొనవలెనని మా ప్రార్థన. మర్యాదస్థులను జాతి భ్రష్టులనుగా చేయుట న్యాయము కాదు. హరీ, నీవు పిల్లను తీసికొని వచ్చి పీటపై కూర్చుండఁ బెట్టుము. ఇదిగో పెండ్లికొడు కిక్కడా! లెమ్ము బాబూ, వచ్చి పీటమీఁద కూర్చుండుము. కానిమ్ము బాబూ విశూ, ఇఁక జాలమేల?"

విశ్వేశ్వరుఁడు చలనములేక కట్టబొమ్మవలె నిలిచియుండి, చలనము లేని కంఠముతో జవా బిచ్చెను. "నాతో నిఁక నేమియు చెప్పవద్దు. ఇట్టి ఘటన జరిగిన తరువాత ఇటువంటి నీచులచేతికి పిల్ల నొప్పఁజెప్పువాఁడు ఆనీచులకంటె నీచుఁడు. మీరందఱును దయచేయుఁడు, మేముపిల్లకు పెండ్లి చేయము."

అక్కడనున్న వారందఱికిని మతిపోయిన ట్లైనది. విశ్వే-శ్వరుఁ డనునట్లు చేయువాఁడని అందఱు నెఱిఁగిన దే. వరపక్షము వారు మిగుల నవమానితులై, కోపముతో చేతులు విసరుచు పెండ్లియిల్లు విడిచి బయటికి రాసాగిరి. హితముఁగోరుచు మిత్రుఁ డొకఁడు, విశ్వేశ్వరునితో, "ఏమిట్లు చేసితివి విశూ! నీవొప్పుకొనినయెడల ఇప్పుడైనను వారిని మఱపించి మఱల తీసికొని రాఁగలను. లేకున్న బ్రాహ్మణ బాలిక జాతి పోవును," అని యనెను.

"జాతి యేలపోవును ? తగినవరుని మఱియొకని చూచి పెండ్లిచేయుఁడు."

"మఱియొకవరుఁడా? ఈయర్థరాత్రివేళ వరుఁ డెక్కడ-దొరకును?"

"వరునికొఱకు దూరముపో నక్కర లేదు—దగ్గఱనే యున్నాఁడు. అతిథులను సత్కరించుభారము మీరు వహిం-పుఁడు. అదిగో, వా రిద్దఱు మీకు తోడ్పడుదురు. వరుఁడను నేనే!"

హఠాత్తుగ నచ్చట పిడుగుపడినను ఎవ్వరికిని అంత-యాశ్చర్యము కలుగకపోను. ఊరిపెద్దల యామోదమునకు భంగము కలిగినది. "ఏమి సమాచారము? ఏమిసమాచారము?" అని వచ్చియున్నవారందఱును ఆశ్చర్యపడి యడుగుచుండుట-వలన పెద్దకలరవమ్ము పుట్టినది.

"మఱియేమియు లేదు—మాతండ్రిగారు లేనందున నేనే మీ కభ్యర్థన మొనరించి ఈశుభ కార్యములో మీరు తోడ్పడ-

వలసినదని వేఁడుకొనుచున్నాను. నాలుగునిమిషములు-షా ఎవరినోటను మాటలేదు. తరువాత పెద్దలలో ఇద్దఱు ముగ్గురు విశ్వేశ్వరుని అభినందింప మొదలుపెట్టిరి. విశ్వేశ్వ-రుఁడు వారికి నమస్కరించి, అరుగుపైకి వచ్చి నిలిచి "పిన్నీ" అని పిలిచెను.

పిన్ని స్త్రీసమూహమధ్యముననుండి వచ్చి విశ్వేశ్వరునితల రెండుచేతులతోఁ బట్టి గుండెపైనుంచి నొక్కుకొని పసిబాలుని ముద్దుపెట్టుకొనురీతిని అతనిని ముద్దుపెట్టుకొనినది, రెండు-చేతులను విశ్వేశ్వరుని తలపైనుంచి ప్రేమభరితమగు హృద-యముతో నతని నాశీర్వదించినది. విశ్వేశ్వరుఁ డప్పుడు జాహ్నవిపాదములకును, అన్నపూర్ణపాదములకును ప్రణా-మముచేసి మండపమెక్కి, "నేనిఁక కూర్చుండవచ్చునా? భార-మంతయు మీపైనేయున్నది," అని స్నేహితులవంక ముఖము-త్రిప్పి యనెను.

"భారమంతయు మేము వహించెదము, నీవు నిశ్చింతగా నుండి, నీకు మంచిదని తోఁచినది చేయుము."

విశ్వేశ్వరుఁడు వరుని కొఱకుంచిన చాపునువిప్పి కట్టు-కొని, వచ్చి పీటపై కూర్చుండెను. పురోహితుఁ డది చూచి మొదట జరుగవలసిన తంతు కొంతయున్నది గనుక లెమ్మని అతనితో చెప్పెను.

ఏమిచేయవలెనో యెఱుఁగక విశ్వేశ్వరుఁడు లేచి నిలుఁ-బడెను. పనిపాటులులేని యువకబృందము ఉత్సాహముతో

వచ్చి విశ్వేశ్వరుని ముట్టడించి అతని నక్కడనుండి తీసి-కొనిపోయిరి. స్త్రీలు సందడిచేయుచు విశ్వేశ్వరుని చుట్టు-చేరిరి. శంఖారావ మారంభమైనది. వరుని ముక్కుపైఁగాని చెవులపైఁగాని జాలిఁగొనినవా రా స్త్రీసమూహమున నొకతె-యైనను లేకుండెను. "పెండ్లికొడుకుకాఁగానే సరదాకాదు, వారిగిల్లులన్నియు నోర్చియుండగల శక్తి యుండవలెను," అని నవ్వుచు యువకులలో కొందఱు కేకలువేసిరి.

పిల్లను తీసికొనివచ్చి పీటపై కూర్చుండఁబెట్టిరి. శుభ-దృష్టి మొదలగు సంస్కారములు కొన్నియైన తరువాత "చూడుము వదినా, చూడుము—నీ కదృష్టములేదు—అటు వైపొక్కమాఱు చూడుము," అని అన్నపూర్ణ జాహ్న-వితో ననెను.

హరి కన్యాదానము చేసెను. విశ్వేశ్వరుఁడు సావిత్రిని కుడిచేతితో నందుకొనుచు ఏదో అడుగఁగోరుచున్నట్లు హరి-వైపు చూచెను.

హరి సావిత్రి తలపై చేయివేసి—"అట్లు చెప్పుము! ఇప్పు డుపాయ మేమి?" అని ఆశ్చర్యపడుచు తనలో తాను బిగ్గఱగా ననుకొనెను.

"దేని కుపాయము? ఏమి జరిగినది?" అని పురోహితుఁ డడిగెను.

"పిల్లకు జ్వరము వచ్చినదండీ!"

"వచ్చినయెడల ఆశ్చర్యము లేదు. అట్టి భయంకరమగు కాండ జరిగిన తరువాత జ్వరము వచ్చుటలో అసంభవమేమి యున్నది? త్వరగా అంతయును ముగించవలెను."

వివాహమైపోయినది. "అత్తయ్యా! ఇకెవ్వరైన నౌకరు రండు," అని హరి భయముఁ జెంది అన్నపూర్ణతో ననెను. జాహ్నవి సావిత్రియొద్దకు వచ్చి వాలియున్న ఆమె తలను తనయొడిలోనుంచి ఆమెను తనపై చేరవేసికొనెను. అన్నపూర్ణ సావిత్రి ముఖముపై నీళ్లుఁ జల్లి ఆమెను విసరసాగెను. కొంతసేపటికి సావిత్రి కొంచెము స్వస్థతఁ జెందినట్లు కనఁబడఁగానే తల్లి, "ఏమమ్మా! అట్లు చేసితివేమి? నేఁడు సముద్రముతోడి మణిని సంపాదించితివమ్మా," అని యన్నది. సావిత్రి తల్లి భుజముపై మెడనుంచి రెండుచేతులతో తల్లిని కౌఁగిలించుకొనినది.



# పదునేడవపరిచ్ఛేదము.

---

కాలము మెల్లఁగా నడుచుచున్నది—వార్షికచక్రమున సగముభాగమునకు పైఁగా నడచినది. ప్రతి సంవత్సరము వలెనే విశ్వేశ్వరుని యింటికి ప్రక్కనుండు మామిడితోఁట పువ్వులతోను, ఎఱ్ఱని యాకులతోను నిండియున్నది. తేనెటీఁగలకు నిమిషమైనను తీరుబడి లేదు. శీతకాలమును తప్పించుకొని వచ్చిన కొబ్బరిచెట్లు లేత మట్టలతో నిండి గాలికి తల లాడించుచున్నవి. పచ్చని పండ్లతో నిండియున్న బత్తాయిచెట్లు రెండు సిగ్గుచే తల వాల్చుకొనియున్న నవవధువవలె ఒకమూలను నిలిచియుండెను. సగమువిడిన పువ్వులతో నాడుచు గాలి మిగుల నానందించుచున్నది. గాలి వాని నిటు నటు ఆడించుచున్నది, నేల రాల్చుచున్నది, వాని పరిమళమును దొంగిలించి నలుదిక్కులను పఱుగెత్తుచున్నది. మల్లెపూలు, జాజిపూలు తమ శోభా సుగంధములచే ప్రమత్తములై యున్నవి, పసి బాలికలవలె వాయువున కందకుండ దాఁగియుండవలెనని యత్నించుచున్నవి.

సర్వమును ప్రతిసంవత్సరమునవలెనే యున్నది, కాని, కొబ్బరిచెట్లక్రిందను పుస్తక మొకటి చేతపుచ్చుకొని ఇటునటు పచారిచేయుచుండు విశ్వేశ్వరునకు తలయెత్తి చూచునప్పటికి అంతయును క్రొత్తఁగా కనఁబడుచున్నది.

జమాఖర్చులపుస్తకములు కొన్ని చేతపుచ్చుకొని గుమాస్తా యొకఁడు విశ్వేశ్వరుని దగ్గఱకు వచ్చెను.

"ఈ లెక్క మీరు కొంచెము చూడవలెను—మందిరము పూర్తియగు సరికి మీ ఎస్టిమేటునకు మించునని తోఁచుచున్నది," అని గుమాస్తా అన్నాఁడు.

చదువుచున్న పుస్తకముమూసి విశ్వేశ్వరుఁడు, "ఏది కట్టించినను ఎస్టిమేటును దాఁటయే వెళ్లును; రమ్ము గదిలోనికి పోయి లెక్కలు చూతము," అని విశ్వేశ్వరుఁ డనెను.

నలుదిక్కులను ఇంత అవిశ్శృంఖలముగ తన మహిమను వ్యాప్తముఁ జేయుచుండు ప్రకృతిని విడిచి జమాఖర్చులు చూచుకొనుచు కూర్చుండుటకు విశ్వేశ్వరున కెంతమాత్ర మిష్టము లేకుండెను. చేతిలోనున్న కావ్యమును బెంచీపైనుంచి విశ్వేశ్వరుఁడు గుమాస్తాతో కలిసి ఆఫీసు గదిలోనికి వచ్చెను.

లెక్క పుస్తకములోని పుట లిటునటు తిరుగవేయుచు విశ్వేశ్వరుఁడు మందిరము పూర్తియగుట కింక నెన్ని దినములు పట్టునని గుమాస్తా నడిగెను.

"వెలుపలిభాగము రమారమి పూర్తియై పోయినది. లోనుండు మందిరమే తరువాయి—చిల్లర చిల్లరవన్నియు పూర్తియగుచున్నవి. ఇదిగో, మీరు షాపువారిసి యిమ్మనిన లెక్క తయారై యున్నది. అది మీరొకమాఱు చూచెదరా?"

"సరే, రాఁబోవు సంక్రాంతినాఁటికి అంతయును పూర్తి-కావలెను, ఆనాఁడు ప్రాణప్రతిష్ఠ చేయించవలెనని పిన్ని నిశ్చయించినది."

"అంతకు పూర్వమే అంతయును పూర్తి యగును."

లెక్కచూచుట కాఁగానే విశ్వేశ్వరుఁడు లేచి స్నానమునకై ఇంటిలోనికి పోయి, "పిన్నీ, నూనె," అని కేక వేసెను.

పిన్ని యప్పుడు వంటలో నున్నది; సావిత్రి దగ్గఱ కూర్చుండి పసుపు నూఱుచుండెను; "విశుకు కొంచెము నూనె యిచ్చి రమ్మమ్మా," అని పిన్ని సావిత్రితో ననెను.

వధువు కొంచెము సంకోచించి తుదకు ముసుఁగు తల-పైకి లాగుకొని నూనె గిన్నె పట్టుకొని బయటికి వచ్చినది. కూర తరుగుచు పంచేలో కూర్చుండియున్న 'నిధు' తల్లి కంటఁబడుచున్నదని విశ్వేశ్వరుఁడు ప్రక్కనుండు వరండా-లోనికి పోయి స్తంభము ప్రక్కను నిలిచియుండెను. వధువు నూనె తీసికొని వచ్చి ముసుఁగు కొంచె మెత్తుకొని చూచినది. కాని నూనె కోరినవా రక్కడ లేరు—వధువా నూనె గిన్నె అక్కడనుంచి వంటియింటికి మఱల వచ్చినది. ఆమెను చూచి, "విశు ఉన్నాఁడమ్మా అక్కడ!" అని పిన్ని యడిగెను.

"లేరు," అని తలవంచి వధువు జవాబిచ్చెను.

"ఎక్కడికి వెళ్లినాఁడో కొంచెము చూచి రమ్ముతల్లీ—ఆలాగునే స్నానమునకు పోవునేమో! ఎటువంటి పిల్లవాఁ-

డమ్మా! ఇన్నాళ్ళకైనను వాని స్వభావము నాకు బోధపడ-కున్నది."

కాని వధువుకు అంతకంటె బాగుగ బోధపడినది. కనుక జంకుచుజంకుచు ముసుఁగు పైకిలాగుకొని వచ్చి నూనెగిన్నె చేతఁబుచ్చుకొని అంగణములోనికిఁ దిగి, ఆయన యెక్కడికి వెళ్ళినారని కూరలు తరుగుచుండు నిధుతల్లిని మెల్లఁగా అడిగి-నది. మిగుల యాసక్తితో తనపని చేసికొనుచున్న నిధుతల్లి "నే నెఱుఁగనమ్మా, గదిలోనికి వెళ్ళిపోయినాఁ డేమో," అని యన్నది.

వధు వంగణముదాఁటి పడకగది వరండాలో రెండడు-గులు వేయకమునుపే వెనుకనుండి యెవరో ఆమె పైటచెం-గును పట్టి లాగిరి. సావిత్రి తడఁబడుచు, ఎవరికంట నైన పడునేమో యనుభయముతో నాలుగు వైపులను చూచినది-ఎవ్వరును కానరాలేదు. అప్పు డామె భర్త పాదముల దగ్గఱ "నూనె" అనుచు గిన్ని నుంచినది.

"అది కనఁబడుచునే యున్నది, కాని ఒక మంచి వినో-దమున్నది, వినెదవా?" అని విశ్వేశ్వరుఁ డనెను.

సావిత్రి ప్రార్థనపూర్వకముగ చూచుచు, "పని-యున్న దిప్పుడు, నన్ను పోనిండు," అని మృదుస్వరముతో నన్నది.

"పొమ్ము, నిన్నెవరు పిలువవచ్చిరి! ముసుఁగంత పైకి యున్న దేమి, ఎవరైన చూడఁగలరు, మఱి కొంచెము క్రిందికి

లాగుకొనుము!" అనుచు విశ్వేశ్వరుఁడు ఆమె ముసుఁగును మఱి కొంచెము క్రిందికి లాగెను. అచ్చట నుండుట ప్రమాదమని ఎఱిఁగి వధువు ఇంటిలోనికి పాఱిపోయినది.

"ఇదిగో, ఇది వినుము, వినుము—సరే జ్ఞప్తియుంచు-కొనుము—పగ తీర్చుకొనెదను, చూచుచుండుము."

ఏఁటిలో స్నానముచేసివచ్చి విశ్వేశ్వరుఁడు భోజ-నమునకై కూర్చుండియున్నాఁడు. వడ్డించుచు పిన్ని అనేక-ప్రశ్న లడుగుచున్నది. "హరి కొఱకు పిల్లను చూచివచ్చితివి కదా, ఆమె ఎట్లుండును? నిన్ను, సావిత్రిని తమ యింటికివచ్చి నాలుగురోజు లుండుమని అడుగపంపినది మీ అత్తగారు. నాలుగురోజులపాటు కోడలిని అమ్మగారి యింటికి పంపవలె-నని అనుకొనుచున్నాను—తోడు యీడు పిల్ల లిక్కడెవ్వ-రును లేకుండుటవలన, పాపము, ఎల్లప్పుడును, నోరు మూసి-కొనియే యుండును. కాని అట్టే రోజులుండదు, ఆమె యిక్కడ లేకున్న నాకు ఏమియు తోఁచదు. నీ దుకాణములో బాగుగా లాభము వచ్చుచున్నదఁట యిప్పుడు—హరి యన్నాఁడు?" పిన్ని యడుగు ప్రశ్నల కన్నిటికిని, "ఔను," "ఆహా!" "నిజమే!" అనుచు అతిక్లుప్తముగ ఉత్తర మిచ్చుచు విశ్వేశ్వరుఁడు నడుమనడుమ తలయెత్తి వంటయింటి తలుపు-సందువైపు చూచుచుండెను, కిటికీవైపు చూచుచుండెను—తానిట్లు కోపముతో నిచ్చుచుండు జవాబులు వంటయింట నుండు నామె చెవిని పడునని విశ్వేశ్వరుఁ డాశించుచుండెను.

భోజనముచేసి విశ్వేశ్వరుఁడు పడకగదిలోనికి వచ్చెను. సావిత్రి ఇతఁడు లేనప్పుడు గదిలోనికి వచ్చి మంచము ప్రక్క నుండు ముక్కాలి పీటపై మంచినీళ్లగ్లాసు, తాంబూలము, తువాలు ఉంచి వెళ్లిపోయినది. ఇవి విశ్వేశ్వరుని కంటఁ బడఁగానే అతనికి కోపము వచ్చినది, తమలపాకులు వేసికొనకుండ నతఁడు పరుండఁబడి పోయెను. వెనుక నొకనాఁడీవిధముగ కోపగించి తాంబూలము మాని పరుండఁబోవ, సావిత్రి దుఃఖముతో నతనివైపు పెట్టుచూచుచు నిలిచియుండెనో విశ్వేశ్వరునకు హఠాత్తుగ జ్ఞప్తికివచ్చి, అతఁడు మఱలలేచి తాంబూలము వేసికొని సావిత్రిపై తనలో తాను కోపపడుచు ఇఁక నెన్నఁడు నిట్టి యపరాధము క్షమింపనని యనుకొనుచుండెను.

గంట, గంటన్నర నిద్రపోయి లేచి పని చూచుకొనుటకై విశ్వేశ్వరుఁడు చొక్కా, జోళ్లు తొడుగుకొని బయలుదేఱెను. ఇప్పు డతనికి పరిహాసమునకు వేళలేదు, ఐనను పోవుచు పోవుచు పిన్ని తలుపునొద్ద చెవిపెట్టి వినెను. మహాభారతపఠనము జరుగుచున్నది, పిన్ని వినుచున్నది.

సాయంకాలము కాకమునుపే విశ్వేశ్వరుఁ డింటికి తిరిగి వచ్చెను. జాహ్నవిని చూచుటకు పోయిన అన్నపూర్ణ ఇంకను రాలేదు. కలహమాడుచు నిట్టి మంచి సమయము పాడుచేసికొనుట వట్టి మూర్ఖత యని తలఁచి, విశ్వేశ్వరుఁడు ఈగది, ఆగది, వెదకి సావిత్రి నెచ్చటను కానక తుదకు దేవతార్చనచేయు గదిలోనికి తొంగిచూచెను. పట్టుచీర కట్టుకొని

యున్న సావిత్రి రాగి తబుకులో పువ్వులు వేసికొని అగడిలో మాలగ్రుచ్చుచున్నది. విశ్వేశ్వరుఁ డొకమాలు ప్రేమ నిమగ్నులై యున్న దేవతాద్వయము వైపుచూచి, ముఖము వాల్చుకొని క్రిందనున్న సావిత్రి వైపుచూచెను. అతినిపుణుఁడగు శిల్పి యెవఁడో పైనుండు దేవిముఖమున విచిత్రభావ మొకటి వ్యక్తముఁ జేసెను; సింహాసనము నెదుట, క్రిందను కూర్చుండియున్న యువతి ముఖమునకూడ ఆమధురచ్ఛాయ లే కానవచ్చుచుండెను. విశ్వేశ్వరుఁడు చప్పుడు చేయక మెల్లఁగా దగ్గఱకు వచ్చి "ఎవరికొఱకీ మాల?" అని యడిగెను.

సావిత్రి ఉలికిపడి తలయెత్తి చూచి, ముసుఁగు ముందుకు లాగుకొని, "దేవత కొఱకు," అని మృదుస్వరముతో ననెను.

"ఏ దేవత కొఱకు?"

సావిత్రి ముఖమెత్తి భర్త వైపు చూచినది. "నీ దేవత ఎన్నిరోజుల కొకమాలు మాలుచుండును సావిత్రీ? దేవతాపదవినిచ్చుటకుఁగాని తీసికొనుటకుఁగాని నీకట్టెరోజులు పట్టన ట్లున్నదే!" అని విశ్వేశ్వరుఁడు గంభీరముగా ననెను. సావిత్రి చిఱునవ్వునవ్వుచు ముఖము వాల్చినది. రెండు చేతులతో నామె ముఖమునెత్తి పట్టుకొని ఆమె దాఁచుచున్న చిఱునవ్వును కన్నులార నొకసారి చూడవలె నని విశ్వేశ్వరునకు బుద్ధి పుట్టినది. విశ్వేశ్వరుఁ డామెకు దగ్గఱగా వచ్చి కూర్చుండి సగము గ్రుచ్చిన పూలదండను ఆమె చేతులలో-

నుండి లాగి తీసికొని, "నేను మాత్రము నా పదవిని సులభ-ముగ వదలువాఁడను కాను. కనుక ఈ మాలనాది," అని యనెను.

సావిత్రి భయపడుచు ప్రత్యుత్తర మిచ్చినది—"ఏమి-చేసితిరి! పాపము వచ్చును, దేవుని కొఱకు అత్తయ్య—"

"అట్లైన ఏ దేవునికొఱకో చెప్పితివి కావేల? పూర్వము నీనోటితో నుచ్చరించిన పండితవాక్యములు మఱచిన-ట్లున్నావు?"

సందర్భము జ్ఞప్తికి తెచ్చుకొని, భర్తధోరణి గ్రహించి సావిత్రి పూల పళ్లెము వెనుక దాఁచినది. దేవుని యెదుట భర్త చేసిన పనివలన పాపము కలుగునని భయముఁజెంది విగ్రహామునెదుట తల నేలమోపి ప్రణామము చేసినది. విశ్వేశ్వరుఁ డంతలో ఆ సగము గ్రుచ్చిన మాలను చక్కఁగా తన మెడలో వేసికొనెను. సావిత్రి దేవునికి ప్రణామము చేసి తల యెత్తఁగానే విశ్వేశ్వరుఁడు ప్రారంభించెను—"ఇటు-ప్రక్క మఱియొక దేవుఁడు నిరీక్షించుచు నిలిచి యున్నాఁడు. ఆహా, ఎటువంటి భక్తురాలు కదా, ఈ దేవునకొక నమస్కార మైనను లేదు, ఏమి, వీని భాగ్యము? పాపము!"

సావిత్రి తడఁబడుచు భర్తవైపు పాకమాఱు చూచినది. అనేక విషయము లామెకు జ్ఞప్తికివచ్చి యుండ వచ్చును. తన యెదుట నిలిచి యున్నవాఁడు నిజముగా విశ్వమున కీశ్వరుఁడే యని ఆమెకు తోఁచియుండ వచ్చును. అత్యుత్సాహముతో

హఠాత్తుగ సావిత్రి మోకాళ్లపై వ్రాలియు వ్రాలక మునుపే పైనుండి వచ్చి రెండుచేతు లామెను గట్టిగా పట్టుకొనినవి. "చాలును చాలును," అనురాగముతో విశ్వేశ్వరుఁ డనుచుండు మాటలు సావిత్రి చెవినిపడినవి. సావిత్రి సిగ్గుపడిలేచి మఱియొక వైపు చూచుచు, "నమస్కారము చేసిన యెడల తప్పా?" అని మృదుస్వరముతో నడిగెను.

"తప్పే, సందేహ మేల? గురువు శిష్యులవలె• కేవలము నమస్కారములు ఆశీర్వాదములు చేయుచుండుటకు సిగ్గక్కఱలేదా?"

"సిగ్గేల? దేవునికి నమస్కారము చేయుటకు సిగ్గేల?"

విశ్వేశ్వరుఁడు రెప్పపాటు లేక సావిత్రి వంక చూచుచుండెను. ఆ చూపులో నింద, దుఃఖము ప్రేమవలన పుట్టిన పౌరుషము కలిసి యుండెను. ఆచూపు సహింపలేక సావిత్రి ముఖము వాల్చుకొనినది.

విశ్వేశ్వరుఁ డప్పు డామెను—"సావిత్రీ, ఇప్పటికిని నీ నోట ఆమాటయే? నీ మనస్సున నేమి యున్నదో నాకు నేఁటికిని తెలియకున్నదే! నే నిప్పటికిని నీకు పరుఁడనే? దూరముగ నుండవలసిన వాఁడనే?" అని యడిగెను.

విశ్వేశ్వరుని ధోరణివలన సావిత్రి మనస్సున బాధకలిగి, మ్లానముఖముతో ఆమె, "ఇంత మాత్రమున దూరమైనట్లే?" అని యడిగినది.

"కాక మఱేమి? దేవుఁడని, దేవతయని ఎవరినందురు?"

"అనాథల కాశ్రయ మిచ్చువానిని, దుఃఖితులగువారి దుఃఖమును దూరము చేయువానిని, దారి ప్రక్కను అడుగు కొనుదానిని సింహాసనముపై కూర్చుండఁబెట్టు వానిని—"

విశ్వేశ్వరుఁడు, సావిత్రిని దగ్గఱకు లాగుకొని ఆమెను తన గుండెపై నొక్కికొనుచు మెల్లఁగా నిట్లనెను—"కాని ఎవరు హృదయపూర్వకముగ ప్రేమించుచుందురో, ప్రేమను కోరుచుందురో వారు మానవులు. ఎవ రెట్లనినను అన నిమ్ము, కాని నీవు నాకింత దగ్గఱ నుండికూడ అట్లనఁగూడదు. నేఁడు నాకింత దగ్గఱనుండి కూడ నా హృదయమున నున్నది నీ వెఱుఁగవా? నేఁడింత దగ్గఱ నుండికూడ మన మిద్దఱమును దూరముగనే యుండవలెనా సావిత్రీ?"

సావిత్రి యిప్పుడు భర్తగుండెపై ముఖమును దాఁచుకొనినది—భర్తతో నీ విధముగ చెప్పఁబోవుచున్నది—"నీవు నాకిచ్చినది నే నెన్నఁడైన నాశింపఁ గలిగినదా? నేను నీకు తగిన దాన నని నే నిప్పటికిని అనుకొనఁ గలనా? తుపానుకెగిరి పోవు గడ్డి పరకలవలె మేము కొట్టుకొని పోవుచుండ నీవు మా కాశ్రయ మిచ్చితివి; అంతే కాదు, ఎన్నఁడును మే మాశింప లేనిదికూడ మా కిచ్చితివి—నాకు నీపాదములకడ స్థానము నిచ్చితివి. ఇంతకు మించిన దేదియు తలంపశక్యము—భరించు శక్తి నాకు లేదు."

హఠాత్తుగ బయటినుండి, "చిన్నక్కా!" అనిబాలకంఠమున మాటలు వినఁబడినవి. "కాళీ వచ్చినాఁడు," అనుచు సావిత్రి బయటికి వెళ్లిపోయినది. పిన్ని అప్పుడే అంగణములోనికి వచ్చి నిలిచియుండెను. కనుక విశ్వేశ్వరుఁడు మఱియొక దారిని తన పనిపై పోయెను. కొంచెము సేపైన తరువాత సావిత్రి విశ్వేశ్వరుని గదిలోనికి వచ్చి దీపము వెలిగించినది. విశ్వేశ్వరుఁడు తమలపాకులపళ్లెము చేతిలో పట్టుకొని సావిత్రికి చూపుచు, "మన పోట్లాట కొంతకాలమువఱకు ఆఁగిపోయినది," అనెను. సావిత్రి గదిలోనుండి పరుగెత్తి పాఱిపోయినది.

విశ్వేశ్వరుఁడు పుస్తక మొకటి చేతపట్టుకొని పుటలు త్రిప్పుచు కూర్చుండెను. ఏమియును చదువుచుండుట లేదు. కేవలము పుటలు చూచుచు త్రిప్పుచుండెను. అతని హృదయ మానందముతో నిండుచుండెను. ఊహానిర్మిత క్రీడలలో నతఁడు మునిఁగి యుండెను. అతని దేహమున, మనస్సున పులకరింపు పుట్టుచుండెను. పుస్తకములోనుండి హఠాత్తుగ జాబొకటి అతని యొడిలో పడినది. అది ఆ జాబు, సతి వ్రాసినది. అందుండునవి సతి కడపటి మాటలు. ఆజాబున నున్నదంతయు విశ్వేశ్వరుఁడు జ్ఞప్తికి తెచ్చుకొనెను—మిగుల బాధఁజెంది, శపించుచు సతి యనిన మాటలందున్న వని ఆజాబు మొదట చదివినప్పుడు విశ్వేశ్వరునకు తోఁచినది. కాని ఇప్పు డతనికట్లు తోఁచుచుండ లేదు—అది వేదనాభరితమగు హృద-

యముతో, శుభమును కోరుచు, ఆమె తనకిచ్చిన అనంతా శీర్వాదమని తోఁచుచున్నది. అట్టిఅధమజాతికి చెందిన స్త్రీలలో నొకరిని భార్యగా నెంచుకొనెదవు, ప్రేమించెదవు. ఆయధమ-జాతికి జెందిన మానవుల హృదయములలో ప్రేమ సముద్రము దాఁగియున్నదని స్వానుభవమువలన తెలిసికొనెదవు. స్త్రీహృదయ మిచ్చిన ప్రేమ నందుకొనుట, ఆమెకు ప్రేమ నిచ్చుటకంటె శ్రేష్ఠమగు సుఖమీ లోకమున లేదని ఒప్పుకొనె-దవు—సతి ఈధోరణిలో వ్రాసిన మాట లతనికి జ్ఞప్తికి వచ్చినవి. ఇది శాపమా? కాదు కాదు— ఇది భవిష్యత్తును చెప్పు దైవజ్ఞుని మాటలు! మూఢుఁ డగుటచే వాని యర్థమతఁడు కనుఁగొన లేకుండెను—"నీవుసుఖింతువు గాక!" అని సతి వ్రాసిన చివరమాట లతని కంటఁబడెను, విశ్వేశ్వరుఁడా జాబును తలకద్దుకొనెను.

ఆజాబు చించివేయుట మేలని విశ్వేశ్వరున కప్పుడు తట్టినది. ఎన్నఁడైన ఆజాబు సావిత్రి కంటఁబడిన యెడల ఆమె దుఃఖము రెండింతలగును—అందున కేమాత్రమును సందేహము లేదు. సావిత్రి అక్కవిషయమై మిగుల దుఃఖించు-చున్నది, ఈజాబా దుఃఖజ్వాలలపై పోసిన నేయి యగును. సావిత్రి కిది తెలియకుండఁగ నుంచవలె నని యనుకొని విశ్వే-శ్వరుఁడు దుఃఖితుఁడగు చుండెను కాని వేఱు ఉపాయమేదియు తోఁచక జాబును దీపముపై పట్టుకొని తగులఁ బెట్టెను.

## పదునెనిమిదవపరిచ్ఛేదము.

సంవత్సరాంతమున చైత్రమాసమున* విగ్రహమును ప్రతిష్ఠ చేయించ వలెనని అన్నపూర్ణ తలఁచినది. కాని అనేక కారణములవలన అది సాధ్యము కాలేదు. విశ్వేశ్వరుని వివాహమయి రెండేండ్లైనతరువాత దైవికముగా ఆ పెండ్లిముహూర్తమే మందిర ప్రతిష్ఠకై నిర్ణయింపఁబడినది.

ఈలోఁగా సావిత్రికి మఱియొక పెద్ద దెబ్బ తగిలినది. ఈలోకములో నెట్టి యవస్థలో నున్నను శాంతి లేదనునట్లు జాహ్నవి హఠాత్తుగ నొకనాఁడు ప్రాణమువిడిచి చిరశాంతిని పొందినది. సావిత్రి మొదట భరింపరాని దుఃఖము పొందినది. కాని రానురాను అమ్మ అక్క యొద్దకుపోయి సుఖముగా నున్నదని మనస్సును సమాధాన పఱచుకొనినది. చిన్న-కొమార్తె సుఖముగానున్నదని కనిపెట్టి తల్లి తన భాగ్యహీను-రాలగు కొమార్తెను సుఖపెట్టఁగోరుచు నామెయొద్దకు పోయినదని యనుకొనుచు సావిత్రి కన్నీరు తుడుచుకొను-చుండెను. వారి పెండ్లియాడి సుఖముగా నుండెను. కాళీ-పదుఁడు అక్కను వదలి యుండలేకుండెను. భట్టాచార్యుల యిల్లిప్పుడు నూతనజీవులతోను నూతనసుఖదుఃఖములతోను నిండియున్నది.

---

* బంగాళీసంవత్సరము వైశాఖముతో ప్రారంభమగును.

మందిర ప్రతిష్ఠ జరిగినది, అందుండు అన్నపూర్ణాదేవి విగ్రహప్రతిష్ఠకూడ జరిగినది. ఉత్సవముతో గ్రామము మిగుల నాందోళితమైనది. అన్నపూర్ణ తన యాస్తియంతయు నిచ్చి గొప్ప సత్రమును కట్టించి, సదా దాన ధర్మములు జరుగుచుండుట కేర్పాటు చేయించునని అందఱు ననుకొనుచుండిరి. విశ్వేశ్వరుని యుద్దేశముకూడ మొదట నదియే, కాని పిన్ని అట్టిదాని కొప్పుకొనలేదు—పిన్ని విశ్వేశ్వరునితో నిట్లన్నది:—

"తిండికిలేనివారికి భగవంతుఁ డేదోవిధముగ తిండి నిచ్చుచున్నాఁడు, కాని మనుష్యుని దౌర్జన్యమువలనను, సంఘముయొక్క దౌర్జన్యమువలనను, పీడితులగువారిదుఃఖము ప్రపంచమున కలుగు దుఃఖము లన్నిటికంటె అధికమైనది. డబ్బులేనివారికి ఆఁడుబిడ్డలవలన మన దేశమున కలుగుచుండు బాధ నివారణార్థమై నాడబ్బుతో నేదైన నేర్పాటొకటి చేయుము విశూ. దానధర్మములమూలమున పుణ్యము పొందవలె నను కోరిక నాకు లేదు నాయనా. తలిదండ్రులు నిరుపేద లగుటవలన మన దేశమున పాలుత్రాగు పసిబిడ్డలు శాశ్వతముగ నగ్నిజ్వాలలో పడి కాలకుండునటుల నేదైన చేయఁగలిగినయెడల నేను పుణ్యాత్మురాల నగుదును. నాయాస్తి మిగుల సామాన్యమైనది. దీనివలన ఒక్క బిడ్డ కన్నియైనను ఆఁపఁగలిగిన యెడల నాయర్థము సార్థక మగునని నా నమ్మకము."

విశ్వేశ్వరుఁడు తల్లియాజ్ఞను పాలించుచు, "అన్నపూర్ణ భాండాగారము"ను స్థాపించెను. తన పేరు వద్దని పిన్ని చాల అభ్యంతరపఱచినది కాని విశ్వేశ్వరుఁడు పట్టినపట్టు వదలలేదు.

అన్నపూర్ణమందిరమున ఆనాఁడు గొప్ప సందడి జరిగినది. గ్రామముననుండు ఆబాలవృద్ధు లందఱికిని విందుచేసిరి. బీదసాదలకు భోజనము పెట్టించి బట్టల నిప్పించిరి. దూరదేశములనుండి వచ్చిన పండితగణమునకు విందుపెట్టించి సన్మానముచేసి పంపిరి. ఈకార్యమున గ్రామస్థులందఱును మిగుల నుత్సాహముతో తోడ్పడిరి. విశ్వేశ్వరు నాదరింపని వాఁడు, విశ్వేశ్వరుని మేలు కోరని వాఁడు ఆగ్రామమున నిప్పు డొక్కఁడైనను లేఁడు.

సావిత్రికూడ ఆనాఁడు పైటచెంగు మొలకుచుట్టి అన్నము వడ్డించుటకు దేవాలయములో సిద్ధమైనది. అన్నపూర్ణ ఎంత వద్దు వద్దన్నను సావిత్రి వినలేదు.

చాల ప్రొద్దుపోయినది. విందింకను పూర్తికాలేదు. అన్నపూర్ణ సావిత్రినిచూచి "ఏమి తల్లీ, నీకేమి పిచ్చియా! చచ్చిపోయెద వింక! కొంచెము కూర్చుండుము, నోట గుక్కెఁడు నీళ్లు వేసికొనుము," అని యనుచు నామెను అన్నమురాసుల నడుమనుండి బయటికి లాగుకొని వచ్చినది. ఎటువైపు చూచినను జనసమ్మర్దముగ నుంటచేత అన్నపూర్ణ సావిత్రిని మందిరములోనికి త్రోసినది.

ఎదుట నవాధిష్ఠిత మగు అన్నపూర్ణాదేవి విగ్రహము, ఉజ్జ్వలశోభతో ప్రకాశించుచున్నది. సావిత్రి మొలనుచుట్టిన చెంగు విప్పి చెమట తుడుచుకొని విసరుకొనుచున్నది. అట్టి-సమయమున ద్వారముప్రక్కనునిలిచి యెవరో, "మిక్కిలి దాహముగా నున్నది. దేవి చరణామృతము కొంచె మీయు-మమ్మా!" అని యనిరి. సావిత్రి మెడ పైకిచాచి చూచినది__ దేహమంతయు కూర అన్నముతో నిండియున్న విశ్వేశ్వరుఁడామె కంటఁబడెను. అలసియుండుటచే నతని దేహమంతటను చెమట పట్టియున్నది.

మఱి యెవ్వరు నచ్చట లేకుండుటఁజూచి విశ్వేశ్వరుఁడు మందిరములో ప్రవేశించెను. సావిత్రి పైటచెంగుతో భర్తను విసరుచు, "మీరింత శ్రమపడుచున్నారేమి?" అని యనెను.

"నీవో?" అని యనుచు విశ్వేశ్వరుఁడు చిఱునవ్వు నవ్వెను. సావిత్రి త్వరత్వరగా దేవి చరణామృతమును, ఒక గ్లాసు షరబత్తును తెచ్చి భర్తకిచ్చెను. విశ్వేశ్వరుఁ డది త్రాగి మిగుల ననురాగముతో," సావిత్రీ నేఁ డే తిథియో జ్ఞాపక-మున్నదా?" అని యడిగెను.

"జ్ఞాపకమున్నది" అనుచు సావిత్రి నవ్వినది.

"నేఁ డింత పని తొందరలోను మాటిమాటికిని నా-కెందుకోగాని ఆ మాటయే జ్ఞప్తికివచ్చుచున్నది! కాని సావిత్రీ, పెండ్లినాఁడు వారా విధముగ చేయక యుండిన నేమైయుండును?"

"ఎన్నిమాఱు లడిగెద రామాట ? ఏమైయుండును—. మంచిదై యుండును!"

"నాకేనా మంచి? మరి అమ్మగారి కేమియు కాక పోనేమో?"

సావిత్రి మిగుల ననురాగముతో ప్రత్యుత్తరమిచ్చెను—"ఇప్పు డవి యన్నియు ననుకొనుచుందు నేమో-కాని అప్పుడు, నేను కేవల మొక జడపదార్థమువలె నుంటిని. అప్పు డేమిజరిగినను దాని మంచి చెడ్డలు నేనెఱుఁగక పోయియుందును—అమ్మనాపదనుండి తొలగించుటయే అన్నిటికంటె గొప్ప పుణ్యమని నమ్ముచుంటిని. ఎట్టికోరికనైనను కోరుటకు నా కప్పుడు శక్తిలేదు."

విశ్వేశ్వరుఁడు రెప్పపాటులేక ఆ యనురాగపూరితమగు సావిత్రి వైపుచూచుచు, తనలో తాను, "ఔను నిజమే, నీవట్టి సన్న్యాసివైనసావిత్రివే! లేకున్న అజ్ఞానాచ్ఛన్నమగు నావంటి నిర్జీవునిలో నవజీవన మెట్లు పుట్టించఁ గలిగియుందువు?"



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1931.

# విశ్వభారతి గ్రంథమాల

## రవీంద్రనాథుని "ఇంటా బయటా"

భారతి:

"... ... ... ... ... ... కథ యతి మనోహ-రమై, యింపుగా నున్నది. పాఠకులయందు మంచి భావదీప్తిని కలుగజేయగలదు. చక్కని ఉన్నతమైన భావములకు సముద్ర-ముగదా రవీంద్రుని రచన!

భాషాంతరీకరణము అతి సరళముగాను, స్వేచ్ఛగాను, సహజముగ నున్నది. చక్కని యింపైన వాడుక భాష యుపయోగింపబడినవి. ఠాకూరుగారి భావముల కేమాత్రమును నష్టము కలిగియుండదనియే చెప్పవచ్చును.

... ... ... ... ...

మంచికాగితముపై చక్కనియచ్చు మంచిబైండు."

గిడుగు రామమూర్తిపంతులుగారు:

"... ... ... ... ... ... అనన్య సాధ్యమయిన పని సాధించిన నాప్రియమిత్రునికి అభినందనములు. ... ... మన మాతృభాషయొక్క మాధుర్యము, స్వచ్ఛత నీ గ్రంథ-ములందు అభివ్యక్తమవుతున్నది. ... ... ... ... రఇ

పుటలూ కలిపి చేతిలోపట్టుకొని చూచినప్పుడు ఆనంద బాష్పములు పడ్డవి."

"రవీంద్రుని పోష్టాఫీసు"

భారతి:

"... ... ... ... ... ... కథ అతిసులభమై నదిగాను, సాధారణమైనదిగాను కన్పడుచున్నను ఇందలి భావములు కడునుత్తమమైనవి.

మనుష్యజీవనము ఆవేదనవలన, ముక్తజీవనపథగామిగా యెట్లగుటకు యత్నించునో కవి యిందు తెలియబరచు-చున్నాడు.

బాలుని ముద్దులొల్కుపదములు యింపుగొలుపుచుం-డును. భాష సరళమై, ఆనందము నొడగూర్చుచున్నది. ...

మేతర్‌లింక్ కవి 'స్టిల్‌మాంద్ మేజస్ట్రేట్'

ఆంధ్రపత్రికా సారస్వతానుబంధము:

... ... "ఈకథయందు స్వార్థపరుల విచక్షణలేని యన్యాయ ప్రవర్తనలును; స్వార్థరహితుల, ధర్మకాంక్షాపరుల న్యాయైక-వర్తనయు, పరోపకారనిరతియు చక్కగా చూపింపబడినవి.

వాడుకభాషలో సుబోధకముగా వ్రాయబడినది. ...

... ... ... భావము లుత్తమమైనవి........."



# విశ్వభారతి గ్రంథమాల

# ఇంటా బయటా

ముగ్గురుముఖ్యపాత్రలూ తమతమ అవస్థలనుండి వేరు వేరుగా చెప్పి కలిపిఅల్లిన మూడుపాయల జట ఈ కథ.

సత్యకాముడైన నిఖిల్ కోరేది స్వాతంత్ర్యము— తనకు స్వాతంత్ర్యము కావలెను, తన భార్యకు కావలెను, తనదేశములో ఉండే యావన్మందిప్రజలకూ కావలెను, ప్రపంచములోఉండే సమస్త దేశాలకూ కావలెను. స్వేచ్ఛలేనిజీవనము జీవనము కాదు, స్వేచ్ఛలేనివారు చేసిన పనికి అర్థము లేదు. గనుక తనభార్యను అంతఃపురంమధ్యనుండి బయటి ప్రపంచముయొక్క బహిరంగములోనికి బలవంతపెట్టి తీసుకు వస్తాడు. అక్కడ తనభార్య తనను తాను పూర్తిగా తెలుసుకొని తన జీవితాన్ని తానే ఎంచుకోవలెనని నిఖిల్ ఉద్దేశము. అటువంటిప్రయత్నము చేసేవారికి దారిలో సంఘటిల్లే చిక్కుల గురించీ, జయాఽజయాల గురించీ, సుఖ దుఃఖాలగురించీ తెలుసుకోవలెనన్నా లేక వాటివల్ల మనజ్ఞానము పొందగల వికాసముగురించి తెలుసుకోవలెనన్నా "ఇంటా బయటా" కంటె మంచిగ్రంథము దొరకదు.

సందీప్ స్వదేశీప్రచారకుడు, వాడిఅయిన మనస్సుగలవాడు, తళుకు తళుకున మెరిసే మాటలప్రవాహాలను వదలగలవాడు. ఇతను 'వందేమాతరం' మంత్రం పఠిస్తూ రోడ్డు వెంబడి వెళుతూంటే హిందూమహాప్రపంచములో పుస్తకాలు చదువుకొంటూ కూర్చొగలిగిన స్కూలుకుర్రవాడేడీ, తన పని

తాను చేసుకొంటూ కూర్చోగలిగిన యువకుడేడీ? ఇతనికి కావలసినది స్వదేశీ, స్వదేశము—దీనికి మించిన ధర్మము లేదు దీనికిమించిన నీతి లేదు, శక్తి లేదు, నిజము లేదు; దీనికి అడ్డుగా వచ్చిన నీతిని, ధ్వంసము చేయవలెను, సత్యాన్ని మంటిలో కలిపివేయవలెను, అనేవాడు సందీప్. నిఖిల్ కోరేది నిజము. నిజము త్యజించడమువల్లగాని స్వదేశీ విస్తరింపజేయలేనప్పుడు, స్వదేశీ అక్కర లేదు నిఖిల్‌కి. దేశమంతా ఏదికోరితే అదే నిజము సందీప్‌కి. దేశమే దేవత అతనికి, దేశస్థులు అందరూ అక్కరలేదంటూఉన్న సత్యము అసత్యము. 'నా దేశమే నీతి కంటె గొప్పది, సత్యముకంటె గొప్పది, అనేవాడు నిజముగా దేశానికి ఉపకారము చేస్తాడా, లేక చివరకు పనులు చేస్తూ ఉన్నప్పటికీ నా దేశము నిజముకంటే గొప్పదైనట్టుగా దేశోద్ధారకుడనైన నేను దేశముకంటే కూడా చాలాగొప్పవాడను అనే వాదములోకి వచ్చి తేలుతాడా? "ఇంటా బయటా" చదివి మీరు ఆవిషయము మరింత చక్కగా యోచించగలరు

విమల నిఖిల్ భార్య, ఎటువంటిఅనుభవమూ లేదు, అనుభవమువల్ల రావలసిన జ్ఞానము ఇంకా పుట్టలేదు, ముగ్ధ. ఇంటిగోడలమధ్యనున్న ప్రపంచముతప్ప మరి ఏపజీవమైన పదార్థాన్నీ ఎరగని ఈమె కనపరిచే పతిభక్తికి ఏమి విలువ ఉన్నది? అందుచేత సజీవియైన వాటికొరకు వెర్రికోరికగల నిఖిల్ ఆమెను బలము ప్రయోగించి బహిరంగప్రపంచములోకి పంపుతాడు. విమలవంటివారి దశ ఏమి కావచ్చును? నడిసముద్రములో

విడిచిపెట్టిన చుక్కాని లేని ఓడవలె నాశన మయిపోతారా? గాలి ఎటువైపు కొడితే అటువైపు కొట్టుకుపోతారా? లేక దెబ్బలు తిని తిని మెలకువ తెచ్చుకుంటారా? అటువంటివారికి జ్ఞానవంతులు ఏవిధమైన సహాయము చేయగలరు ?—హాని కలగవచ్చు నని శాశ్వతముగా గదిలో పెట్టి తాళము వేస్తారా? మోతాదు మోతాదుగా కొలిచి స్వేచ్ఛ ఇస్తామంటారా? స్వేచ్ఛ ఒకరికి ఇంకొకరు ఇవ్వవలసిన పదార్థమా?—ఇటువంటి నానారకాల విషయాలూ బాగా బోధపరుచుకో దలచినవారు "ఇంటా బయటా" చదివితీరవలెను.

మనోహరమైనకథ చెప్తుతూ మనకే తెలియకుండా మన మనస్సులలో మూలమూలలను దాగిఉన్న ఆశలనూ, కోరికలనూ, మనకు తెలియజేస్తున్నారు ఠాకూర్ గారు. మనుష్యుని విలువ దేనిలో ఉన్నది, దేశభక్తి అనగా ఏమిటి, దాంపత్యములో ఉండే శాశ్వతవస్తు వేమిటి, దేనివల్ల దాంపత్యము పృథ్విమీదఉండే అన్నిపదార్థాలతోనూ గొప్పది కాగలదు.— ఇటువంటివి అనేక ఆలోచనలతో నిండిఉన్న మనుష్యుల మనస్సుల చరిత్రలతో అల్లిన ఇంపైన కథ "ఇంటా బయటా."

కవులలో అగ్రస్థానమునకు అర్హుడైన రవీంద్రనాథుని గ్రంథాలలో మొదటి వరుసను ఉంచదగిన గ్రంథము ఈ "ఇంటా బయటా."

# గృహప్రవేశం

ప్రేమతో నిండిఉన్న పూర్ణజీవనము సార్థక మానవ జీవనము. ఆ జీవనము సంపాదించుటకు మానవుడు చేయవలసిన ప్రయత్నము మనలో పురికొల్పి దానికితగిన ఉత్సాహము మనలో పుట్టించడానికి విశ్వహృదయము సదా కనిపెట్టుకొని ఉంటుంది. అట్టివిశ్వహృదయము ఠాకూర్ గారువ్రాసిన ఈనాటకములో, అక్కబిడ్డలకు తన సర్వమునూ అర్పించి తనజీవనము సార్థకపరుచుకొన కోరుతున్న పిన్ని హృదయముద్వారా వ్యక్తమవుతున్నది. బాహ్యచక్షువుకు కనబడని సంపదకోసమూ స్థూలనేత్రానికి కనబడని సహవాసము కోసమూ మనుష్యుడు తన యావదాస్తీ ధారపోసి ప్రయత్నము చేస్తున్నప్పుడు అటువంటి పిన్ని హృదయము, పూర్తిగా స్వార్థరహితమైనది కావడముచేత, వివేకము బోధపరచడానికి బయలుదేరదు; తనకు చేతనైనంతవరకు ఆ ప్రయత్నములో తోడ్పడుతుంది.

అక్కకొడుకు తనడబ్బంతా ఖర్చుపెట్టి ఊర్వసివంటి తనభార్యమణియెడల తనకుగల అనురాగమును ఎల్లకాలమూ లోకానికి చాటించగలిగే "తాజ్‌మహాల్"ను కట్టించబోయినప్పుడు, అది కేవలము వృథాప్రయాస అని తెలిసినా, మనస్ఫూర్తిగాచేసే ఏ ప్రయత్నమూ వృథాకానేరదని నమ్మి పిన్ని చేసిన హెచ్చరిక అతి మనోహరమైనది.

పూర్తికాని ఆ తాజ్‌మహాల్‌లో గృహప్రవేశం చేయించబోయిన పిన్ని హృదయాన్ని మన హృదయాలలో గృహప్రవేశం చేయించి, షాజహాన్ చక్రవర్తి కట్టించిన తాజ్‌మహాళ్లు ఎన్నైనా ఇవ్వలేని శాశ్వతపదవిని ఆ పిన్ని హృదయానికి ఈ నాటకము ద్వారా రవీంద్రుడు ఇచ్చాడు.

## రవీంద్రనాథ ఠాకూర్ గారి

# కథాగుచ్ఛము

రవీంద్రుని కథాగుచ్ఛములో ఉండే కథలు కొన్ని బాగా చిన్నవి, కొన్ని చాలా పెద్దవి; పద్దెనిమిది పేజీల 'కాబూలీవాలా' అందులోదే, ఎనభై పేజీల 'రాసమణికొడుకూ' అందులోదే. ౧౮౯౩వ సంవత్సరములో వ్రాసిన "సెలవులు" అనే చిన్న కథలో నైతేనేమి, ౧౯౧౭వ సంవత్సరములో రచియించిన "ఒకటవ నంబరు"లోనైతేనేమి రవీంద్రుడు కవీంద్రుడని సార్థకపరచిన అద్భుతశక్తి పూర్తిగా వ్యక్తమవుతున్నది. కథలుచెప్పే నైపుణ్యములో రవీంద్రునితో చాలినవారు ఎక్కడోగాని ఉండరు కాని రవీంద్రునిలో ఉన్నది అట్టి అపూర్వ రచనా నైపుణ్యమొక్కటే కాదు. మానవ హృదయములోని రహస్యాలు కనుక్కొన్నవాడు ఆయన, గనుక ఇతరుల అనుభవాలు అతను చెప్పే ప్రతిచిన్నసంగతి ద్వారా, ప్రతికథద్వారా మన అనుభవములో ప్రవేశించగలదు. రవీంద్రుడు మనకు కథలు చెపుతూ ఉన్నప్పుడు ఆయన చేసేది కేవలము మనచేత తన ఇంపైన కథలను వినిపించడమే కాదు; సజీవులైన స్త్రీ పురుషులమధ్యనూ, మన అన్నదమ్ములు అక్కచెల్లెళ్ల మధ్యనూ, తలిదండ్రులమధ్యనూ, మిత్రులమధ్యనూ, శత్రువులమధ్యనూ, మనను తీసుకువెళ్లి కూర్చోబెడతాడు. వారి ఆనందము మన ఆనందమవుతుంది, వారిదుఃఖము మనలో మానవదుఃఖమును నివారణ చేసే ఉద్యమము పుట్టిస్తుంది. వారికి కలిగే ఆశాభంగము మనను ఆశలేనివారిగా చేయడానికిమారుగా మనలో క్రొత్త ఉత్సాహము పుట్టించి, మానవహృదయములోని ఆశలను సఫలముచేసే క్రొత్తయత్నము మనలో పురికొల్పుతుంటుంది.

రవీంద్రుని కథాగుచ్ఛము మొదటిభాగములోఉన్న కథలు

౧ రాసమణికొడుకు
౨ కాబూలీవాలా
3 భాయిఫోటా
౪ హైమంతి
౫ ఎండా నీడా

రవీంద్రుని కథాగుచ్ఛము రెండవభాగములోఉన్న కథలు

౧. ప్రతిజ్ఞాపాలన
౨ సెలవులు
3 అపరిచితా
౪ మాస్టరుగారు
౫ భార్యవ్రాసిన ఉత్తరము
౬ ఒకటవ నంబరు

---

# పోస్టాఫీస్

మనుష్యుడు ప్రయోగిస్తూఉన్న శిక్షవల్ల లోపునఉన్న జీవనావేగము పూర్తిగా చల్లారని చిన్నపిల్లడు చేసేపనులవల్లా, కోరే కోరికలవల్లా, కనపరిచే అనురాగంవల్లా, పూర్ణవికాసము పొందిన జీవనము ఏరీతిగా ఉంటుందో సూచించే నాటకము.

ఇంపైన కథ చెప్పుతూ మన మనస్సులను వేదనతో నింపి, ఆ వేదనద్వారా ముక్తజీవనము సంపాదించడానికి చేయవలసిన ప్రయత్నము మనలో పురికొల్పే శక్తి రవీంద్రునిలో చాలా ఉన్నది. ఆ శక్తి ఈ నాటకములో అతి మనోహరముగా వెల్లడి అవుతున్నది.

